సజ్జన సంరతు సత్కృపావీక్ష
శ్రీయమృతానంద శ్రీగురురాయ
యుష్మన్నమస్కార ముబ్బుచుఁజేసి
యుత్తరగీతల యుక్తిపూర్వకము
మంజరిఁజేసెద మాన్యులు మెచ్చ

*  *  *  *

అని చూడు మర్జున యతిసూత్మ బుద్ధి
ననిచెప్పెఁ గృష్ణుఁ డీయాత్మ తత్త్వంబు
నిది ప్రథమాధ్యాయ మెలమి దీపింప
చెప్పితి మనమున శిష్యులు మెచ్చ

*  *  *

శ్రీయమృతానంద శ్రీ గురువేర
తోయధిగాంభీర్య తుహినాద్రిధైర్య
లాలితుండధ్యాత్మ లక్షణవేది
శ్రీలలరఁగ ఖేచరీరాజితాత్ముఁ
డైన కౌండిన్యాఖ్యమునిమృగరాజ
గోత్రసంభవుఁడు సద్గురు సంప్రదాయ
కలితుండు వల్లూరి ఘనకులాంభోధి
చంద్రుఁడై మించిల్లు నలలిత శ్రీని
వాసార్య పుత్త్రుండు వరగుణోల్లాస
రమణీయ లక్ష్మీనారాయణయోగి
చెప్పె నుత్తరగీత శిష్యులు మెచ్చ

**End**

అని పరబ్రహ్మాత్ముఁడైన శ్రీ కృష్ణుఁ
డతివిశదంబుగా నానతిచ్చుటయు
నర్జునుండప్పుడే యాత్మవిజ్ఞాన
పూర్ణుఁడై సంతోష భూతినిజెంద

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు

వికృతినామ సంవత్సరం జ్యేష్ఠ శుద్ధ 2 మంగళవారం దిర్ సెప్టెంబరు ఆన 1830 సంవత్సరం యీ ఉత్తరగీతలు మూడు ఆశ్వాసలు సంపూర్ణంగా మాజేటి సర్వేశ లింగం వ్రాసినది

(వి-వి)—

సమగ్రము వ్రాఁత యొకమాదిరిగా నున్నది తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇది మహాభారతమందలి యశ్వమేధ పర్వములోని యుత్తర గీతలకు మంజరీ రూప మగు నాంధ్రీకరణము కౌండిన్య గోత్రుండు వల్లూరి శ్రీనివాసార్య పుత్త్రుఁడునగు లక్ష్మీనారాయణయోగి యమృతానందయోగి కంకితముగా దీని రచించెను.

## No 2073 ఉపదేశ క్రమము

## UPADĒŚAKRAMAMU

Substance, palm leaf Size, 16⅞ × 1⅛ inches Pages, 81 Lines, 6 and 7 on a page Character, Telugu Condition, much injured Appearance old Mode of writing, fair and fairly free from mistakes

Begins on fol 89 *a* The other works herein are —1 *a* Sivajnāna manjari, 20 *a* Paratatvarasāyanamu, 46 *a* Vēdāntasārasangrahamu, 65 *a* Ajnānadhvāntacandabhāskaramu, 130-*a* Astāvakragitāsāstramu

Complete

Same work as that described under R No 195 of Triennial Catalogue, Vol II

(ఏ-బి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పు లంతగా లేవు శైథిల్యము చాలగలదు గ్రంథపాతములు చాల కలవు

ఇది ఆర్ నెం 195 న వర్ణితము

ఇందు యితర గ్రంథములు కలవు —1*a* శివజ్ఞానమంజరి 20*a* పరతత్త్వ రసాయనము, 46*a* అజ్ఞానధ్వాంతచండభాస్కరము, 130*a* అష్టావక్ర గీతా శాస్త్రము

---

## No 2074 ఎంబెరుమానారు శ్రీసూక్తులు

## EMBERUMĀNĀRU ŚRĪSŪKTULU

Substance, palm leaf Size, 16½ × 1¼ inches Page 1 Lines, 4 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, good and free from mistakes

Begins on fol 46 *a*

The other works herein are —1 *a* Guruparampara, 1 *a* (Sanskrit) 4 *a* Pallāndu (Tamil), 5 *a* Kavi Sarpagārudamu, 11 *a* Daśavidhavaisnavamu, 16 *a* Jnānānjanamu, 31 *a* Tirumukappadirahasyam-33 *a* Arthapancakagnānam, 40 *a* Sārāsārasangraham (Tamil), 45 *a* Tengala vadagala Sampradāyabhēdamulu, 47 *b* Astāksaracaramaslōkarahsya, 51 Tadīyarādhanavaibhavamu (Sanskrit), 54 Tattvatrayagnānadikamu

Complete

A Telugu version of the teachings of Śri Rāmānuja to his disciples regarding Cit (animate), Acit (inanimate) and Iśvara (God)

**Beginning**

స్వామి దాసులకు ప్రసాదించిన అర్థము చిత్తున్ను, అచిత్తున్ను, ఈశ్వరుడున్ను అయినష్టువంటి తత్త్వత్రయము లోపలాను చిత్తుక్కున్ను, అచిత్తుక్కున్ను స్వామియైన ఈశ్వరుండు శ్రీమన్నారాయణుండే ఇటువంటి శ్రీమన్నారాయణునికి నిత్యవిభూతిన్ని, లీలావిభూతిన్ని రెండు విభూతులున్ను సౌమ్యైవుండును ప్రకృతిమండ న్ను బ్రహ్మాండాలున్ను లీలావిభూతియైవుండును నిత్యవిభూతి పరమపదమున్ను నిత్యులున్ను ముక్తులున్ను అయివుండును

**End**

సృష్టికాలమందు ఇంతవట్టున్ను కలిగివుండును ఈలాగున లీలావిభూతియందును సృష్టి సంహారాలు ప్రవాహరూపేణ నడస్తున్ను వుండును నిత్యవిభూతైన పరమపదానకు ఒక న్ను లేదు గనక పెరుమాళ్లున్ను నిత్యముక్తులున్ను నిత్యభోగ మనుభవించుక వుందురు తిరుక్కోవలూరి యెంబెరుమానారు జియ్యంగారు అనతిచ్చిన ఈ సూక్తులు దాసులయినవారు నమ్ముకొని శ్రీ భాష్యకారులనంగాను లక్ష్మణమునితారైనారు గనుక సుఖానవుండేది

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది తప్పులేవు శైథిల్యము గలదు గ్రంథ పాతములు గలవు

రామానుజులవారు శిష్యులకు చిదచిదీశ్వరులనుగూర్చి చేసిన బోధమిది అరవమున కిది తెలుగైయుండును.

ఇందలి గ్రంథాంతరములు —1a గురుపరంపరా (సంస్కృతము), 4a పల్లాండు (అరవము), 5a కవిసర్పగారుడము, 11a దశవిధవైష్ణవము, 16a జ్ఞానాంజనము, 31a తిరుముహప్పడి రహస్యము, 33a అర్థపంచక జ్ఞానము, 40a సారాసార సంగ్రహము (అరవము), 45a తెంగల వడగల సంప్రదాయ భేదములు, 47a అష్టాక్షరచరమ శ్లోక రహస్యం (సంస్కృతము), 51 తదియారాధన వైభవము (సంస్కృతము), 54 తత్త్వత్రయ జ్ఞానాదికము

---

## No. 2075. ఏకాదశస్కంధసార సంగ్రహము

## ĒKĀDAŚASKANDHASĀRASAṄGRAHAMU

Substance, palm leaf Size, 17¾ × 1⅜ inches Pages, 103 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —*52-b* Mahāvākyamulakarthamu, *53-a* Ātambōdhaprakaranamu

Complete

This is a Telugu exposition by Purusōttamānandatīrthaguruswāmi of the same work in Sanskrit by Brahmānandasarasvatisvāmi It explains the Vedantic verses found in the eleventh Skandha of Śrī Visnu bhāgavata

**Beginning**

శ్లో॥ ఓం సచ్చిదానంద తీర్థాయ వాసుదేవాశ్రయాయచ ।
అస్మద్దేశిక వర్యాయ నమో వేదాంత వేదినే ॥

శ్రీ పురుషోత్తమానంద తీర్థగురు స్వాములవారు బ్రహ్మానంద సరస్వతీ స్వాముల వారిచేత రచియింపబడ్డ ఏకాదశస్కంధం సారసంగ్రహతాత్పర్యం తెలియలేని సంస్కృతానధికారులయినవార్లకు తెలిసేనిమిత్తంగా నాంధ్ర భాషచేత లోకోపకారార్థంగా రచించినవారయిరి ముముక్షులయినవారికి మోక్షమార్గోపదేశం చేయవలెనని నిశ్చయించినటువంటి భగవంతుడయిన శ్రీ కృష్ణస్వామివారిచేతను ముక్తికి ప్రథమ సాధనం మనుష్యదేహమని నిరూపించబడుతున్నది శ్రీశ్రీశ్రీ శ్రీమద్భాగవతే ఏకాదశస్కంధే భగవతా శ్రీ కృష్ణేన ముముక్షూణాం ముక్తిమార్గము పదేష్టు కామేన ముక్తేః ప్రథమ సాధనమిదమితినిరూప్యతే

**End**

శ్లో॥ నహితస్య వికల్పాఖ్యా యాచమద్వీక్షయాహతా
అదేహాత్ క్వచిత్ ఖ్యాతిస్తతస్సంపద్యతే మయా ॥

తస్య— బ్రహ్మైవాహం అనే అపరోక్ష జ్ఞానం కలిగిన బ్రహ్మవిద్వరిష్ఠుడికి, వికల్పాఖ్యా—నీవు నేను అని యిట్లా వికల్పంతోకూడిన భేదజ్ఞానమున లేదు యాచ—జ్ఞానంకంటె పూర్వమందు భేదదృష్టి, యేదికలదో సా—ఆ భేదదృష్టి, మద్వీక్షయా—చిదేవాహం బ్రహ్మైవాహం అని నాకంటె వ్యతిరిక్తంగా నామరూపాత్మకమైన ప్రపంచము లేదు అని యీ రీతిగా బ్రహ్మాపరోక్ష జ్ఞానముచేతను, హతా—మూల భూతాజ్ఞానముతోకూడా నశించిపోయినది ఆ దేహాంతాత్—దేహంపడిపోయే పర్యంతమున్నూ క్వచిత్ ఒకానొకప్పుడు ఖ్యాతిః—ఇది జగత్తు ఇది జీవుడు అనే స్మరణము, అస్తి—కద్దు, తతః—అటుతర్వాతను, మయా అద్వితీయ బ్రహ్మస్వరూపముగానే, సంపద్యతే, ఉంటాడు – ఘటోపాధినశిస్తే ఘటాకాశమే మహాకాశమయినట్లు ఉపాధి నశించినందువల్ల బ్రహ్మ అయిపోవుచున్నాడు 133

శ్లో॥ కాలకూట సమోదోషో యస్యకంఠేలవాయతే।
తమహంపురుషం వందే విద్యాదోషహరం హరమ్ ॥

గ్రంథాంతమందీ వ్రాతగలదు

శ్రీ పరమానందగురు చరణార్పణమస్తు శ్రీ సచ్చిదానంద స్వామినేనమః

పార్థివ సం॥ మాఘ బ 11 శనివారం మధ్యాహ్నంనుంచి మొదలుకొని యీ బ 30 బుధవారం మధ్యాహ్నం వరకు అయిన రోజులు 4ల గుమ్మడిదల వెంకటరెడ్డి పంతులు గారి ప్రతినున్న క్రమాన కస్తూరి గవతన్న స్వంతంకు ఏకాదశ స్కంధ సారసంగ్రహం శ్రీ కృష్ణార్పణంగా వ్రాసుకొనెను.

(వి-వి )—

సమగ్రము వ్రాంతి చిన్నదిది తప్పులున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాతములులేవు

శ్రీ విష్ణు భాగవతము నేకాదశ స్కంధమునగల వేదాంత విషయక శ్లోకములకిది తెలుగు టీక మూల శ్లోకములుగూడగలవు పురుషోత్తమానంద తీర్థగురు స్వామియు, బ్రహ్మానంద సరస్వతి స్వామియు దీనికి కర్తలు బ్రహ్మానంద సరస్వతీ స్వాములు ఏకాదశస్కంధ సారసంగ్రహ తాత్పర్యమని సంస్కృత టీకను రచింపగా దానికిది తెలుగునేత కాంబోలును ఆ విషయమిందు అస్పష్టముగానున్నది

ఇందలి గ్రంథాంతరములు —52a మహావాక్యముల కర్థము, 53a ఆత్మబోధ ప్రకరణము

---

## No 2076 అగస్త్యలింగ శతకము

## AGASTILINGA ŚATAKAMU

Substance, palm leaf Size, 16 × 1¼ inches Pages, 3 Lines, 5 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, not good and not free from mistakes

Begins on fol 2 *a* The other work herein are —3 *a* Sanki-navisayamu, 30 *a* Basavaragada, etc

Incomplete

Same work as that described under D No 1470

(వి-వి )—

అసమగ్రము వ్రాంతమంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇది డి నెం 1470 దున వర్ణితము

ఇందలి గ్రంథాంతరములు—3a సంకర్ణ విషయము, 30a బసవరగడ మున్నగునవి

---

## No 2077. కులశేఖరమహీపాల చరిత్రము

## KULASĒKHARAMAHĪPĀLACARITRAMU

Substance, palm leaf Size, 14 × 1¼ inches Pages, 198 Lines, 7 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing good and free from mistakes

Complete

Describes the life of Kulaśēkharālvār the well-known exponent of Śrivaisnava religion and the author of Drāvidāgama and Mukunda-māla The author is Śēsamu Raghunāthācārya, son of Vēnkatācārya and Lakṣamma. The work is dedicated to Śrirāma

**Beginning**

శా. శ్రీ గోత్రాతనయాస్తన
క్ష్మో  ల లంతికా రుచితతుల్ చూపట్టి యన్యోన్యస్పృహా
ద్రాగంబుల్ బయలెక్కినట్లై సగనుద్యత్సంతతానందసం
ధాగాత్సుక్యము నొందు రాఘవుఁడు మమ్మున్ బ్రోచు నెల్లప్పుడున్

* * * *

సీ. తను కాంతులఖిల దిక్తటుల నటత్కరటి వి
స్ఫుటకటంబుల జాజువూఁతఁ బెనుప
భవజనక పవనముల్ సప్తాబ్ధివీచిప
రస్పరాహతికి సారథ్యమునుప
తుండాగ్రమత్యగదుర్గ్రహారి గ్రావ
పాళి పెదం భోళికేళి సలుప
నఖరముల్ నతజనోన్ముఖ మహాఘధ్వాంత
పేటికిఁ దరనాంశుధాటి నెఱప
ముఖరుచులు శంభు జంభారి ముఖ్యదేవ
దృక్చకోరావళులకుఁ జంద్రికల నినుప
విలసితోదగ్ర మూర్తియై వెలయు బుధవి
ధేయ మునిగేయ నవ్యైనతేయుఁ గొలుతు

* * * *

చ అనయము సత్కవుల్ భగవదర్పిత కావ్యరసంబు మెత్తు రా
య్యనఁగు కవుల్ వెసన్ నెఱసు లారయుచుండు దురేమి చిత్రమో
ఘనసర నీలసత్కమల కైరవ సౌరభమేవగింపుచున్
మునుకొని నత్తగుల్లలకు ముక్కులు సాచు బకంబులుం బలెన్

* * * *

ఉ. నగుమొగమున్ విశాలనయనంబులు చక్కని చెక్కుదోయి చె
న్నగు సరులున్న పెన్నురముదంచిత బాహుయుగంబు ముత్తెపున్
జిగిదళు కొత్తుకల్వరుస చిన్నెయె యారపుఁ జెయ్యులొప్ప సొం
పగుపురుషుండు నాదుకల నాదరమొప్పఁగ గోచరించినన్

* * * *

వినురఘువల్లభుండ నీ హృదయ మెఱిఁగి
వచ్చితిని కులశేఖరాళ్వార్ల చరిత
మాంధ్ర గీర్వాణ మిశ్రపద్యాంతరముల
కృతివి నిర్మింపు మాకునం కితముగాఁగ,

* * * *

సీ శుభకరాపస్తంబ సూత్రుండు కౌండిన్య
గోత్రపవిత్రుండు గుణవిశిష్టుఁ
డనుపమశేషాన్వయాంభోధిచంద్రుం డ
హోబలదేశికుం డొనరఁ దనదు
సతియందుఁ బుత్త్రపంచకము నాపాదించె
నందగ్రజుండు రామానుజార్యు
డమ్మహాత్ముండు సీతమయను నిజదేవి
వలన శ్రీభట్టరాహ్వయుఁగు మారు
గనిరొ నాశాంతనిధికి రాగమయు సత్య
భామయను భార్యలిరువురు భవ్యమతులు
సరవిరాగమదేవికి సంభవించె
సరసగుణశాలి వెంకటాచార్యమౌళి

గీ అమ్మహాత్ముఁడు లక్ష్మమ్మయనెడి పత్ని
వలన ముఖ్వరు తనయుల నెలిమిఁగాంచె
చెలిమి రామానుజుండును శెన్నుభట్ట
రను సహోదరు లిరువురేన గ్రజుఁడను

క ఇలరిఘు నాథార్యుండన
వెలసితి లక్ష్మణమునీంద్ర విమలపదాబ్జం
బులు శరణంబని నమ్మితి
లలిభాగవతార్చ నాభిలాషం బెసగన్

**End.**

ఉ చల్లని చూపులెందు వెదఁజల్లి జగంబులఁ బ్రోతు వీవశా
తల్లివిభవ్య వైభవమ తల్లివి సేవకకల్లవల్లి ని
న్నెల్ల బుధుల్ భజంతు కతలే మొఱఁగుగ్ పసికూనవీని నీ
చెల్లెలిఁగాఁ దలంచి కృపసేయుము నేరము నన్ ?

సీ. అనిన శ్రీదేవి నగుచునో యవనిపాల
మదిచెదరికూఁతు నప్పగించెదవుగాక
జన్మజన్మంబులను విష్ణుసతులమగుచు
జెలిమినుండెడు మాకిన్ని చెప్పనగునె

* * * *

వ అని రమాదేవి యానతిచ్చిన సంతుష్టాంత రంగుండై తన్నుం గృతార్థుంగాఁ
దలంచుచు తుండై నిజ నగరంబు ప్రవేశించె మఱియును

క శ్రీ వైష్ణవపూజా సం
భావనలే మఱక రామభద్ర చరిత నే
వావిలసిత హృదయుండై
భూవరుఁడా ర్యారులనఁగఁ బోలుంపు వహించెన్

సీ. సతతంబు పురమున సాటించు పుర
సంగ శ్రీరంగయాత్ర
రచియించె హరిభక్తిరసము జొబ్బిల బుధా
నందానుకూల ముకుందమాల
నిఖిల ప్రపన్న వర్ణితముగాఁ బ్రకటించె
బంధుర ద్రవిడ ప్రబంధమొకటి
సంతత శ్రీరామచరితామృతా
... స్తిగాంచె
బహుళనీవృత్సమాయాత భాగవత జ
నాభినందన గురుసత్కార్యాభిలషిత
వస్తువిశ్రాణన క్రియావశత నెసగె
నహితుండు దృఢవ్రతనందనుండు

* * * *

మ. తరుణీలోల పితృప్రతిపాలన కళాధౌరేయ గాంధేయ దు
ర్ధర భవ్యాధ్వర మంత్రతంత్రకలనా ప్రత్యూహకృద్దైత్య సం
హర రంభోరుభయదాబ్ధి గర్వదళనోద్యద్రక్తనేత్రాంచలా
ధరధైర్యాధ్యక్షరాధురంధర భుజాధారాధరాంగద్యుతీ !

క. శాక మదోద్రేకత మో
లోకే

**Colophon**

ఇది శ్రీరామచంద్ర కరుణానిరీక్షణ సమాసాదిత కవితావిశేష శేషాన్వయ ప్రదీపక వెంకటాచార్య కుమార రఘునాథాచార్య ప్రణీతంబైన కులశేఖర మహీపాల చరిత్రంబను మహాప్రబంధంబునందుఁ దృతీయాశ్వాసము.

(వి-వి)—

సమగ్రము వ్రాఁత చక్కనిది తప్పులు లేవు శైథిల్య మల్పముగాఁగలదు గ్రంధపాతములు లేవు

శ్రీ వైష్ణవ మతప్రవర్తకులలో ముఖ్యుడును ద్రావిడాగమమునకును, ముకుందమాలకును కర్తయునగు కులశేఖరాళ్వార్ల చరిత్రమిందు వర్ణింపబడినది గ్రంధకర్త శేషము రఘునాథాచార్యుడు ఆపస్తంబ సూత్రుఁడు కౌండిన్యగోత్రుడు లక్ష్మమ్మకును వేంకటాచార్యులకును కుమారుఁడు గ్రంధకర్తను గూర్చి విశేషములకుదాహృత గ్రంధ భాగముఁజూచునది ఈ గ్రంధము శ్రీరామార్పితము ఇది ప్రశస్త రచనము గల గ్రంధము

## No 2078 గీతార్థసారసంగ్రహము.

## GĪTĀRTHASĀRASAṄGRAHAMU

Substance, paper Size, $8\frac{3}{8} \times 6\frac{3}{8}$ inches Pages, 68 Lines 20 on a page Character, Telugu Condition slightly injured Appearance, old Mode of writing, good and free from mistakes

Begins on fol 1 *a* The other work herein is —69 *a* Sāraṃsapañcakamu

Complete

A treatise based on Bhagavadgīta The author is Sarvajña Kumāra yācēndrabhūpati of Velugōti family, the chief of Vēṅkaṭagiri

**Beginning**

శ్రీ గోపీజనవల్లభాయనమః

వసుధలో సౌభాగ్యములైన విద్యలనేకములు గలవు వాటినన్నింటిని సాధించుటకు నెంతబుద్ధిమంతునకైనను శక్యముగాదు అయితే ఈ విద్యలలో ముఖ్యముగ నీద్వారిక ముగా నైహికాముష్మిక పురుషార్థసాధనములైన విద్యలు రెండు గలవవి యెవ్వియనిన నైహికఫలములలో స్త్రీపురుషులకు బ్రహ్మానందలేశ సన్నిభమైనదియు భగవల్లీలారూప ప్రపంచమునకు వృద్ధికరమైనదియునై శృంగార రస ప్రధానమైన రతివిద్యయు నాముష్మిక ఫలములలో ముఖ్యమయిన మోక్షమును గలుగజేసెడి సర్వ విద్యాసారమైన యధ్యాత్మ విద్యయు నీ రెండును సర్వజనులకు నత్యంతాపేక్షితములయియున్న విగావున శ్రీ కృష్ణదాసుండైన వెలుగోటి సర్వజ్ఞకుమార యాచేంద్రాభిధానుండనగు నేను ఈ విద్యలను ప్రతిపాదించునట్టి యనేక గ్రంథములను జూచి చక్కంగాఁ బెద్దలవలన బోధ పఱచుకొని బహుదినములు పరిశీలించి మొదల శృంగార రహస్యములను మాయాస్థానక వీశ్వరులయిన గోపీనాథం వెంకయ్య శాస్త్రులవారికిఁ జక్కఁగాఁ దెలియఁజేసి వారివలన శృంగార రస ప్రధానమయిన బ్రహ్మానంద శతకమును సీసపద్యములుగాఁ జెప్పించి నారమా పద్యములలోనుండెడి భావమిప్పటి జనులకు చక్కఁగ బోధపఱచుకొనునట్టి యోగ్యత లేకపోయినందున నధ్యాత్మ విషయమయిన యోగీతార్థసార సంగ్రహమనెడు గ్రంథమును పద్యరూపకముగ జేయించక నందరికీ తెలియుటకు నింగిలీషు గ్రంథమురీతిగ తెలుఁగు మాటలతో రచించుచున్నాఁడను

వైదిక మతములని పేరుగల యద్వైత విశిష్టాద్వైత మతములుగలవారు చిదచి దీశ్వరులనాధుఁని యెప్పుచున్నారు

**End.**

సర్వమతములలోనుండెడి సమస్తసారాంశములు ఈ అయిదు అంశములలోనే అంతర్భూతములుగావున సర్వ జనులకు ఇవి ఉపాదేయములు గనుక సులభముగాఁ దెలియుటకు సంగ్రహముగా తెలుగుమాటలతో ఈ సారాంశ పంచకమనే గ్రంథము రచితమయి ది

ఈ గ్రంథములో వ్యాఖ్యానములున్నయెడల నా హృదయాంతర్వర్తియై బుద్ధి ప్రేరణముచేసిన కారణ స్వరూపుడై సర్వాత్మకుడైన శ్రీకృష్ణులే క్షమించి రక్షించు చున్నాడని నమ్మియున్నాను అయితే మనుష్యుడైనవాడు తాను బ్రదికియుండుటకు దగిన కార్యములను జేయునది గనుక నేను ఇహపరములయందు సదా సర్వత్ర బ్రదికి యుండుటకు నీ గ్రంథమును రచించినానే కాని యితరులీ ప్రకారమనుష్ఠించవలెనని దురభిసంధితో రచించినవాడగాను

**Colophon**

శ్రీ భగవద్గీతా సార సంగ్రహం సంపూర్ణము

గ్రంథాంతమందీ వ్రాతగలదు —

ఈ గ్రంథము గోపీనాథం వెంకయ్య శాస్త్రిచేత లేక ప్రమాదాదిదోషములు లేకుండునట్లు పరిష్కరింపబడినది —

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

వెంకటగిరి ప్రభువగు వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్ర భూపతి భగవద్గీత ననుసరించి రచియించిన తత్త్వోపన్యాసమిది

---

## No 2079. గీతార్థసార సంగ్రహము

## GĪTĀRTHASĀRASANGRAHAMU

Substance, paper Size, $6\frac{3}{4} \times 8\frac{5}{8}$ inches Pages, 149 Lines, 19 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair, but not free from mistakes

Begins on fol 1 *a* The other work herein is —76 *a* Sārāmśapancakamu

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిదే తప్పులున్నవి. శైథిల్య గ్రంథపాతములు లేవు పూర్వమువ్రాత

ఇందలి గ్రంథాంతరము 76a సారాంశ పంచకము గ్రంథాంతమున నిట్లున్నది—

“ఈ గ్రంథము గోపీనాథం వెంకయ్య శాస్త్రిచేత లేఖక ప్రమాదాది దోషములు లేకుండునట్లు పరిష్కరింపబడినది.”

## No 2080 గురుగీతాసారము

## GURUGĪTĀSĀRAMU

Substance, palm leaf Size, 17¼ × 1¼ inches Pages, 48 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

A Telugu rendering of Gurugīta, a portion in Skāndapurāṇa The author is Kambhampāṭi Nārapāmātya For details see extracts below

**Beginning**

శ్రీమద్భక్త జనౌఘ చిత్తనిలయం చిద్రూపదృగ్గోచరం
దత్తాత్రేయకులాబ్ధి పూర్ణశశినం స్మేరాననం చిన్మయమ్
నిత్యం సత్యమనంతమవ్యయపదం నిష్కారణం కారణం
శాంతో దాంత ? క్ష ? మాధిపం గురువరం శ్రీరామబ్రహ్మం భజే

* * * *

శా. శ్రీ కైవల్యవిశేషస్థానము మదిం బేరంగ నేఁ గోరి లో
కైకాచార్యుని దత్తవంశజుని సత్కారుణ్యపాథోధియై
లోకాచార విచారసంపదల కాలోచకనోత్కృష్ట ల
క్ష్మీకాంతుండగు రామబ్రహ్మగురు నేఁ బ్రార్థింతు నశ్రాంతమున్

* * * *

క. బాలత్వంబున నాకును, శీలత్వము రాజయోగ చిహ్నలు లెస్సన్
మేలిమితోఁ దుతఁ దెల్పుకృ, పాలునిమద్గురుని రామబ్రహ్మము దలఁతున్

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబును సుకవిజన కీర్తనంబును అఖండాత్మస్తోత్రంబు నుం జేసి ముముక్షుజనహితంబుగా నొక ప్రబంధంబుగావింపబూని యీ ప్రబంధంబునకు మద్గురునాథునిం గృతినాదునింగా నియోగించి సంతసిల్లి బుధజన సంతోషంబుగా స్కాంద పురాణంబునందుత్తరఖండంబున గురుగీతాకావ్యంబు తెనుంగు సేయంబూని మదీయాచార్య పరంపరావతారంబులు అభివర్ణించెద

మ. అరవిందాక్షుఁడు పూర్వకాలమున దత్తాత్రేయుడైఁ పుట్టి యీ
ధరణిన్ మర్త్యులలో విశేషగుణులన్ ధన్యాత్ములం జేసి శ్రీ
కరమౌ సత్యభిదాత్ముఁ డన్వయునిఁ గాఁగ నొంచు నెల్లప్పుడున్
బరిపూర్ణత్వ సమాధిలో మెలఁగు సత్పావిజ్ఞ్యాకే క్రముక్కాదన్

* * * *

మ. ధరలోనన్ గురు రాజధానియగు దత్తాత్రేయయోగీంద్రుచే
పరతత్త్వార్థము లెస్సగాఁ దెలిసి తాఁ బజ్ఞప్తిచే నాత్మునిన్
నిరతంబుంగని భక్తులౌ జనులనున్ నేర్పొప్ప బోధించునా
పరమానంద మునీంద్రుపాదములు నేఁ బ్రార్థింతు నశ్రాంతమున్

మ అవనిం బ్రహ్మవిదుండనై పరమయోగానందుచే ముక్తుండై
శివయోగీంద్రులు పొందు నాత్మపదముం జేరంగ లేనట్టి మా
నవకోటిం బురుషార్థముం గొనిపి నిత్యానందులం జేయు దే
నువకొండాన్వయ తిమ్మయోగిపదముల్ మోహించెదన్ అక్కలన్

మ ఇలలో దేనువకొండ తిమ్మగురుచే నిష్టార్థ సంసిద్ధుడై
చలనంబొందక రాజయోగపదవిన్ సౌశీల్యుడై పొంది భూ
మిలో సద్భక్తుడై నేలి చిన్మయముదారి యయ్యంగ నేనార చిం
తల లింగార్యుడైన యోగిపదముల్ ధ్యానింతు నశ్రాంతమున్

సీ ఓరచింతల లింగనార్యపాదాబ్జముల్ - సేవించి భక్తివిశిష్టుడగుచు
అద్వయమవ్యక్తమప్రకాశాతీత - మైన బ్రహ్మంబు నెమ్మదినిగాంచి
త్మాచక్రమున నరుల్ జన్మపరంపర - లెత్తుటంజూచి సర్వోత్తముండు
కరుణించి ముక్తులంగాంజేయందలపోసి - నిరుపమానందాత్మ నెళవుచూపి
షట్టువుల్ వాపి ముప్పున్నతి పొందులుడిసి - నిర్మలజ్ఞాన పరమాత్మునిజము మరపి
నట్టియోగానుభూతాంత్రములాత్మనిలిపి - ప్రముక్కి సేవింతు వినుతింతు ముక్తిగాంతు

శా యోగానందుని పాదపద్మయుగముల్ యూహించి సేవించుచున్
రాగద్వేషములందుం జిత్తము సదారంజిల్లకన్ యాత్మం దా
నేగాంగనొగ్గని మానవావళికిం జిన్మూర్తిత్వమున్నిచ్చి వాక్
ఛ్రీగాంభీర్యుండునైన తిమ్మగురునే సేవింతు నశ్రాంతమున్

చ కుటిలుండుగాక తిమ్మగురుంగోరి భజించి యఖండవిద్యం దా
ఘటువుగనేర్చి యాజగతింబట్టుగ శిష్యులనెల్లం బ్రోచి తా
ఘుటికులం జేసి నేత్రమునంగల్గు చిదాత్మునింగాంచి ది
క్తటముల వెల్గు రామగురుందల్చి మనంబున నిల్పి మ్రొక్కెదన్

* * * *

క. పలికెద శ్రీగురుగీతలు, పలికించెడువాడు రామబ్రహ్మము నాలో
పలనిలిచి యేవిధంబున బలికించునో ఆవిధమునం బలికెదనుమీ!

* * * *

క క్రమమున సద్గురుముఖమున, నమలినతరమైన బ్రహ్మచరయాటచేం గం
భముపాటి నారపని ధర, సుమతులచే నెన్నబడితి శోభిత రాత్మన్

**End**

చ రుణత్త్వసారభవకుంచిత భూజశరార ము
క్కారగుణ సంప్రకాశముపి కామిత దివ్యశరీర యోగమాం
తర చిదచిద్విచారసుర ధామసుమేరుసమానధీర స
ద్గురువర రామబ్రహ్మవర కూహకదూర యఖండతా

**Colophon**

ఇది శ్రీరామబ్రహ్మ ప్రదగుద వర ప్రసాదలబ్ధ కవితావిలాస వాంపామాత్య ప్రకటితంబైన శ్రీ గురుగీతాసారంబునందు శబ్దైక్య నిర్ణయంబును లింగతంత్ర ఛంగంబును ఋవగణ ప్రశంసయు పరిపూర్ణా ఖండజ్ఞప్తి విచక్షణయు పరమాత్మపలనయిన ప్రపంచ భ్రాంతియు ఆత్మనకు హానివృద్ధులు లేకపోవుటయు ప్రారబ్ధత్రయ విస్తారమును బంధమోక్షణ ప్రశంసయు, లోకాచార క్రియానుసరణయు పార్వతీ స్తోత్రంబును నన్నది తృతీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాంతమంచిది తప్పులున్నవి వైదిల్యముగలద ఎడనెడ గ్రంథపాతములు గలవు స్కాందపు రాణాంతర్గతమయిన గురుగీతయను వేదాంత గ్రంథమునకిది తెలుగుసేత గ్రంథకర్త కంభముపాటి నారసామాత్యుడు ఆతని గురుపరంపరనుదాహృత పద్యములనుబట్టి గ్రహింపనది ఈ గ్రంథమద్వైత వేదాంత ప్రతిపాదకము

---

## No 2081 గురుబోధ

## GURUBŌDHA

Substance, paper Size, 12½ × 8 inches Pages, 65 Lines, 23 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good, but not free from mistakes

Begins on fol 225 *a* The other works herein are —Śukasaptati (prose) 1 *a*, Dilārāmakathalu 41-*a*, Kucēlōpākhyānamu 97 *a*, Sārangadharacaritra 144 *a*, Vēdantavārtikamu 261 *a*

Complete

A work on Śaiva Vēdānta written in dvipada by Sōmana, son of Śivakavi Vīrabhadra He was a disciple of Rēvana and a Vīraśaiva by religion

**Beginning**

శ్రీ గురుమూర్తి సంచిత పుణ్యమూర్తి
భోగమోక్షార్థి సత్పుణ్యజనార్థి

•

చిరపియా శరసర్వ సిద్ధాంత నికర-వరశిష్యప్రేమ రేవణ్ణ నాస్వామి
నీవె పరశివుండవు నీవె పరకుండవు-నీవె గురులింగమని నిన్నుజేరితిని
కావవేనన్నను గావవేదయను-కావ వేమాయలంగడకుండబోద్రోలి

• • • •

చూపులు గోచరము చూపేటియట్టి-యీపంచ తత్త్వంబునైం దుదయించె
నీశరీరంబులు నీయింద్రియములు-వేసటలేని యీవిషయేంద్రియములు

నాసక్తిఁదిరుగు జీవాత్మతోడుతను-భాసురంబుగ నెందుఁ బ్రభవించెదీని
తెలఁగెల్ల వేర్వేఱ తెల్ప పఁగవలయు-గురునాథ తెలుప వే గుణుతులన్నియును
అనిన శ్రీగురుఁడిట్టులనియె శిష్యునికి-వినవయ్య చెప్పెద వినయప్రవీణ

**End**

చరతరంబైనట్టి సచ్చిదానంద-భరితుఁడు రేవణ్ణ పదకలశ శరణుఁ
డరుదుగాఁ జెప్పె మహాంబ బాళ్ళుండు-శివకథారస వాగ్విశేష సంగతుల
నవిరళమైయుండు నాలోన నెపుడు

మనుమని గురుబోధమన మలరంగ-వినిపించె నీకథా వృత్తాంతమెల్ల
వినుచున్న వారికి వీరశైవంబు

కలుగు శివలోకంబు గలుగు సర్వంబు
చెలఁగిమంగళ మహాశ్రీలొనరించు

**Colophon**

అని యిట్లు గురుబోధ యా చెన్నబసవ-లింగదేవునికి నేలెంక నేనాఁడు
సంగతినతని ప్రసాదిని నేను-తడయక యతనికి దాసిని నేను
విడువక యీ కథవిశదంబుగాను-రచియించితిని గవిరాజులు మెచ్చ
వచనసత్ప్రసిద్ధి నీవసుధపైమించి-గురు రేవణేశ్వరు మూర్తి శిష్యుండ
పరగ శివకవి వీరభద్రతనయుండ-సువిధానమతి సుతుఁడడ సోముఁడన్వాడ
భువిలోన నీగురుబోధకు నెలమి-చెలఁగిన మంగళశ్రీలఁ బెంపొందు
నరయంగ నిది ద్వితీయాశ్వాసమయ్యె

(ఇది ద్వితీయాశ్వాసాంతమందలిది)

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది కాని తప్పులు చాలఁగలవు. శైథిల్యము లేదుగాని గ్రంథపాతములు మాతృకలోనున్నవి గాబోలును. ఇందు నెడనెడఁగలవు

మూఁడాశ్వాసముల యీ ద్విపదకావ్యము శైవ వేదాంత విషయకము గ్రంథకర్త సోమన ఈతఁడు శివకవి వీరభద్రుని పుత్రుఁడు రేవణకు శిష్యుఁడు. వీరశైవ సంప్రదాయమువాఁడు

ఇందలి గ్రంథాంతరము లివి,—

1a శుకసప్తతి (వచనము), 41a దిలారాము కథలు, 97a కుచేలోపాఖ్యానము, 144a సారంగధర చరిత్ర, 261 వేదాంత వార్తికము

## No 2082 గురుబోధ

## GURUBŌDHA

Substance, palm leaf  Size, $10\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches  Pages, 112  Lines, 5 on a page  Character, Telugu  Condition, good  Appearance, old  Mode of writing, not good and not free from mistakes

Complete

A dvipada work in three āsvasas describing the nature of Śivayōga. The author is Sōmakavi, son of Vīrabhadra

**Beginning**

శ్రీగురుమూర్తి సచ్చిత సుణ్యమూర్తి
భోగమోక్షార్థి సత్పుణ్య జనార్థ
నిర్మలహృదయేశ నిత్య ప్రకాశ

*    *    *    *

వరదయాపర సర్వ సిద్ధాంత నికర
వరశిష్యప్రేమ రేవణ్ణ నాస్వామి
నీవె పరశివుఁడవు నీవె పరముఁడవు
నీవె గురులింగమని నిన్నుఁ జేరితిని
కావవే నన్నును కరుణాసముద్ర

*    *    *    *

అరివిశాష్టాంగ యోగాంగంబు దెలిపి
శివయోగసామ్రాజ్య సింహాసనమున
ఉంచి పరశివమూర్తి యున్న నెళవెల్ల
నెంచి సర్వంబును నెఱిఁగించె వినుము
అని పరశివమూర్తియాద్యంత మెల్ల
వినుమని శిష్యునికి వినిపింపఁదొడఁగె

**End**

కలుగునుజ్ఞానంబు కలుగుఁజదివినను
కలుగు శరణత్వంబు కల్గు నిర్ముక్తి
ఎన్నగల శివసుఖమేర్పడఁగల్గుఁ
జెన్నొందు నిష్టార్థ సిద్ధంబుగాను
తెలియువారలకును దేట తెల్లమిగ
గల్గుసదమలభక్తి కలకాలమందు
కల్గుశివలోకంబు కల్గుసర్వంబు
చెలగిమంగళమహాశ్రీలొనరించి.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు.—

“ సర్వజితు సంవత్సర చైత్రశుద్ధ అష్టమి బుధవారంవరకు ఈ గురుబోధ మాసేటి సర్వేశలింగం వ్రాసుకునైను ”

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

“ గురుశేవణేశ్వరు కూర్మి శిష్యుండ
పరగ శివకవి వీరభద్ర తనయుండ
సువిధానమతి సుతుఁడు సోముఁడన్వాడ ”

అని ద్వితీయాశ్వాసాంతమందుఁగలదుగాన యీత ద్గ్రంథకర్త సోమకవియనియు, వీరభద్రుని కుమారుఁడునియుఁ దెలియనగును ఇందు శివయోగ రహస్యములు వెల్లడింపఁబడినవి మూడాశ్వాసముల ద్విపద కావ్యమిది.

---

## No 2083 గురుశిష్య సంవాదము

## GURUSISYASAMVĀDAMU

Substance, palm leaf Size, 13¼ × 1½ inches Pages, 6 Lines 5 on a page Character Telugu Condition, injured Appearance, old Mode of writing fair but not free from mistakes

Begins on fol 8 *a* The other works herein are —1 *a* Kuravanji 10 *b* Pātalu

Incomplete

A treatise on Śaiva Vēdanta written in Manjari metre

**Beginning**

శ్రీ గురుమూర్తి నాచిత్తంబునందు
భావించి గురుఁజేరు భక్తిమార్గంబు
శ్రీ గురునాథుఁ చిత్తంబులోన
చేరికొల్చెడి విధము చెప్పెదవినడి

**End**

ఆదిలెస్సగా నీవు అరసిచూడగను
చంద్రబింబకు పుట్టుచే యా చునపుడు
పండువెన్నెల రీతిఁ బ్రభగల్గియుండు
ఆ ప్రభలోపల నత్యంతమయిన
ఆ బోజ్యోతిఅయి ఆదియుద్భవిల్లు
ఆ జ్యోతి సర్వాంతర్యామియైయుండు
ఇదియె జీవన్ముక్తి యిది రాజయోగం
ఈ యోగాదృష్టిచే నిత్యుడు నీవు
యోజించి బ్రహ్మమైయుండు మీవత్స

(వి-వి )—

అసమగ్రము ప్రాంతలిస్పినది తప్పులున్నవి వైదిక్యము, గ్రంథపాతములు లేవు.

మంజరీ రూపమున రచితమైన శైవవేదాంత గ్రంథమిది

ఇందలి గ్రంథాంతరములు—1a - 3 రసంజి, 10b పాటలు

---

## No 2084 ఘటచక్రనిర్ణయము

### GHATACAKRANIRNAYAMU

Substance, palm leaf Size 16½ × 1¾ inches Pages 26 Lines, 7 on a page Character Telugu Condition, good Appearance old Mode of writing, fair, but contains mistakes

Complete

Describes the creation of the physical body as explained in Upanisats and purānas

**Beginning**

తత్వాదిభూమిం తాత్పర్యం, శబ్దస్పర్శ రూపరసగంధాలు, ఇవి అయిదున్ను గుణాలు కఠినత్వమే ధర్మం, ధరియించుటే కర్మం, తదంగం పీతవర్ణం, అథ దేవత బ్రహ్మ, అప్పునకు శబ్దస్పర్శ రూపరసాలు ఇవి నాల్గు గుణాలు, విడాయోనేవి తడుపుటే ధర్మం, శుద్ధసేయుటే కర్మం తదంగం శ్వేతవర్ణం అధిదేవత విష్ణువు అగ్నికి శబ్ద స్పర్శ రూపాలు మూడు గుణాలు, ఉష్ణింపుంటే ధర్మం విన్నైన పాకముచేయుటే కర్మం తదంగం రక్తవర్ణం

**End**

జీవాత్మ, పరమాత్మ, అంతరాత్మ, నిర్మలాత్మ, శుద్ధాత్మ, మహాత్మ, స్థూలతనువు, సూక్ష్మతనువు, కారణతనువు, నిర్మలతనువు, అనాదితనువు, చిన్మయతనువు, చిద్రూప తనువు, శుద్ధతనువు, ఇవి అష్టతనువులు అష్టి కర్త్వశక్తి, పద్మినీ, క్రోధినీ, మోహినీ, అతిచారిణి, గూఢచారిణీ, శాకినీ, ఇవి అంతరంగి అష్టమదాలు, పృదివీ సలిల పావక, పవన, అంబర, రవి, శశి, ఆత్మ ఇవి అష్టమూర్తులు రసం, రుధిరం, మాంసం, మేదస్సు, అస్థి, మజ్జ, శుక్లం ఇవి సప్త ధాతువులు తనువును రాజ్యకళత్రాపహరిశ్యసేవక కార్య, ఇవి సప్త వ్యసనాలు అన్నప్రాణ మనోవిజ్ఞాన ఆనంద, ఇవి అంగ ప్రత్యంగ ఉపాంగ సాధాంగములు అంగచతుష్టయములు, రాజసతామస సాత్త్విక గుణత్రయాలు, రాజసాహంకార, తామసాహంకార, సాత్త్వికాహంకార త్రయాలు, వాతపైత్య శ్లేష్మాలు దోషత్రయాలు, ప్రకాశ ప్రవర్తన మోహన భావత్రయాలు, మల త్రయాలు, మాయాద్వయాలు, ఈషణత్రయాలు, మననం, మగనం, మననీయం, మన త్రయాలు, ఇవి ఇన్నిన్నీ పిండ సంగ్రహమైన ఘటచక్రనిర్ణయం సంపూర్ణం

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులమయము శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

శరీర నిర్మాణాది విషయములు ఉపనిషత్పురాణాద్యనుసారముగానిందుఁ జెప్పఁబడినది వ్రాఁత దోషభూయిష్ఠమగుటచే నిది మిక్కిలి అసందర్భముగానున్నది

---

## No 2085 చతుర్వేదసారము

## CATURVĒDASĀRAMU

Substance, palm leaf Size, 15⅝ × 1⅝ inches Pages, 148 Lines, 6 on a page Character, Kanarese Condition, injured Appearance, very old Mode of writing, fair but full of mistakes

Begin on fol 1 *a* The other works herein are —Śivastavagadyamu, 74 *b*, Lakṣmaiyagārivacanamu 77 *a*, Manōbōdha 106 *a*

Incomplete

Same work as that described under No 1546

(వి-వి)—

అసమగ్రము 357 పద్యములున్నవి శైథిల్యము చాలఁగలదు గ్రంథ పాతములు చాలఁగలవు లిపి కన్నడము తప్పులు చాలఁగలవు

ఇది నెం 1546 రున వర్ణితము

ఇందలి గ్రంథాంతరములు లివి—

74*b* శివస్తవగద్యము, 77*a* లక్ష్మయ్యగారి వచనము, 106*a* మనోబోధ

---

## No. 2086. చెన్నబసవపురాణము

## CENNABASAVAPURĀNAMU

Substance, paper Size, 12⅝ × 7⅞ inches Pages, 286 Lines, 24 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, good and free from mistakes

Complete

Written on the life of Cennabasava, the Great exponent of the Vīrasaiva system He was the nephew of the famous Basavēśvara, the founder of the Vīrasaiva system, and a minister of the King Bijjhala His mother was Nāgamma, the sister of Basavēśvara The belief among the Vīraśaivas is that Basavēśvara was the incarnation of Nandīśvara and Cennabasava was the incarnation of Kumāraswāmi The Kannada version of this work is slightly different The author is āpayāmātya son of Sundarāmbikā and Śrīgirimantri, he has also writte

Śrisailamāhātmya in Telugu The work under notice has been dedicated to Amṛtalingāmātya of Kandukūru For details see extracts below

**Beginning**

క॥ శ్రీగిరి జన నవధూగో
జాగురు కాశ్మీర పంకిలాంకిత వక్షః
శ్రీగిరి మల్లేశుఁడు కృపఁ
డాఁగొండకు రమృతలింగ ధన్యునిఁ బ్రోచున్॥

ఉ విశ్వకళాప్రవీణపర వీరుడసీక కృపాణవైన తే
యాశ్వశిలీ ముఖాంఘ్రి కమలామల భక్తిధురీణ సత్కృపా
శ్వశ్వదుదక్షిణోణయని సారెకునామదిఁ ద డిగొండసం
దీశ్వరు మద్గురుందలఁతు నెప్పుడుఁదా యుపదేశికాత్మజున్

మ వరసర్వజ్ఞ శిఖామణిం బ్రథిత సద్వార ప్రమోదాకరు
న్నిరతోద్యచ్ఛివ ధర్మసంచరుఁగళా నీకాంచితాపా సుభా
స్వరలింగాన్విత దేహు సర్వవిబుధ వ్రాతామృతౌదార్య భా
సుర పాదాంగుళి పాఁబాల్కుఱికి పంతుంగొల్తు సోమాహ్వయున్

మ వర వల్మీకజ నన్నపార్యముఖ గీర్వాణాంధ్రభాషా కవి
శ్వరమాంభో నిధులన్ జనాక్షియుగ జీవం జీవతోషప్రకీర్ణా
కర తేజోవిధుల న్నిజానుపమవాక్యవ్రాత సంపాదన
స్ఫురదాశాబుధులం దలంతు సతతంబుం గావ్య సంసిద్ధికిన్

సీ

ఐన శ్రీచెన్నబసవ ప్రధాన భవ్య
చరిత మస్మద్గురూత్తమ సత్కటాక్ష
గరిమనా నేర్చుగతి జిహ్వ పరమపావ
నత వహింపఁగఁ జెప్పఁబూనంగనంత॥

సీ

తన వచోగరిమంబు ధాతనఁగఁ జాలుఁ
దన ప్రతాపంబు సూర్యునెం తనఁగనోపు
నతఁడు శ్రీకందుకూరి వంశాబ్ధి చంద్రుఁ
డరి తిమిరహేళి యమృత లింగార్యమౌళి॥

వ మఱియు అమ్మంత్రిపురందరుం డొక్కనాఁడు

ఆస్థాన సౌధరాజంబున జ్ఞాతిబంధు మిత్రామాత్య పురోహిత సామంత దండనాయక కవి పండిత పౌరాణిక కేళిహాసక పాఠక పరిహాసక కార్తాంతిక భిషగ్వైణిక వాంశిక నర్తకమౌరజిక వైతాళిక వంది జనపరివేష్టితుండై మణిఖచిత కార్తస్వర సింహాసనంబున నొడ్డోలగంబున్న సమయంబున నిజ పితృ పితామహాదులు మున్నొందిన సత్కృతులు ప్రసంగ వశంబున సభాసదులైన బుధజను లుపన్యసించిన విని సంతోషిత స్వాంతుండై సప్తసంతానంబులలోఁ గృతియయుత్తమోత్తమంబు గావున నేను నొక్క ప్రబంధంబుఁ గైకొందుఁ గాక యని తలంచి తత్ప్రాజ్ఞులకు నిజాభిప్రాయం బెఱింగించిన వార లిట్లనిరి

మ అనఘా మీరు తలంచినట్టి తలఁపార్యాభీష్ట మాప్తాళి రం
జన సంపాదనంబమేయ ఫలకృత్సంతాన ముఖ్యంబుగా
వునఁ గీర్త్యాస్పదమైనయొక్క కృతి నీవున్వేడ్కఁ గైకొమ్ము ముక్
ఘనుతా సింగయ బాచయాది సచివౌన్నత్యంబునిం బెంచెడిన్

చ అనవుడు మందహాస వదనాంబుజుఁడై యుపుడత్తలూరి పా
వనకుల జొక్క రాజునకుఁ బౌత్రుఁడు, శ్రీగిరి మంత్రి పాళికిన్
ఘనమతి సుందరాంబికకు నందనుఁడు, దద్బసవేశుఁడే యనం
జను బసవేశ మంత్రికిను జన్మునిఁ బాచయ సత్కవీంద్రునిన్॥

క ననుఁబిల్వఁబనిచి తగుతెఱఁ
గునఁ బూజలొనర్చి యిష్టగోష్ఠి వినోదం
బునఁ గొంతప్రొద్దు గడపి స
వినయ వచోగరిమ ననియె వేడుక నాతోన్

క సంతాన భూజములలో
సంతానంబైనయట్టి సత్కృతి నీచేఁ
గాంతునని కోర్కిఁ జెందితి
సంతసమున నొసఁగవలయు సరస కవీంద్రా॥

మ అని జాంబూనద నిర్మితాంబర మణీహారాగ్రహారాశ్వస్యం
దన వీటీ చతురంతయాన సుమనోదామాది వస్తువ్రజం
బున నంజాల బహూకరించుటయునేఁ బూర్ణానుమోదంబుతో
ననఘుండైన తదీయ వంశకథనంబాసక్తి వర్ణించెదన్

క హృతకాముఁడు యుతవారిజ
హిత ధాముఁడు విష్ణుప్రద యాభరితయశో
జిత సోముఁడు ధారుణిలో
చిత నాముఁడు వెలయు సన్న్యసీశాగ్రణియై

క అబ్బా సవాలు కొలమున
బిబ్బోకవతిస్మరుండు పృథివీ స్థలిలో
నిబ్బరుఁ డరిమ్మగతికిన్
బెబ్బులియన నప్పమంత్రి వెంగాంప ధరన్

క ధీరుఁడగు నప్ప మంత్రికి
వీరేశ్వరుఁ డనఁగ సుద్భవించెన్ సుజనా
ధారుండాతని కాత్మజుఁ
డై రంజిల నప్పసచివుఁ డతి ధార్మికుఁడై

ఆ అప్ప మంత్రి భార్య లైన పార్వతియందు
గంగవలన సుతులఁ గనియె జగ్గ
యాభిధాను మఱియు నమృత కవీంద్రుని
శ్రీగిరీశ్వరుని విశేషమతుల

ఉ అందులఁ బార్వతీ తనయుఁడై చెలువొందిన జగ్గనాహ్వయుం
డిందుధరాంఘ్రి భక్తి ధరణీశవశీకృత మంత్రి శక్తి పెం
చ్చందగు సూనృతోక్తిగల సాహసభోగికళా ధురంధరున్
నందను రామకృష్ణ ఘన నామునిఁ గాంచె జగత్ప్రసిద్ధిగన్

వ ఘనుఁడగు రామకృష్ణుని వికాసమనీషకు మెచ్చి సంతసం
బునఁ ద్రిజగత్ప్రతాప కులభూషణ రాయఁడనంగ మేటి పే
రును మణిభూషణంబులు హరుల్గజ దంతపుఁబల్లకీలు శో
భ్మనిదయ గోలకొండ వసుధాధిపుఁ డాతనికిచ్చె మెచ్చుగన్

సీ భూనుతకీర్తి యా భూషణ రాయండు
హేలా నగరరాజ్య మేలుచుండి
నిఖిలవేద్యములు లో నిరుపమ వాసిష్ఠ
తటినీతటంబుల ధరణి సురుల
కగ్రహారంబు కల్పాంతర స్థాయిగా
నొసఁగి వనీపకవి సరములకు
వాంఛితార్థంబులవ్వారిగా నొసఁగుచు
బంధుల నరయుచు నాశ్రితుల

పాత్ర సత్యాగ వృద్ధిచేఁ బరిఢవిల్లెఁ
గాంతి జితహేళి శివపాద కమలశాలి
దళిత విమతాళి నిరుపమదాన కేళి
రమ్య గుణపాళి భూషణరాయ మౌళి

తే. అక్కనకుఁ జిన్నయామాత్యైన యట్టి గంగ
కుద్భవించిన యాత్మజ యుగ్మకమున
నమృత కవిచంద్రుఁ డలరెఁ బ్రఖ్యాతిమీఱి
యరి విభేదియు ఘనల మోహరణుఁ డగుచు

క. అతఁడు కొండాంబిక యం
దాతతశైవ వ్రతుని సదాచార గుణా
న్వితునిఁ బేరయలింగ
ఖ్యాతా మాత్యాగ్రగణ్యుఁ గని సిరులొందెన్

క. పేరయ లింగామాత్యుఁడు
భూరి యశోలలిత మంత్రిపూడికులజుఁడౌ
వీరనసుత యగుకొండను
భారతిఁ బరమేష్ఠి పగిదిఁ బరిణయమయ్యెన్

క. ఆతన్వియందుఁ గనియెన్
పాతక సంహరణ చణుల వాక్పణిమణులన్
ఖ్యాత కళామృతలింగ
జ్యోతిర్లింగాభిధాన సూనృత గుణులన్

మ. అమృతామాత్యుఁడు బుద్ధి రాజకుల పద్మాదిత్యుఁడౌ పర్వతుం
డమితామోదముతోడఁ గన్న గురువాంబా సాధ్వి కేల్పట్టి త
త్ప్రియదా రత్నమునందుఁ గాంచెఁ దనయున్ భావాంతర స్థాద్రిజా
రమణుం బేరయ లింగమంత్రి విశదభ్రామేయ సౌందర్యునిన్

తే. భవ్యగుణధుర్యు మదిగొండ పర్వతార్య
వర విశాలాక్షులకుఁ గల్గు వనజగంధి
వీరమాంబిక వరియించె విభవమెసఁగ
సంగజాకారి పేరయ లింగసూరి

ఉ. పేరయ లింగమంత్రి తన ప్రేయసియై తగు వీరమాంబికా
సారస గంధియందు శుభచర్యుల మేరు సమాన ధైర్యులన్
వారిధితుల్య భక్తుల దివాకర కాంతినియుక్తులన్ సిరుల్
చేరఁగఁ గాంచె శ్రీయమృత లింగ శుభాహ్వయు మల్లికార్జునున్

క ఆ యెఱుపురి యందగ్రజుఁ
డై యొప్పిన యమ్మృతలింగ మహామాత్యావళి భ
న్నాయం భయదాయక దా
క్షాయకుఁడై యెలమి నిరసాపలిసెల్లన్
సీ అతిధార్మికుండైన యమ్మంత్రి వర్యుఁడు
శేషదిగంత ప్రసిద్ధిగాఁగ
మేట యాతనపేరి పెటుమాదేపల్లి
కాట్రేనపల్లెయన్ గ్రామములను
రహిగ నుల్లగ్గించి నాగులింగేశ మ
ల్లేశ్వరశరభ మల్లేశ్వ నాఖ్య
శర్వలింగ ప్రతిష్ఠలుచేసి శరభపు
రాద్యగ్రహారములు వని దింజ
వారములకిచ్చి సర్వాధికారదత్త
దంత పర్యంకి కాందోళ ధవళచామ
రాత పత్రాది బిరుద చిహ్నములు మెఱయ
బరాజ్య సామ్రాజ్య భోగ విస్ఫూర్తిఁదనరి
ఉ శ్రీముదిగొండవంశ సరసీరుహ భాస్కర వీరనార్య పు
త్రీమణి సంతతాశ్రిత సుధీజనయాచక బంధులోక చిం
తామణి నాఁగసర్వ వసుధాస్థలి సెన్నికగన్న సోమమాం
బా మహీశనన్వరి చె మను పద్మ వరించిన కృష్ణ నైవడిన్
క సత్యవ్రతులగువారికిఁ
గాత్యాయని వరుని కరుణఁ గలిగిరి కాంత్యా
దిత్యులు పేరయ లింగా
మాత్యుఁడు వీరేశలింగ మంత్రియునన్ గన్
తే పృథివి సెన్నుఁదగిన పేరయ లింగంబు
బొమ్మకంటి వంశ బుచ్చిరాజు
తనయయైనయట్టి ననబోతి శ్రీవిశా
లాక్షిఁ బెండ్లియాడి యలరె సిరుల
సీ అతని యావరజుండైన వీరేశ్వరుం
డవనిఁ బ్రఖ్యాతిచే నలరినత్క
కాశాలి కొవ్వలి లక్ష్మీపతికి సుతా
రత్నమౌ వీరమారమణిఁ బెండ్లి

యాడి యాఓంకారోష్ఠియం దమ్మతాఖ్యకు
మారు జారునుబారు మేరుధీరుఁ
గనియె నాతఁడు మానఘనుఁడైన ముదిగొండ
గౌరన్న పుత్రియై గణుతి కెక్క
పర్వతను బెండ్లియాడి తత్పర్వసితక
రాస్యయందుఁ గనియె మల్లికార్జు నాఖ్య
లేఖకాగ్రణిఁ బేరయ లింగ సచివ
సార్వభౌమునిఁ బార్వతీశ్వరుని కరుణ

తే. ఆనఘ తరభానియగు మల్లికార్జునుండు
కూర్మి ముదిగొండ శరభన్న కూతు సుంద
రీ సతీమణిఁ బెండ్లియై భాసుర త్రి
మూర్తులను బోలు తనయుల ముగురిఁ గనియె

తే. అగ్రజుండొప్పు నమృత లింగాహ్వయుండు
విపుగను రెండవ సుతుండు పాపరాజు
పరగ మూఁడవ తనయుండు శరభమంత్రి
దానమాన యశోభాగ్య ధైర్యయుతులు

సీ. వరమల్లికార్జునా పగజుఁడై తగు పేర
యాఖ్యుండు బుద్ధిరాజామృతార్య
పట్టయౌవియార్యాంబ వరియించి యమృతలిం
గాహ్వయ ద్వయము మల్లన్న బసవ
రాజు పాపన్నయనఁ రసికులనేవుర
సూనృత వాక్యుల సు. ణయుతులఁ
గరుణా సముద్రుల గాంభీర్య వంతులఁ
గని మహైశ్వర్య గరిమఁగాంచె
వీరి కూటస్థుఁడై తగు పేరయాఖ్య
మంత్రి తల్లజ తనయుండు మల్లికార్జు
నాహ్వయుం డొప్పు నమృతలింగానుజుండు
వంశ భూషణమని జనావళి నుతింప

సీ. నేర్చినాఁడే జాణ నిపధకావ్యాది
బహుళ దేశామేయ భాషణములఁ
జెర్చినాఁ డేమేటి శిలాదలాక్షజా

పగపాదయుగళీ హృత్సరసీజమునఁ
దీర్చినాఁడే మంత్రి ద్విజదశాదిశాది
సకల వర్ణాశ్రమాచార సరణిఁ
గూర్చినాండే దాని కుంభి నీవ్యామాష్ట
హరిదంతరాళ సంభరిత కీర్తి
యతఁడు పొగడొందుఁ గందుకూర్యన్వవాయ
కలశవారాశి పూర్ణిమా కైరవాప్త
వేంకయామాత్య తల్లజ వీరమాంబి
కాబ్జ వదనాత్మజుఁడు మల్లికార్జునుండు

ఉ. ఆతతకీర్తికై కువలయాశ్వచరిత్ర కృతిన్ గ్రహించి ప్ర
స్తుతములైన క్రొత్త పలివేలటి పాడను నగ్రహారముల్
ఖ్యాతిగఁజేసి బంధులకు గ్రాసనసమృద్ధులొసంగి శాంభవ
వ్రాతములోర్కులిచ్చి విభవంబున మల్లన మంత్రి వర్థిలెన్

సీ. అతఁడు శాంత్యాది గుణాఢ్యుఁడై యేలూరు
రాజమహేంద్రవరంబు కొండ
పల్లియన్ దుర్గము ల్పాలింపుచుండి కో
మరువోలి బూర్తి కొమార్తె సద్గు
ణాలంబ దుష్కులుపావనీధరశంబ
యగు గురువాంబఁ బెండ్లాడి శోభి
తాంగులఁ బేరయ లింగంబు సమ్మృత లిం
గంబు వీరేశలింగంబు సాళ్వ
పతియుమూర్తి రాజు బసవరాజన నొప్పు
సుతుల సుజన హితుల సుఖసహితుల
నతుల విభవయుతుల నార్వురఁగనియె నం
దగ్రజుండు పేరయాహ్వయుండు.

తే. అతఁడు శ్రీబుద్ధిరాజ వంశాంక్కరాజ
పుత్రి సోమాంబికానామఁ బుణ్యసీమ
విశ్వపావని రామ సాధ్వీలలామ
వరగుణస్తోమఁ బ్రేమనుద్వాహమయ్యె

ఉ. ఆ తనితమ్ముఁడైన యమృతాహ్వయుఁడు

ఆ అయ్యమాత్యవర్యుఁడతి మోదమున బావ
రాజకుల వతంస రామచంద్ర
పుత్రియైన లక్ష్మిఁబురుషోత్తముఁడు లక్ష్మిఁ
బెండ్లియాడు రీతిఁబెండ్లియాడె

క సరసుఁడు సాళువపతికియ
వరజుండగు మూర్తి రాజు

సీ బిరుదముల్ నృపునిచేఁబెద తండ్రివలెఁగాంచి
యుత్పన్నమగు స్వాస్థ్యముద్ధరించి
గురువరులకు సింగవరమను పురమిచ్చి
వరనియోగులకెల్ల వన్నె దెచ్చి
యగణితభక్త గణార్చనములు చేసి
యవనిభారము భుజమందు మోసి
లింగాంగ సమరససంగతి నుతికెక్కి
ప్రమథగణ శ్రవణమునఁ జొక్కి
సప్తసంతతులొనరించి శాంతిఁబెంచి
యొరులఁబరిమార్చి పౌరులసిరులఁగూర్చి
కుజన సంగతిమాని సద్గుణమే పూని
కీర్తిగనె వాక్యో రాజుమూర్తిరాజు

క అన్నమునకు జరుగకదా
నున్నపురిని లింగధారి యొకఁడుపవా సం
బున్నను గుణవనివ్రతమున
నెన్నికపల్లో సఁగె వారికెల్ల ముదమునన్

ఉ అమ్మను జేంద్ర మాన్యుఁడమృతాంశువదాన్యుఁడు సమ్మదాత్ముఁడై
తుమ్మలపల్లి వంశకలితుండగు వీరనముద్దుపట్టిఁబే
రమ్మయనంగ నొప్పుసుగుణాకర నుద్వాహమయ్యె భారతిం
దమ్మిజనించువేల్పు క్రమదంబునఁ బెండిలియైన చాడ్పునన్

క అమూర్తి రాజ మంత్రికిఁ
దత్ముఁడగుచు బసవరాజు

క ఘనము గనయితమఫ్రాఁడియు
మినుమించిలిపాడు సిరులుమించఁగనోసఁగెన్

ఘన గురుచరవరులకు ఒ
వనితో నైనరైన మంత్రి వకుఇన్గలుఙ
శ్రీ ?

క తనమేన యల్లాడామ్ర్ళత
వినయుండగు బుద్ధిరాజు వీరనాతన్
గానె సత్యాతె పరిణయ
మనుకృతి శ్రీబసవమంత్రి యతి సం తిన్

సీ శరభమల్లేశ్వరస్వామిఁ బ్రతిష్ఠించె
నయితమపూడియం దధికభక్తి
నారామనిధి తటాకాదులై తగుసక్ష
సంతతులానంశై నాశ్వతముగ
రెండవ బసవేశ్వరుండనఁదగ
సంఖ్యాగణార్చనల్సలి పెనిప
సాంబవేశ్వరకృపాసంలబ్ధ ఘనతచె
భోగభాగ్యముల విస్ఫూర్తినలరె
నీతఁడనిరమొనర్చెఁదగి యెదరాతలమున
నతిగుఁ దసోమవాసర వ్రతయుతుండు
మల్లికార్జున గురువమాంబానుతుండు
శరదసమదాని బసవరాజ ప్రదాని

ఆ రసికుఁడతఁడు బుద్ధిరాజకులాగ్రణి
వీరభద్ర తనయ వియ్యమాంబ
సకలబంధువినుత సద్గుణనికురుంబఁ
బేమ మదిఁదలిర్పఁ బెండ్లియాడె

తే అనఘుఁడైనట్టి బసవరాజునకు వియ్య
మాంబికకును ద్భవించిరి యబ్జభావ
కాంఘ్రిసేవాభిమతులు మల్లయ్య మార్తి
రాజు వీరేశలింగమన్ రసికవరులు

క అమువ్వురిలోన గ్రజుఁ
డై పెంపుచెసిన మల్లికార్జునామాత్యుఁడు . . .
తే అతఁడు శ్రీ బుద్ధిరాజ వీరార్యతనయ
విశ్రుతనయ వీరాంబికఁ బెండ్లియాడి

సీ. శర్వముఖోదిత షట్స్థలాచారమా
ర్గప్రతిష్ఠాపన ప్రాజ్ఞుఁడితఁడె
యనుపమవేద వేదాంతశాస్త్రపురాణ
సంగీత ముఖకళాశాలి యితఁడె
వననిధికూపసే వధిశివాగారాది
సంతానకరణ ప్రశస్తుఁడితఁడె
సర్వంసహా నాథసర్వ కార్యక్రియా
విఘటనఘటన ప్రవీణుఁడితఁడె
తీర్థయాత్రా పరాయణాతి థిసముచ్చ
యాన్నపానీయ దానగుణాఢ్యుఁడితఁడె
యనుచు సకలజనంబులు వినుతిసేయ
నవనివర్ధిల్లె నమృతలింగాహ్వయుండు

తే. బంధుపోషకుఁడా తండుభావరాజు
వేంకటేశ్వర వేంకమాంబికలకుద్భ
వించిజనసుతిగాంచి వేంకమాంబి
కాహరిణనేత్రఁ బ్రేమనుద్వాహమయ్యె

తే. అమ్మకుఁ సాధ్వియం దమృతాభిధానుఁ
డతుల సౌందర్యయుతుల దానాభిరతుల
వితత శుభకరమతుల సద్వ్రతతి హితులఁ
గాళహస్తి లింగాదులఁ గాంచెఁ బ్రీతి

ఆ. మరియు నయ్యమాత్య మణికొమ్మరాజయ్య
నార్యునకును లక్ష్మికాత్మజాత
యైన వియ్యమాంబనతి వేడ్క వరియించె
నఖిలబంధు సమ్మదావహముగ

క. ఆసాధ్వియందు వినుత ద
యాసాగరుఁడ మృతలింగ మాకృతివిజిత
శ్రీసుతుల నీశపద పూ
జాసక్తుల మల్లికార్జునాదులఁ గనియెన్

క. శ్రీకందు కూరికులర
త్నాకర శశిమూర్తి రాజహర్షణవేరాం
భాకమలాక్షి భవునకుఁ
బ్రాకటగుణ్యా మృతలింగ ప్రభువర్యునకున్.

వ అభ్యుదయ పరంపరాభివృద్ధిగానారయ సర్వంబుగాసిన చెన్నబసవ పురాణంబను మహాకావ్యంబునకుఁ గథాక్రమంబెట్టిదనిన

**End**

వ అని యిట్లు రేణుక గణాధీశుండు బాహుగేయ వృత్తాంతంబు సవిస్తరంబుగాఁ దెలిపినఁ గుంభసంభవుండ ను నచ్చటి మునీశ్వరులును నత్యంత సంతోషిత స్వాంతులై యేతత్కథాస్మరణం బొనరింపుచు నెప్పటి యట్లిముదంబున నుండిరి

ఉత్సాహ శర్వశర్వరీంద్రిచంద్ర శారదాభ్రపైసగో
పార్వమారుతాశనేశహార హీరశారదా
పర్వతాధి నాధగోప పావకాబ్జలావకా
నిర్వరాత్మ జాతతుల్యకారి పూరితోర్వరా

**Colophon**

గద్య ఇది శ్రీమచ్చెన్నమల్లికార్జున కరుణాకటాక్ష లబ్ధ కవితా మాధురీధురీణ కౌశిక గోత్రపవిత్ర సుకవిజనస్తుత్య పాపయామాత్య ప్రణీతంబైన చెన్నబసవ పురాణంబను మహాకావ్యంబునందు సర్వంబును బంచమాశ్వాసము

(వి వి)—

సమగ్రము వ్రాఁత చక్కనిది తప్పులులేవు శైథిల్యములేదు గ్రంథపాతములులేవు ఈ ప్రతి విలేఖనము 1842 వ సం॥ ఆగస్టు 30 వ తేదికి ముగిసినదట

అయిదాశ్వాసముల యీ ప్రశస్త ప్రబంధమున వీరశైవమత ప్రవర్తక ప్రవరుఁడగు చెన్నబసవేశ్వరుని చరిత్రము వర్ణింపఁబడినది ఈ చెన్నబసవేశ్వరుఁడు, బిజ్జలుని మంత్రియు, వీరశైవమత ప్రతిష్ఠాపకుఁడునగు బసవేశ్వరుని మేనల్లుఁడు ఈతని తల్లి నాగమ్మ బసవేశ్వరుని తోఁబుట్టువు, వీరశైవులు, బసవేశ్వరుని నందీశ్వరావతారమని నమ్మినట్లే చెన్నబసవేశ్వరునిఁ గుమారస్వామి యవతారమని నమ్ముదురు ఈ చెన్నబసవేశ్వరుని చరిత్రము కర్ణాటరచనమున దీనికంటె కొంతభిన్నముగా నున్నది.

ఏతద్గ్రంథకర్త అత్తలూరి పాపయామాత్యుఁడను, సుందరాంబికా శ్రీగిరి మంత్రులతని తల్లిదండ్రులు ఈతఁడు శ్రీశైల మాహాత్మ్యమును గూడం దెల్గున రచియించినాఁడు

కంచుకూరి అమృతలింగామాత్యునకిది యంకితము సేయఁబడినది.

ఆతనివంశ వృత్తాంతమిందు దాహృత పద్యములఁబట్టి యెఱుఁగనగును కృతిపతి వంశమునఁ బూర్వులు కొందఱు ఢిల్లీ గోలకొండ నవాబులచే బిరుదములు బహుమానములు పొందినవారట కొందరు శరభపురి, క్రొత్తపల్లి, వేలేటిపాడు, సింగవరము, అయితమపూఁడి మినుమించిలిపాడు మొదలగు నగ్రహారముల దానముచేసినవారట. కొందఱు, కువలయాశ్వచరిత్ర పంచాక్షరీ మాహాత్మ్యము సత్యవతీ పరిణయము మున్నగు

క. చెనమల్లేశ్వరు పేరిడి
 మునిజనములకుఁ బాలకులకు సోమేశుఁడు దా
ఘనభక్తి చేయఁజెప్పిన
 చెనమలు సీసంబులనఁగఁ జెలఁగెను ధాత్రిన్
క. ఈ సిసములు లేవేళల
 భాసురముగఁ బఠన సేయ భక్తుల కెల్లన్
వాసిగ భుక్తియు ముక్తియు
 నా సర్వేశ్వరుఁడొసంగు ననవరతంబున్

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులంతగా లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇది నె 1553 రున వర్ణితము

ఇంవలి గ్రంథాంతరములకడ నెం. 1111 రు చూచునది

---

## No 2090. జంగమ కాలజ్ఞానము

## JANGAMAKĀLAJNĀNAMU

Substance, paper Size, 12¼ × 7½ inches Pages, 49 Lines, 21 on a page Character, Telugu Condition, old Mode of writing, fair but not free from mistakes

Begins on foll 31 *a* The other works herein are —1 *a* Panditā rādhyacaritra, 56 *a* Ēgantivārivacanamulu, 76 *a* Bhallānacaritra, 121 *b* Sakuntalāparinayamu, 134 *a* Śaśirēkhāparinayamu 146 *a* Madanamōhinivilāsamu, 160 *a* Cātupadyamulu

Complete

A few works purporting to predict the future events after Basa vēsvara, were written by some Vīraśaiva writers, and the work under notice is one of them The predictions in it were made by Sangamēsvara and Virappayya It contains also an account of Basavēsvara, Kam pili empire, Kumārarāma, and the kings of Vijayanagar

**Beginning**

సరజ్ఞుండనే ప్రమథుండు కళ్యాణానకు వచ్చేటప్పుడు కళ్యాణం యేలాగున వుండె నంటె ఆకథం వెండి బంగారం రత్నములు ధనము ధాన్యములు కుండనిండా పాడి పంట కొండంత సిరిగట్టుక బండారు బసవేశ్వరుండు ప్రభువై పాలించుచుండేటప్పుడు కళ్యాణం పంద్రెండు ఆమడ వెడల్పు పట్నం సంపద్రాశిగలిగిఉండును ఈ తీరున ఉన్నప్పుడు బసువాది ప్రమథులు ప్రభుదేవర మొదలయినవారు అనుభవమంటపంలో సమ్మూహాతో కూర్చున్నప్పుడు సర్వజ్ఞుఁడనే ప్రమథుడు వారి ముఖాంతరాన నిలుచుండి

బసవన్నతోడి కాలజ్ఞానమహిమ చెప్పుచున్నాడము, బసవేశా! అసంఖ్యాత ప్రమథుల్లారా! మీ భృత్యాను భృత్యుణ్ణి విన్నవించుకుంటున్నాను మొదట నన్ను కైలాసమందు పుష్పదంతుడని మన్నింతురు ఇపుడు ఈ మర్త్యమందు సర్వజ్ఞుడన్న నామమిచ్చి రక్షించితిరి మాలింగమందు తోచినటువంటి భూత భవిష్యద్వర్తమానాలు తెలియజెప్పుచున్నాను మీరు చిత్తగించేటందుకు విన్నపం చేస్తున్నాను నేను స్వతంత్రుడగాను

వీరప్పయ్య అన్నాజయ్యతో భూత భవిష్యద్వర్తమానం చెప్పిన క్రమం ముందర తాము బ్రహ్మలోకమందు 72 బ్రహ్మకల్పాలు రాజ్యం పరిపాలనం చేస్తినని చెప్పెను

* * * *

ఎవరు ఈఅక్షర పరతత్వమెఱింగి వీరభోజుని భజనచేసుకొనునో వారు పుత్రపౌత్రాభివృద్ధిగా పారంపర్యంతరింగాను ఆచంద్రాయువుగాను సుఖానవుందురు

* * * *

వీరభోజరాజ ముఖావతార వీరనరసింహనామ ఖడ్గాగ్ర శిఖరపరమ అఖండనాయకులు అలజాపురనామ హరిహరపుర భూసురోత్తమ మర్త్యప్రవర్తక మహాజన్మాంతములకు వక్కాణించిలిమిమున్యం

* * * *

శ్రీమత్సకలచరాచరహృదయ సదన నివేశకర్త స్వరూప నిరూపులయిన పరమయోగీంద్ర స్వాములయ్యవారు పరహసగరవాసులయిన శేషాంశ జాతులయిన భూసుర బాలకులకు బుత్తెంచిన ప్రయోజనం

**End**

ఈ ప్రయోజనాలు ఈలాగున వున్నవి ఇకను కాదంటే కాకపోదు లేదంటే లేకపోదు ఎచ్చెరా అంటే అన్నీ అప్పుడే రాదు మీరు మహాత్ములు గ్రంథ వివరం తెలిసి చదువకాయరు దైవ మాయశక్తి నిర్ణయాలు మీకు తెలియవు దివ్యులభావం తెలుసుకోలేరు చెప్పినవివరం చెవులబెట్టక మనస్సునిలుపక మదముతోఁగూడి మఱపుచేసుక చెడిపోతువున్నారు మంత్రయంత్రాలు మనోవికారాలు డంబాచారాలు దత్తూరివగలు తామసకృత్యాలు హీనప్రయోజనాలు దయారహితగుణాలు దండనపాలన విధాలు తక్కుపిక్కుచాపలు, అయి భూదేవికి మోపై పోగాలంవచ్చినది వేము వచ్చేమని ఉన్నాము ఇక మీరు అపుగాములకు సంశయంతోచేని మేము ఒకటి రెంటుమాటి చెప్పినవివరం ఇప్పుడే చెప్పుకూవున్నాము చంద్ర సూర్యాగ్నిమయమైన జన్మదేశమందు చిత్తమునిల్పి జగన్నాధస్వామి కడకు ముదరుచూస్తూ వుంటే తన్న ? సంవత్సర చైత్రశుద్ధ నవమీ ఆదివారంనాడు దేవ ఘడియలలో దివ్యనక్షత్రమందు వీరపురుష శ్రేష్ఠులు విజయం కాయగలరు ఈ వివరములు చెప్పినాము ఇకనైనా మనస్సునిలుపుకొని మావంశంవారు మీతో అణగియున్నారు వారియెడల వాత్సల్యంగలిగి వుండవలెను. ఇది యాలనంటిరే హరిహృదయాల మేము వున్నాము వార్ని సంతోషపెట్టితే మాకు సంతోషం ఆయ్యేటందుకు అనుమానం

లేదు ఇది తెలిసి నడుచుకునేది పెరుబారి చెప్పలేదని పెద్దతనాలు పట్టించుకోక మన స్సున వానిగానే చూచేది ఇది మహాగ్రంథం మహాపుణ్యం సర్వం విష్ణుమహేశ్వరా యనమః

(వి-వి)—

సమగ్రము వ్రాంత చక్కనిది తప్పులున్నవి శైదిల్యములేదు గ్రంధపాత ములు లేవు

సంగమేశ్వరుడు చెప్పినదిగాను, వీరప్పయ్య చెప్పినదిగాను, కలికాల జ్ఞానవిష యములివి వారు బసవేశ్వరుని నాటునుండి లోకమున భావికాలమున జరగబోవు పరి ణామమును దమదివ్యదృష్టిచే గుర్తించి చెప్పినట్టుగా నీ కాలజ్ఞాన గ్రంధముగలదు ఇట్లే మఱికొందఱు వీరశైవులు చెప్పినట్లుగాఁ గొన్ని కాలజ్ఞాన గ్రంధములుగలవు ఇందు బసవ పురాణమునగల బసవేశ్వరుని చరిత్రవిశేషములు, కంపిలిరాజ్యము కుమా రరాముని విషయము, విజయనగర రాజుల విషయము, మొదలుగా నేవేవో వింతవిష యములు గలవు కొన్ని సరిగాజరగిన చరిత్ర విషయములున్నవి ఇంకేవేవో వున్నవి

ఇందీ యితర గ్రంధములున్నవి

పండితారాధ్య చరిత్ర 1 *a*, ఏగంటివారి వచనములు 56 *a*, భల్లాణచరిత్ర 76 *a*, శకుంతలా పరిణయము 121 *a*, శశిరేఖా పరిణయము 134 *a*, మదన మోహినీ విలాసము 146 *a*, చాటుపద్యములు 160

---

## No 2091. జంగమ కాలజ్ఞానము

## JANGAMAKĀLAJÑĀNAMU

Substance, palm leaf Size, 17⅜ × 1½ inches Pages, 30 Lines, 6 and 7 on a page Character, Telugu Condition, very much injured Appearance, very old Mode of writing, good but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము వ్రాంతచక్కనిది తప్పు లంతగాలేవు శైథిల్యము కడుహెచ్చు ఆకులు తునుతునుకలై పొడిపొడియై యున్నవి గ్రంధపాతములు నిండార్లుగానున్నవి

పూర్వమువోలె

గ్రంథాంతమందీ వ్రాతగలదు —

పురిమామిడి రాచయ్య ప్రతినున్న క్రమాన అమృతం ఉదయాద్రి వ్రాశెను అంగి రసనామ సం భాద్రపద శు 10 సోమ

## No 2092 జంగమ కాలజ్ఞానము

## JANGAMAKĀLAJNĀNAMU

Substance, paper Size $14\frac{3}{8} \times 9\frac{1}{2}$ inches Pages, 24 Lines, 39 on a page
Character, Telugu Condition, injured Appearance, old Mode of writing fair almost free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —13 *a* Ēgantivārivacanamulu, 17 *a* Rāmastavarājamu, 31 *a* Kanyakācaritra (Yaksagāna)

Complete

Same work as the above

(వి–వి)—

సమగ్రము వ్రాంతమంచిది తప్పు లంతగాలేవు ప్రాచీన్యముకలదు గ్రంథ పాతములులేవు

పూర్వము వోత

ఇందలి గ్రంథాంతరములు —

13*a* ఏగంటివారి వచనములు, 17*a* రామస్తవరాజము, 31*a* కన్యక చరిత్ర (యక్షగానము)

---

## No 2093 జీవప్రబోధము.

## JĪVAPRABŌDHAMU

Substance, palm leaf Size, $15\frac{1}{2} \times 1\frac{1}{2}$ inches Pages, 14 Lines, 7 on a page
Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

A work on Advaita Vēdānta by Janārdana Brahmakavi

**Beginning**

శ్లో॥ వ్యాసంవశిష్ఠ నప్తారంశక్తేః పౌత్రమకల్మషం।
పరాశరాత్మజంవందే శుకతాతం తపోనిధిం॥
అచతుర్వదనోబ్రహ్మా ద్విబాహురపరోహరిః।
అఫాల లోచనశ్శంభుర్భగవాన్ బాదరాయణః॥

తరు కవితామహోన్నతిగాదె దేవతలు
కారుణ్యమేర్పడఁగా మున్నుచన్న
భవభూతి శివభద్ర బాణమయూర
భారవిప్రముఖులేపారంగ నెగడు

కవి వరుల్వాడసిరి కణఁగిధర్మార్థ
కామమోక్షంబులు గాపున నిట్టి
కవితామహత్త్వంబు గలిగినఁ బడయఁ
గాని పదార్థంబు గలుగునె యెందు

వ అని విచారించి విద్వజ్జనంబుల యనుగ్రహంబువడసి మద్వాచో విశ్రుతంబైన శబ్దవిభూషా లంకృతంబైన జీవప్రబోధంబున కథీశ్వరుండైన పార్వతీశ్వరు గుణకీర్తనంబు సేయదునది యెట్లనిన

*　*　*　*
*　*　*　*

క కృతి పెంపనేయుగంబుల
నతిశయమై వెలుఁగుచుండునని భక్తిమెయిన్
కృతి రచియించెదఁ ద్రిజగ
త్పతికి మహాదేవునకుఁ గపర్దికిఁ బ్రీతిన్
క పరమార్థతత్త్వ మెఱిఁగిన
పురుషవరుల్ మేలనంగ బుధవినుతంబై
పరగిన వేదాంతార్థము
తిరముగ రచియింతుఁ దోడఁదెనుఁగేర్పడఁగన్

**End**

సీ అవని సమస్తవస్తువులు దాల్పను నీళ్లు
నొగివస్తువులుగూడి యుద్ధరింప
ననలమాహారంబు లనుపచనము సేయ
ననిలమింతయుఁగొని యాడుచుండ
నాకాశ మెల్లఁగ్రి యావర్తనమునకు
బయలయ్యె నీభూతపంచకంబు
వలనఁ జరాచరంబులు నుద్భవంబైపు వర్తిల్లు నఖిలవృత్తియనువీని ?
వలనఁజేసి వెలయంగనదిగాన సర్వమునకు
మానుగాఁగఁ దలంప పంచభూతములనూవె
యింతకును గారణస్వరూపకలుజీవ!

*　*　*　*

మణి. అనుపమునచలితుమారు నురగధరున్
మనసి జహరుఁబురమర్దనుఁ ద్రిజగ
ద్వినుత ? గళున్ వినుత యుతునమం
తునిఁబరమ పరున్ మురితమారుశిభున్

**Colophon**

ఇది సంసార సాగరమగ్న జనసమ్యగ్బోధన సముత్తరణ యానపాత్రాయమాన
జనాగత . బహువిరచితంబైన జీవప్రబోధంబనందు ద్వితీయాగిశాగము సమాప్తము

(వి-వి)—

ఆసమగ్రము ప్రథమ ద్వితీయాధికారములు కలవు వ్రాత మంచిది తప్పులు చాలఁగలవు శైథిల్యము కలదు గ్రంథపాతములుగలవు

అద్వైత వేదాంత ప్రతిపాదకమగు నీ ప్రశస్తగ్రంథము జనార్దన బ్రహ్మకవి విరచితము కృత్యవతరణిక యుండు లేదుగాన కవినిగూర్చి విశేషము తెలియరావు ఇందు ఆదిని తరువోజపద్యములుకలదు ఇది ప్రాచీన గ్రంథమగునేమో

---

## No. 2094. జీవ ప్రబోధము

### JĪVAPRABŌDHAMU

Substance, paper Size, 12½ × 7⅞ inches Pages, 4 Lines, 17 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair and almost free from mistakes

Begins on fol 102 *a* The other works herein are —1 *a* Vivēka sindhuvu 58 *a* Ēgantivārivacanamulu, 78 *a* Pidupartivārivacanamulu, 83 *a* Cittannagārivacanamulu, 84 Gēyamulu 85 *b* Visvakarmōpanisattu, 87 and 99 *a* Gēyamulu, 106 *a* Sarvēśvara Śatakamu, 128 *a* Sātvikabrahmavidyavilāsamu

Incomplete

Same work as the above

(వి-వి)—

ఆసమగ్రము వ్రాత మంచిది తప్పులంతగా లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

పూర్వము వోలె

ఇందలి గ్రంథాంతరములకు వివేకసింధువు (నెం 2192 రు) చూచునది

---

## No. 2095. జీవ ప్రబోధము.

### JĪVAPRABŌDHAMU

Substance, palm leaf Size, 16¼ × 1 inches Pages, 72 Lines, 4 on a page Character, Telugu Condition, good Appearance old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as that described under R No 226 *bt*

(వి-వి)—

ఆసమగ్రము గ్రంథావతరణిక లేదు గ్రంథారంభమునందుండి నాల్గవ యాశ్వాసమునఁ గొంతవరకుఁ గలదు వ్రాత మంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇది ఆర్ నెం 22 రున వర్ణితమైనది.

## No. 2096 జీవేశ్వర నిర్ణయము

### JĪVĒŚVARANIRṆAYAMU

Substance, palm leaf Size, 16¼ × 1⅜ inches Pages 9 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 10 *a* The other works herein are —1 *a* Ātmadarsa namu, 14 *b* and 28 *a* Kirtanalu, 17 *a* Sitārāmānjaneyamu, 21-*a* Misrārpanamu, 49 *a* Jivēsvarasamvādamu, 55 *a* Dandakamu, 59 *a* Dvādasamanjarikāstōtramu, 67 *a* Parabrahmasakalavilakṣantvanīr nayamu

Complete

A work on Vēdānta The author is not known

**Beginning**

శ్రీ నిత్యసత్య స్వయంప్రకాశ పరిపూర్ణ విగ్రహ జీవేశ్వర నిర్ణయంబు దెలియుట కొఱకు జాగ్రత్స్వప్నసుషుప్తులు లయించిన సమాధియందు ధ్యానంబు సేయుచున్న సమయంబున నుపాసన దైవంబైన శ్రీరాములు బోధచేసిన తత్వ నిష్కర్ష యెషువలెనంటేను అనాది నిర్వికల్ప సనాతన బ్రహ్మమందు జగత్సృష్టి హేతువకై మాయదోచె నెట్లనిన—

**End**

జీవుడు లేని యీశ్వరుడు లేడు. అది యెట్లున్న బంటులేని మూకలేనట్లు చినుకులేని వానలేనట్లు గింజలేని రాశిలేనట్లు ఇల్లులేని యూరులేనట్లు ఊరులేని దేశం లేనట్లు పిన్నలేని పెద్దలేనట్లు కించిత్‌జ్ఞత్వంబులేని సర్వజ్ఞత్వంబు లేదు అది గావున సద్గురు కరుణా కటాక్షంబుననున్నది ఉన్నట్లుగా దెలిసి ముక్తుండగు నహోభద్ర శైలాధిపా

(వి-వి )—

సమగ్రము వ్రాత చిన్నది తప్పులున్నవి. శైథిల్య గ్రంథ పాతములు లేవు వేదాంత విషయ మీగ్రంథమందు ప్రతిపాదితము గ్రంథకర్త పేరిందు గానరాదు —

ఇందలి గ్రంథాంతరములకు డి నెం 2059 రు చూచునది

---

## No 2097 జీవేశ్వర సంవాదము

### JĪVĒŚVARASAMVĀDAMU

Substance, palm leaf Size, 16¼ × 1⅜ inches Pages, 11 Lines, 5 on a page Character, Telugu Condition, good. Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 49 *a* The other works herein are —1 *a*, Ātmadarśa-amu, 10 *a* Jīvēsvara Nirnayamu, 14 *b* and 28-*a* Kirtanalu, 17-*a*

Sıtārāmāñjaneyasamvādamu, 21 *a* Misrārpanamu, 55 *a* Dandakamu 59 *a* Dvādasamanjarıkāstōtra 67 Parabrahmasakalavılaksanatva-nırnayamu

Complete

Certain topics on Vēdānta are discussed in this in the form of a conversation between a teacher and his pupil The author is Jaggakavı

**Beginning** ·

శ్రీ గురురాయ నిరోగ భవాంఘ్రులు చేరి నుతించెద నోయి।
చేరి నుతించినవారికి తత్వము చేకూరును విను జీవా॥
అది చేకూరే విధమేలాగో అనతియ్యరే సామీ।
తెలిపెద వినరో దివ్యచతుర్దళ జలరూహ పీఠముగనరా॥
ఘనభూతత్వంబున నొక పచ్చని దను చక్రంబేమోయి।
ఆధారంబని అతి వినయోక్తులు ఆత్మ దలంతురు జీవా॥
ఆధారము చతురక్షర మధ్యను ఆదినకారంబేమీ।
వాదిసాంత బీజాదినకార మనాది మంత్రముర జీవా॥

* * * *

**End**

అంజలిచేసిన యాక్షణమున భవభంజనమగునా సామీ।
భవభంజనమని నెవరు దలంచిన నివగల మోక్షము నేను॥
అభవుడ జీవప్రభు సంవాదము నందితికా నా సామీ।
అందితిగాని యందుకల్మషము నొందకయుంటే జీవా॥
ఈ కృతి జగ్గకవీశ్వరు జెప్ప పురాకృత పుణ్యంబేమీ।
తొలిజన్మము ననుగొలచినవారికి ఫలమిటు గలుగుర జీవా॥
ఇదివిని వ్రాసిన నీప్సితార్థములిచ్చేవా ప్రభు రాయా।
సదమలమతులకు సమకూర్చెదనని సాటిదజగముల జీవా॥
వినిచదివిన యాకారణజ్ఞులకు కలుగున మోక్షం సామీ।
మోక్షముగలదని ముల్లోకంబుల సాక్షిబల్కెదను జీవా॥ సాక్షిబల్కెదను జీవా॥

(వి-వి)—

సమగ్రము. వ్రాత మంచిది తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు వేదాంత విషయము గురుశిష్య సంవాదరూపమున నిందు వర్ణింపబడినది కర్త జగ్గకవి

ఇందీ యితర గ్రంథములున్నవి—1a ఆత్మ దర్శనము, 10a జీవేశ్వర నిర్ణయము, 14b, 28a కీర్తనలు, 17a సీతారామాంజనేయ సంవాదము, 21a మిశ్రార్పణము, 55a దండకము, 59a ద్వాదశమంజరికా స్తోత్రము, 67 పరబ్రహ్మ సకల విలక్షణత్వ నిర్ణయము

## No. 2098. జ్ఞాన బోధకము

## JNĀNABŌDHAKAMU

Substance, paper Size, $12\frac{1}{4} \times 8\frac{1}{4}$ inches Pages, 302 Lines, 20 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing good but full of mistakes

Complete

The following notes by C P Brown furnish the necessary information "This book is called Jnānabodhamu or Guide to wisdom It is a Roman Catholic treatise or series of sermons apparently translated from Tamil into very indifferent Telugu The style is poor and dry There is no instruction regarding the Bible"

**Beginning**

పాపముయొక్క మర్లు పడుదలిస్తే ఋందర ఋందర తన్నుతాను తెలియవలెను తన్నుతాను తెలిస్తే తన్ను కలిగించిన సర్వేశ్వరుని తెలియవచ్చును వారిని తెలిసి వారినుండి ఆత్మనకు కావలసిన మోక్షభాగ్యం పొందవచ్చును అది యెషువలెనంటే, రాజకుమారుడు ఒకడు బుద్ధి తెలియని లేతప్రాయములో చెంచువాళ్లచేతిలో చిక్కి వారితో కలుసుకుని అడవిలోఉండేటి కాయలు, గడ్డలు, పండ్లు తిని పెరిగిన డు బుద్ధి తెలిసిన వెనకి తన తండ్రి రాజు అని తెలిస్తే యేమి తలంచును తండ్రి దగ్గఱకు ఎప్పుడు పోదునో అనిన్నీ ఎప్పుడు రాజ్యం ఏలుదునో అనిన్నీ మహాఅభిలాషతో ఉండునుగాక ఆ అడవిలో కొంతసేపు అయినా ధరించి వుండేటందుకు మనస్సువచ్చునా ఆలాగే మనుష్యుడు తన ఆత్మయొక్క జ్ఞానజననమున్ను దివ్యలక్షణ మహిమయున్ను తెలిస్తే చెడిపోయ్యే భూలోకం వర్జించి నాశనంలేని మోక్షరాజ్యంలో సర్వేశ్వరునితో వర్థిల్లి వుండ మనస్సు వుంచక వుందునో

**End**

ఆరాధన వేడుదల

నన్ను కాపాడుకొని వచ్చేటి నా యేలినవారా! నిత్యపరమగురువైన కర్తుడా! మీసము ఖాన నా బుద్ధి మనస్సు మహా అణిచితాక్షి వినయముతో మిక్కు ఆరాధించేను దేవర వారుమాత్రమే సకలస్తోత్రాలకున్ను ఆరాధనలకున్ను ప్రాప్తమైయున్నారు వారి యొక్క మహిమనున్ను నీయొక్క మహానీచత్వమున్ను కొంచెంగా ధ్యానించి మహా శాక్షిగా వుండేది ఆమెన్ జేసూ.

**Colophon**

ప్రార్థనలున్ను జపాలున్ను అనిత్య వెత్యాసమున్ను జ్ఞానబోధకమున్ను ఝుమెము స్తోత్రాలున్ను వ్రాసి ముగిసినది సంపూర్ణం సమాప్తం "సర్వేశ్వరాయనమః

(వి-వి)—

సమగ్రము వ్రాంత మంచిది తప్పులు చాలఁ గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఈ గ్రంథమును గూర్చి సి పి బ్రౌను దొరగారు తెలుఁగున నిట్లు వ్రాసిరి—

"ఇది క్రైస్తవమతం బోధచేసే గ్రంథమైవున్నది మొట్టుకు ఇది ఒయటల్ బెద తాలూకా కాదు మతముగురించీ నీతినిగురించీ పాపం పుణ్యం మోక్షం ఇత్యాదులను గురించీ ప్రసంగించివున్నదిగాని నీరసంగా జబ్బుగా చెప్పివున్నది ఇది వ్రాసినమీదట ఇతరమైన వక ప్రతి దొరకి శాంతమట్టుకు సంప్రతించుకొన్నాముగాని యెక్కువ ఫాయిదాగా లేదు"

సి పి బ్రౌన్, 3 ఆగస్టు 1840

రోమన్ కాథలిక్కు క్రైస్తవమత ప్రార్థనాది విషయములిందుఁ గలవు దీని భాష మిక్కిలి అస్పష్టము అపరిశుద్ధమును, దీని రచయిత పేరెఱుఁగ రాదు అరవమున కిది తెలుఁగైయుండును

---

## No 2099 జ్ఞానాంజనము

## JNĀNĀNJANAMU

Substance, palm leaf Size, 16½ × 1½ inches Pages, 15 Lines, 4 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, bad and not free from mistakes

Begins on fol 16 *a* of the manuscript described under No 2074

Complete

A treatise on Śrīvaisnava system

**Beginning**

త్రిభిః ప్రజాపతౌ భక్తిః సప్తభిశ్శం కరస్యతు
వింశత్యగ్నీంద్ర సూర్యాది జన్మభి వైష్ణవో భవేత్

అనేక జన్మలనెత్తినవానికి అంతట శ్రీవైష్ణవ జన్మముగలిగి భగవద్భక్తుండై విశ్రాంతుండై అతనిం బొందుదురు అతని దాసులయిన బ్రహ్మాదులకె పరమపదం గతి చెప్పంగాను తన భక్తులయిన జ్ఞానోన్ముఖులయిన యేకాంతులయినవారికి పరమపదం గలిగేటందుకు

**End.**

నిరంతరమున్న నీరజాక్షుని యొక్క రహస్యార్థములన్ని నెన్నెఱుంగవచ్చిన నేటి నిబంధం లేక భగవద్భాగవతాచార్య కృపాసమృద్ధిపరుండై విమలాచార దేహియైవుండును

(వి-వి)—

సమగ్రము వ్రాంతరోఁతగానున్నది తప్పులున్నవి. శైథిల్యము గలదు గ్రంథ పాతములు గలవు

శ్రీ వైష్ణవమత విషయము లిందుఁగలవు—

ఇందలి గ్రంథాంతరములకు నెం 2099 రు చూచునది.

## No 2100. తత్త్వత్రయము

### TATTVATRAYAMU

Substance, palm leaf Size, 13¼ × 1⅜ inches Pages, 27 Lines, 6 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing fair but not free from mistakes

Begins on fol 15 *a* The other works herein are —1-*a* Prapannaparitrānamu, 7 *a* Arthapancakamu, 29 *a* Rahasyatrayamu, 42-*a* Rāmānujarahasyatrayamu

Complete

This is a Telugu exposition of the nature of the three realities (tattvas) namely Cit (animate) Acit (inanimate) and Īsvara (God) according to Visistādvaita System

**Beginning**

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే।
సంసారభోగిసందష్టజీవజీవాతవే నమః ॥

ముముక్షువైన చేతనునికి మోక్షమందు ఇచ్ఛగలిగి ఎప్పటికి తత్త్వత్రయ జ్ఞానం కలుగవలెను తత్త్వత్రయమయ్యేటిది చిత్తున్ను అచిత్తున్ను, ఈశ్వరుడున్ను చిత్తు అంటేను జీవుడు, అచిత్తు అంటేను ప్రకృతి, ఈశ్వరుడంటేను జీవునియందుండే పరమాత్మ ఆ జీవు నిలక్షణంబేలాగన్నను దేహానకున్ను, ఇంద్రియాలకున్ను, మనస్సుకున్ను, ప్రాణాలకున్ను, బుద్ధికిన్ని వేరైవుండును ఇట్లనంగాను యీ శరీరమున్ను, యీ శరీరమందున్న యింద్రియాలున్ను జీవుండుగాడు శరీరమున్ను వేరే జీవుడున్ను వేరే అని తెలియంగవలెను జీవుడున్ను వేరే దేహమున్ను వేరే తెలుసవలెనంటేను, నా దేహమంచున్నారు గనుక యిందుచాతను తానున్ను వేరే తనదేహమున్ను వేరే అని తెలియంగవలెను

**End**

ఇంక అర్చావతారమయ్యేడిది జీవులకు అభిమతములయిన విగ్రహములందు అవతారములవలెంగాక దేశకాలాధికారి నియమములేకుండేటట్టు సన్నిధిచేసి అట్లనంగాను ఒక దేశమందు ఒకకాలమందున్ను అధికారినిగూర్చి కానికాక ప్రత్యక్షమై అపరాధములు చూడక అర్చావతారము పరతంత్రమైన సమస్తమైన నడకలాగలవాడై వేంచేసి వేంచేసివుండే దేవునికి రుచియించేవాడున్ను, శుభములు ఇచ్చేవాడున్ను సమస్తమైన కోరికలు కోరినవి యిచ్చేవాడున్ను, అన్ని కోరికలు యిచ్చేటందుకు కారణమైన వాడున్ను, సమస్తమైన సద్గుణాలున్ను అర్చావతారమందు పరిపూర్ణములు, తన స్వస్వామి భావమును తిరుగంబెట్టుకొని అజ్ఞుడుంబలెను, అట్లనంగాను అజ్ఞానింబలెను, అస్వతంత్రుండుంబలెను, అస్వతంత్రుండనంగా స్వతంత్రంలేనివానింబలెను, అపాపకారుణ్యపర

వశుంకొని ఆశ్లిసంగాను శెక్కవెట్టిరాని కరుణకు పరవశుండై పరవశుండనంగాను కరుణచాత చెప్పినట్టు చేసినవాడై సర్వాపేక్షితములా యిచ్చును సర్వాపేక్షితము లనంగాను సకలమైన కోరికలా యిచ్చును ఈశ్వరతత్త్వం సమాప్తం

(వి-వి)—

సమగ్రము వ్రాంత మంచిది తప్పులు అంతగా లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

చిత్తు, అచిత్తు, ఈశ్వరుండు నని విశిష్టాద్వైతులు చేర్కొను తత్త్వత్రయమును గూర్చి యీ గ్రంథమున నిర్వచనము గలదు ఇది ద్రవిడ గ్రంథమునకుఁ దెలుఁగేమో'

---

## No 2101 తత్త్వత్రయము

### TATTVATRAYAMU

Substance, palm leaf Size, 8½ × 1⅜ inches Pages, 24 Lines, 10 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair and free from mistakes

Begins on fol 71 *a* of the manuscript described under No **2103**

Complete

Describes the nature of God, soul and the inanimate objects according to Visiṣṭādvaita system of philosophy

**Beginning**

శ్రీమతే దేవరాజగురవే నమః ।

లోకాచార్యాయ గురవే కృష్ణపాదస్య సూనవే ।
సంసారభోగిసందష్ట జీవజీవాతవే నమః ॥

ముముక్షువైన చేతనునికి మోక్షేచ్ఛ గలిగేటప్పుడు తత్త్వత్రయజ్ఞానము కలుగ వలెను తత్త్వత్రయమయ్యేటిది చిత్తున్ను, అచిత్తున్ను, ఈశ్వరుడున్ను, చిత్తనుట ఆత్మను ఆత్మస్వరూపము చెన్ను చెన్ను పరంపరమాయ్ అనేటి భంగిని దేహేంద్రియ మనః ప్రాణబుద్ధివిలక్షణమై, అజడమై, ఆనందరూపమై, నిత్యమై, అణువై, అవ్యక్తమై, అచింత్యమై, నిరవయవమై, నిర్వికారమై, జ్ఞానాశ్రయమై, ఈశ్వరునికి నియామ్యమై, ధార్యమై, శేషమైయుండును

**End.**

అంతర్యామిత్వమనియెడిది అంతఃప్రవిశ్యనియంతయైయుండుట, స్వర్గనరకప్రవే శాది సర్వావస్థలయందున్ను, సకలచేతనులకున్ను తోడై వారిని విడువజాలకుండు లే శాక శుభాశ్రయమైన తిరుమేనితోడ వారికి ధ్యేయుఁడయ్యేటికొఱకున్ను బంధుభూతుడై హృదయకమలమందు వేంచేసివుండే జీవునికి అర్చావతారమయ్యేడిది తమరుకంతుకం తెళ్ళురువుముళ్ళురువంతానే' అనేటి భంగిని చేతనుల కభిమతమయ్యేటి ద్రవ్యమందు

విభవ విశేషములవలెగాక దేశకాలాధికార నియమములేకుండేటట్లు సన్నిధిచేసి అప రాధములను జూడక అర్చకపరతంత్రుడై సమస్తవ్యాపారములు గలవాడై తిరుపతుల యందున్ను, గృహములయందున్ను వేంచేసియుండేటి యునికి రుచి జనకత్వము శుభా శ్రయత్వమున్ను అశేషలోకశరణ్యత్వమున్ను అర్చావతారమందు పరిపూర్ణములు, స్వస్వామిభావమును తిరుగబెట్టుకొని అజ్ఞునుంబలెను, అశక్తునుంబలెను, అస్వతంత్రు నుంబలె నుండేటి అపారకారుణ్యపరవశుడై సర్వాపేక్షితముల నిప్పించును

(వి-వి)—

సమగ్రము వ్రాంత మంచిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాత ములు లేవు

విశిష్టాద్వైత సిద్ధాంతము చొప్పున గల చిత్తు, అచిత్తు, ఈశ్వరుడునను తత్త్వ త్రయమునగూర్చి వివరణమిందు గలదు

---

## No 2102. తత్త్వత్రయజ్ఞానాదికము

### TATTVATRAYAJNĀNĀDIKAMU

Substance palm leaf Size, 16½ × 1¼ inches Foll 49 Lines, 4 on a page Character, Telugu Condition, very much injured Appearance, old Mode of writing, not good and not free from mistakes

Begins on fol 54 *a* of the manuscript described under No **2074**

Complete

A work on Vaisnavism dealing with Cit (animate) Acit (inanimate) and Isvara (God)

**Beginning .**

శ్రీవత్సచిహ్నమిశ్రేభ్యో నమ ఉక్తిమధీమహే ।
యదుక్తయస్త్రయీకంఠే యాన్తి మంగళసూత్రతామ్ ॥
శ్రీమత్కూరకులాధీశం శ్రీవత్సాంకముపాస్మహే
అగ్ర్యం యతీంద్రశిష్యాణామాద్యం వేదాంతవేదినామ్
శ్రీపరాశరభట్టార్య శ్శ్రీరంగేశ పురోహితః
శ్రీవత్సాంకసుతశ్శ్రీమాన్ శ్రేయసే మేస్తు భూయసే

అమ్మాంజమ్మవారి తనియ

శ్రీరంగరాజకమలా రూపాచార్య ప్రకాశకమ్
శ్రీపరాశరభట్టార్య పత్నీరత్నం సమాశ్రయే

శ్రీరంగరాజుల అయ్యవారి తనియ

సుందరేశగురోః పౌత్రం పుత్రం రంగ విపశ్చితః
శ్రీపరాశరభట్టార్య రంగరాజ గురుం భజే.

తిరుమలమ్మగారి తనియ

శ్రీపరాశరభట్టార్య వేంకటేశ ప్రియాసతిమ్
శ్రీశైలజననీనామ్నా దృష్టాదృష్ట ప్రదాయినీమ్
లోకాచార్యాయగురవే కృష్ణపాదస్య సూనవే
సంసారభోగిసందష్ట జీవజీవాతవే నమ
నమోరామానుజాచార్య యోస్మాకస్వీకృత్యకేవలమ్
రామానుజమునేస్తస్య కృత్యశేషమపూరయత్

ముముక్షువయిన చేతనునికి మోక్షముకలిగేటప్పుడు తత్త్వత్రయజ్ఞానము కలుగ వలెను తత్త్వత్రయమయ్యేడిది చిత్తున్ను, అచిత్తున్ను, ఈశ్వరుడున్ను, చిత్తనుట ఆత్మను, ఆత్మస్వరూపము చెన్నుచెన్నుపరంపరమాయి అనేటి భంగిని దేహేంద్రియమన ప్రాణబుద్ధివిలక్షణమై, అజడమై, ఆనందరూపమై, నిత్యమై, అణువై, అవ్యక్తమై, అచింత్యమై, నిరవయవమై, నిర్వికారమై, జ్ఞానాశ్రయమై, ఈశ్వరునికి నియామ్యమై, ధార్యమై, శేషమై వుండును ఆత్మస్వరూపం దేహాదివిలక్షణం ఆవుట యెట్లన్నను

**End**

చరమశ్లోకము రెండు అర్థములై పదనకొండు పదములై ముప్పైరెండు తిరువక్ష రములై వుండును అదెట్లన్నఁ సర్వధర్మాన్ అనిన్ని, పరిత్యజ్య అనిన్ని, మాం అనిన్ని, ఏకమనిన్ని, శరణమనిన్ని, అహం అనిన్ని, త్వాం అనిన్ని, సర్వపాపేభ్యో అనిన్ని, మోక్షయిష్యామి అనిన్ని, మాశుచ అనిన్ని పదనొకొండు పదములై యుండును పూర్వార్థము పదారు తిరువక్షరములున్ను, వుత్తరార్థము పదారు తిరువక్షరములున్ను ముప్పదిరెండు తిరువక్షరములయియుండును సర్వధర్మాన్

(వి-వి) —

అసమగ్రము వ్రాంత మంచిదిగాదు తప్పు లున్నవి శైథిల్యము చాలఁ గలదు గ్రంథపాతములు గలవు

చిదచిదీశ్వరులను తత్త్వత్రయమునుగూర్చి విశిష్టాద్వైతసిద్ధాంతము చెప్పిన వివ రణము మొదలగు విషయములిందు గలవు

తుదిని అష్టశ్లోకి, మఱికొన్ని ద్రవిడపద్యములు 17 పత్రములలోఁ గలవు

---

## No 2103 తత్త్వత్రయసారము.

### TATTVATRAYASĀRAMU

Substance, palm leaf Size, 8¼ × 1⅜ inches Pages, 36 Lines, 7 on a page. Character, Telugu Condition, fair Appearance, old Mode of writing good and free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —18-*b* Vaiṣnava-[illegible]stōtramu 20-*a* Padivārtalu, 21 *a* Ananyagatitvādinirūpaṇamu,

27 *a* Pancasamskāraphalamu, 33 *a* Arthapancakajnānamu, 37 *b* Tirumantrācārya Śisyapravartana, 46 *a* Sārārthacatustayamu, 47 *a* Nambillagārivārta 48 *a* Srivaisnavācārayasūktamulu, 49 *a* Vajrasūcyupanisattu, 50 *a* Srivaisnavavaibhavamu 53 *a* Bhāgavatasampradāyasārānugunāstādasārthamulu, 71 *a* Tattvatrayamu, 83 *a* Visnvādhikyanirūpanamu

Complete

This is a rendering in popular Telugu of the same work in Tamil, about the three realities according to Tengalai sect of the Vaisnava school

**Beginning**

చిదచిదీశ్వరతత్త్వములయందు చిత్తైన జీవుండువుండే క్రమమెట్లన్నను శ్రుతివాక్యం పంచవింశోయం పురుష పంచవింశ ఆత్మాభవతి అనిన్ని, మకార పంచవింశకః అనిన్ని, మకారో జీవవాచక అనిన్ని మకారస్తుతయోర్దాసః అనిన్ని, నీవారశూక వత్తన్వీ పీతాభాస్వత్యణూపమా అనిన్ని, వాలాగ్రశతభాగస్య శతధాకల్పితస్యచ, భాగో జీవస్సవిజ్ఞేయ స్సచానంత్యాయకల్పతే అనిన్ని, ఆత్మదాస్యం హరేస్స్వామ్యం స్వభావంచ సదాస్మర అనిన్ని, జ్ఞాతయై కర్తయై భోక్తయై అచ్ఛేద్యుడై అదాహ్యుడై అక్లేద్యుడై అశోష్యుడై అభేద్యుడై వ్యాపకుడై ధారకుడై జ్ఞానానందమయుడై శేషమై భగవన్నియామ్యుడై భగవదేకపారతంత్ర్యుడై భగవద్దాసుడై భగవచ్ఛరీరుడై స్వస్వైస్వయం ప్రకాశుడై అణువైయుండును

**End**

నాచ్చిమారున్నూ భాగవత హృదయములయందు ఉండి అజ్ఞులగు పురుషులకు తామే పురుషకారభూతయై భాగవతముఖమున జ్ఞానభక్తివైరాగ్యములను తెలుపుచున్నూ బోధించి ఆచార్యవిగ్రహమై అవతరించి వేదశాస్త్రపురాణేతిహాసాగమోపనిషదర్థముల చేతను, జీవేశ్వరప్రకృతి భేదములను దెలిపి స్వజ్ఞానప్రాపకజ్ఞానప్రాప్యజ్ఞానములను ప్రసాదించి పంచసంస్కారములున్ను ప్రసాదించి యంత్రమంత్రార్థములున్ను తెలిపి శిష్యుని ఆత్మయాత్ర తనకు దేహయాత్రగాను భావించి సదాజ్ఞానభక్తి వైరాగ్యములను దెలుపుచున్న అర్థకామములు అనర్థహేతువులని తెలుపుచున్న భగవద్భాగవతాచార్య కైంకర్య పట్టభద్రునిఁజేసి రక్షించును సచ్ఛిష్యుడు సదాచార్యుని తిరువడిగళ సేవ తనకు నిత్యవిభూతియని వేంచేసియుండి తమ్మాశ్రయించిన చేతనులను ఉద్ధరించి రక్షింతురని నంబిళ్లగారు తమ తిరువడిగళ నాశ్రయించిన వడక్కు తిరువీధిప్పిళ్లగారికి తత్త్వత్రయ సారమను రహస్యము నానతిచ్చిరి

(వి-వి.) —

సమగ్రము వ్రాంత యందముగలది తప్పులు లేవు. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

తెంకల వైష్ణవ సంప్రదాయమున సంబిళ్లగారు వడక్కు తిరువీధి పిళ్లిగారికి బోధించినట్లు ద్రవిడమునందుగల తత్త్వత్రయసారమును గ్రంథమునకిది వ్యాఖ్యా తెలుగు పరివర్తనము

---

## No 2104 తదీయారాధన ఫలము.

## TADĪYĀRĀDHANAPHALAMU

Substance, palm leaf Size, 14 × 1⅜ inches Pages, 32 Lines, 5 on a page Character, Telugu Condition injured Appearance, old Mode of writing, fair and almost free from mistakes

Begins on fol 53 *a* The other work herein is —1 *a* Hariscandra-caritra

Incomplete

A Vaisnava work describing with illustrations the greatness of the devotees of Visnu

**Beginning**

తదీయారాధనం పుణ్యం వక్ష్యామి మునిసత్తమాః।
యదన్వేషణమాత్రేణ సర్వపాపైః ప్రముచ్యతే ॥

అర్థం—ఓ మునిసత్తములార ! తదీయారాధనపుణ్యం జెప్పేము వినుండా ! ఈ తదీయారాధనం చెప్పేమని ఉద్యోగించినమాత్రానే సర్వపాపాలున్ను విడిచి పోవును అటువంటి తదీయారాధనం ఫలము చెప్పేము వినుండా ! నాతః పరతరం పుణ్యం త్రిషులోకేషు విద్యతే। సర్వకామప్రదం నృణాం అత్యంతాతిశయం హరేః॥ మూడు లోకాలందున్ను యింతకంటె మరియొక పుణ్యంలేదు మనుష్యులు కోరిన కోరికలిచ్చేటిది సర్వేశ్వరునికి మిగులాను అతిశయమైనది

**End**

శ్రీ వైష్ణవ తళిగ్గెఘు ప్రసాదమే పుచ్చుకొనుటూ, వారియొక్క శ్రీపాదతీర్థమే ప్రసాదముటూ వారిం గంటే సేవించుటూ, వారిమీంద నింద్యమానిపుండుటూ నింద్యమానకుంటే అపచారము

శూద్రంవా భగవద్భక్తం నిషాదం శ్వపచం తథా।
వీక్షతే జాతిసామాన్యాత్ సయాతి నరకం నరః ॥

శూద్రుడేకానీ, నిషాద్యుడేకానీ, శ్వపచుడేకాని భగవద్భక్తిగలిగి శ్రీ వైష్ణవుండైన వారిని యెవ్వరు జాతిసామాన్యంచాతను నిందించేరు నరకానం బొందుదురు

(వి-వి )—

అసమగ్రము వ్రాంత మంచిది తప్పులంతగా లేవు శైథిల్యము గలదు. గ్రంథపాతములు గలవు

ఇందు విష్ణుభక్తులను, విష్ణుభక్తానుభక్తులను, దాసదాసానుదాసులును లోక మునకుఁ బరమపూజ్యులనియు విష్ణునారాధనముకంటె వీరి యారాధనమే విశేష ఫల ప్రదమనియు సంస్కృత శ్లోకోదాహరణార్థవివరణ పూర్వకముగా నిరూపింపఁబడినది

ఇందలి గ్రంథాంతరము —

1a హరిశ్చంద్ర చరిత్ర

---

## No 2105 తదీయారాధన ఫలము

## TADĪYĀRĀDHANAPHALAMU

Substance, palm leaf Size, 11 × 1⅛ inches Pages, 73 Lines, 5 on a page Character, Telugu Condition, fair Appearance, old mode of writing, not good, and not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత మంచిదికాదు తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు

పూర్వము వలె

గ్రంథాంతమున నాలుగాకులమీద మహదాశీర్వచనము (సంస్కృతము) గలదు

---

## No 2106 తిరుమంత్రాచార్య శిష్యప్రవర్తన.

## TIRUMANTRĀCĀRYŚIŚYAPRAVARTANA

Substance palm leaf Size, 8½ × 1⅜ inches Pages, 18 Lines, 10 on a page, Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good and free from mistakes

Begins on fol 37-*b* of the manuscript described under No. **2103**

Complete

Describes the duties of a religious teacher and his pupil towards each other before the Tirumantra is taught, according to Śrī Vaiṣṇava religion One Dēvarājaguru of Viśvāmitragōtra, son of Nṛsiṁhaguru and a disciple of Raṅgacārya, is referred to in the beginning

**Beginning**

కౌశికాన్వయ సంజాతం శ్రీ నృసింహ గురోస్సుతమ్
శ్రీరంగార్య కృపాపాత్రం దేవరాజ గురుంభజే
దైవాధీనం జగత్సర్వం మంత్రాధీనంతు దైవతమ్
తన్మంత్రం బ్రాహ్మణాధీనం బ్రాహ్మణో మమదైవతమ్.

ఇట్లా భంగిని ఉభయవిభూతులున్ను ఈశ్వరాధీనమై వుండును ఇట్టి యీశ్వ
తిరుమంత్రాధీనమై వుండును. తిరుమంత్రము ఆచార్యాధీనమై వుండును అటు
ఉభయవిభూతిన్ని విభూతిమంతుడైన యీశ్వరుడున్ను అతని ప్రతిపాదించే తిరు
త్రమున్ను ఆచార్యాధీనమై వుంటుటచేత బట్టిండి తిరుమంత్రమందు ప్రతిపాదింపబడే
వ్యప్రాపకములు రెండున్ను ఆచార్యాధీనమయ్యేటిదానికి కొరతలేదు ఆచార్యు
పి వారెట్టివారన్నను,

ఆచార్యో వేదసంపన్నో విష్ణుభక్తో విమత్సరః।
మంత్రజ్ఞో మంత్రనిష్ఠశ్చ సదా మంత్రాత్మకశ్శుచి ॥

1

పాదేయములు ఏవైనా కొన్ని గలవు వానియందు తానున్ను వానియందు ఆత
న్ను ఎఱుంగను ఆసక్తిగలిగిఉండుటను దేశాంతరమున్ను దేహాంతరమున్ను కలదని
ంగి భయముతోడను గూడను వర్తింపుటను

పెరుందేవితాయార్ తిరువడిగళేశరణమ్

వి )—

సమగ్రము వ్రాంత చక్కనిది శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు
ఇందు శ్రీ వైష్ణవమతసిద్ధాంతము ప్రకారము తిరుమంత్రోపదేశము గావించు గురు
శిష్యుడును, శిష్యుడైన గురుడును పాటింపవలసిన ధర్మములు తెలుపబడినవి
విశ్వామిత్రగోత్రజాతుడును నృసింహగురుని కొమారుడును, శ్రీరంగాచార్యుని శిష్యు
డగు దేవరాజగురు వీ గ్రంథారంభమున నుతింపబడెను

---

## No. 2107 తెంగల వైష్ణవ సంప్రదాయ విషయము

## TENGALA VAISNAVA SAMPRADĀYA VISAYAMU

Substance, palm leaf Size, $9\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches Pages, 160 Lines, 6 on a page
Character, Telugu Condition, very much injured Appearance, very old
Mode of writing, fair but full of mistakes

Incomplete

Describes the principles of Tengalai sect of Vaisnavas

**Beginning**

ప్రపత్తినైష్ఠికత్వం ఇట్టిదానిని చరమదయాళుత్వము స్వరూపమైయుండంగాను
ఛేదంచేసేటప్పుడున్ను ప్రపత్తికే విరోధమైయుండును ఆనేటి వెరవుగలిగి
ర్తించేడిది కావున దేహావసానముదాయ నుద్యోగించెడివారివల్లను విరోధిచే

**End**

ఈశ్వరస్య సౌహార్దం—'ఆచార్యప్రాప్తిహేతవః' అని ఉన్నది గనుక ఈ అర్థం
ఱుంగుటచేతనుండు యావదాత్మభావ నిత్యసంసారమును వర్తింపునని యాసూరి
రియాళ్వార్ తీర్థమాడి ప్రమాణంచేసి తమ శిష్యులకు ఆనతిచ్చిరి

(వి-వి) —

ఆగమప్రగ్రము అవ్యాగతములు లేవు ఉన్న యూకలయిన క్రమముగా లేవు శైథిల్యము అమితము గ్రంథపాతము ఎ త్రవ్వితండములు ఈ పుస్తకము చాల నిరుపయోగమైనది

తెంగల వైష్ణవసంప్రదాయపు విషయము లిందుc బ్రతిపాదితమయియుండును అతి శైథిల్యమువలన గ్రంథార్థములు దుర్జ్ఞేయములుగానున్నవి

---

## No 2108 తెంగల వైష్ణవసంప్రదాయ స్తోత్రములు

## TENGALA VAISNAVASAMPRADĀYA STŌTRAMULU

Substance, paper Size, 11¼ × 8 inches Pages 18 Lines, 20 on a page Character, Telugu Condition, fair Appearance old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 280 *a* The other works herein are —1 *a* Dasāvatāracaritra, 63 *a* Mollarāmāyanamu, 126 *a* Bālabhāgavatamu, 173 *b* Balarāmacaritra, 229 *a* Sāmbavilāsamu, 255 *a* Sārangadharacaritra, 288 *b* Nigamanappadi, 301 *a* Gurunambicaritra, 319 *a* Lingadhārana carca, 325 *a* Sugrīvavijayamu

Complete

This contains a geneology of the exponents of the Śrīvaisnava school of thought and the stotras Yatirājavimsati, etc , written by Varavaramuni (Manavālamāmuni)

**Beginning**

అస్మద్దేశిక మస్మదియపరమాచార్యాన శేషాన్గురూన్
శ్రీమల్లక్ష్మణయోగిపుంగవ మహం పూర్ణం మునిం యామునమ్
రామం పద్మవిలోచనం మునివరం నాథం శరద్వేషిణం
సేవే సంశయ మిందిరా సహచరం నారాయణం సంశ్రయే
శ్రీరామానుజ యోగి సుందరవర శ్రీశైలనాథాన్ గురూన్
లోకాచార్యోత్తర వీథి కృష్ణకలి జిద్వేదాంతిభట్టారకాన్
శ్రీగోవింద యతీంద్ర పూర్ణయమినం వాస్తవ్య ? రామాన్ భజే
పద్మాక్షావ్యయ నాథయోగి శరజిత్సేనేశ పద్మాహరీన్

**End**

సద్గతిం శాస్త్రసంపన్నం వేదవేదాంతపారగమ్
జ్ఞాననిష్ఠ మహం వందే సౌమ్యజామాతరం మునిమ్
లక్ష్మీనాథ సమారంభాం నాథయామునమధ్యమామ్

**Beginning**

యోనిత్యమచ్యుత పదాంబుజ యుగ్మరుక్మ
వ్యామోహత స్తదితరాణి తృణాయ మేనే ।
అస్మద్గురోర్భగవతో స్యదయైకసింధో
రామానుజస్య చరణౌ శరణం ప్రపద్యే ॥

**End**

వందేవాన మహాత్మానం రామానుజమునిప్రియమ్
రామానుజార్య పర్వజ్ఞం వత్సాన్వయ పయోనిధిమ్ ॥
శ్రీరామానుజయోగీంద్ర పదపంకజ షట్పదమ్ ।
రామానుజార్యతనయం వరదార్య మహం భజే ॥

**Beginning**

సౌమ్యజామాతృయోగీంద్ర వరణాంబుజ షట్పదమ్ ।
దేవరాజగురుం వందే దివ్యజ్ఞాన ప్రదం శుభమ్ ॥
అంకేక వెరకన్యాయా స్తుంగే భువనమంగళే ।
రంగే ధామ్ని సుఖాసీనం వందే వరవరంమునిమ్ ॥

**End**

అజ్ఞానస్త మపదాతనుజాతమార్తి
మామీలితాక్ష మనుసంహిత మంత్రరత్నమ్ ।
ఆనమ్రమహాళి భిరుపాసితమంతరంగే
నిత్యం మునిం వరవరం నిభృతో భజామి ॥
తతశ్శుభాశ్రయే తస్మిన్ నిమగ్నం నిభృతంమనః ।
యతీంద్రప్రవణం కర్తుం యతమానం నమామితమ్ ॥

**Beginning .**

యస్స్తుతిం యతిశతిప్రసాదనీం
వ్యాజహార యతి రాజవింశతిమ్ ।
తం ప్రపన్న జనచాతకాంబుదం
నౌమి సౌమ్య వరయోగిపుంగవమ్ ॥

**End**

ఇతియతి కులధుర్యమేధమానైః
శ్రతిమధురైరుదితైః ప్రహర్షయంతమ్ ।
వరవరమునిరే(మే?)వ చింతయన్తీ
నిరతిశయం ప్రసాదమ్ ॥

**Beginning .**

అథ గోష్ఠీగరిష్ఠానా మధిష్ఠాయ సుమేధసామ్ ।
వాక్యాలంకృతి వాక్యానాం వ్యాఖ్యాతారం నమామితమ్ ॥
సాయంతనే తతః కృత్వా సమ్యగారాధనం హరేః ।

స్వైరాలాపైశ్శుభైః శ్రోత్రే నందయంతం నమామి తమ్ ॥
తతః కనకపర్యంకే తరుణద్యుమణిద్యుతౌ
విశాలవిమలశ్లక్ష్ణ తుంగతూలాసనోజ్జ్వలే ॥
సమగ్రసౌరభోద్గార నిరంతర దిగంతరే
సోపధానే సుఖాసీనం సుకుమారే వరాసనే ॥

**End**

ఆర్యాంచో యత్పదాసరసిజద్వంద్వమాశ్రిత్య పూర్వే
మూర్ధ్నా యస్యాన్వయముపగతా దేశికా ముక్తిమాపుః ।
సోయం రామానుజమునిరపి స్వీయముక్తిం కరస్థాం
యత్సంబంధాదతనుత కథం వర్ణ్యతే కూరనాథః ॥

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులు చాలఁగలవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

తెంగల వైష్ణవసంప్రదాయ ప్రవర్తకాచార్య పరంపరయును, వారిలో ముఖ్యులగు వరవరముని (మనవాళమాముని) రచించిన యతిరాజవింశతి మొదలగు స్తోత్రములు నిందు గలవు

---

## No 2109 తెంగల వడగల సంప్రదాయ భేదములు

## TENGALA VADAGALA SAMPRADĀYA BHĒDAMULU

Substance, palm leaf Size, 16½ × 1¼ inches Foll 1 Lines, 4 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 45-*a* The other works herein are —1 *a* Guruparampara (Sanskrit), 4 *a* Pallāndu, 5 *a* Kavisarpagarudamu, 11 *a* Dasavidha vaisnavamu, 16 *a* Jñānāñjanamu, 31 *a* Tirumukappadirahasyam, 33 *a* Arthapañcakajñānam, 40 *a* Sārāsāra Sangrahamu, 46 *a* Emberu mānār Srī Sūktulu, 47 *b* Aṣtāksaracaramaslōkarahaṣyamulu, 51 Tadī yārādhanavaibhavamu, 54 Tatvatrayagnadikamu

Complete

Describes the difference in principles between the Tengala and Vadagala Vaisnavas The name of the author is not known

**Beginning**

శ్రీ అఖిలజగన్మాతరైన విష్ణుపత్నియు నైచేతనేశ్వరా యత్తయయిన
శ్రీస్వరూపముబుద్ధిఁ జింతించి యణువని చెప్పినవిభువని చెప్పిమఱియు
ఘటకత్వమే శాక కమల కుపాయత్వ మున్నదాయన నది యున్నదనియు
ప్రకృతికిఁ గైవల్య పదమావలని చెప్ప నదియును నీయంద యుండెయనియు
కేవలాత్మకు లేదు కేశవప్రాప్తిన గొన్నాళ్లకదియును గూడుననియు

**End**

> వాత్సల్యమనదోష వదోగ్యతాయన నొకదోషమును జూడకుంకుటనియు
> పరదుఃఖమునదుఃఖ పడుటయుదయయన నిదిసహింపనిమాత్రమే యటనియు
> నరసితెన్నాచార్య లానతియ్యగవడ వాచార్యులనువేరె యానతిత్తు
> రుభయపక్షార్థములు నివి యుచితమెఱిఁగి
> నాథముని యాళవందారు నాటనుండి
> గురుపరంపరచేఁ జెల్వొన్న నెల్ల
> మంచివని చెప్పె లక్ష్మణ మానివరుఁడు

(వి-వి)--

సమగ్రము ప్రాఁతచక్కనిది తప్పులున్నవి శైథిల్యము గలవు గ్రంథపాతములు గలవు

తెంగల వడగల సంప్రదాయములవారి మత సిద్ధాంతముల భేదములు సీసపద్యరూపమున వివరింపఁబడినవి దీని కర్తపే రెఱుఁగరాదు

ఇందలి గ్రంథాంతరములు —గురుపరంపరా(సంస్కృతము) 4a పల్లాండు, 5a కవి సర్పగారుడము, 11a దశవిధ వైష్ణవము, 16a జ్ఞానాంజనము, 31a తిరుముకప్పడి. 38a అర్థపంచకజ్ఞానము, 40 సారాసార సంగ్రహము, 46a ఎంబెరుమానారు శ్రీసూక్తులు, 47b అష్టాక్షర చరమశ్లోకరహస్యం, 51 తదీయారాధన వైభవము, 54 తత్త్వత్రయజ్ఞానము

---

## No 2110 దశవిధ వైష్ణవలక్షణములు.

## DAŚAVIDHA VAIŚNAVALAKSANAMULU

Substance, palm leaf Size, 16½ × 1¼ inches Foll 5 Lines, 4 on a page Character, Telugu Condition injured Appearance, old Mode of writing, bad and full of mistakes

Begins on fol 11 *a* The other works herein are —1 *a* Guruparampara, 4 *a* Pallāndu, 5 *a* Kavi Sarpagārudamu, 16 *a* Jnānānjanamu, 31 *a* Tirumuhappadirahasyamu, 33 *a* Arthapancakagnānamu, 40-*a* Sārāsārasangrahamu, 45 Tengalavadagalasampradāyabhēdamu, 46 *a* Emberumanār Śrī Sūktulu, 47 *b* Astāksaracaramaslōkarahasyamu, 51 *b* Tad yārādhanavaibhavamu, 54 Tatvatrayajnānādikamu

Complete

Describes the ten characteristics of a Vaisnava

**Beginning**

> అద్వేషశ్చానుకూలశ్చ దివ్యనామ ధరస్తథా
> చక్రాంకో మంత్రజాపీ చ వైష్ణవశ్చ తతః పరమ్
> శ్రీవైష్ణవ ప్రపన్నశ్చ విశాంతి చ తతః పరమ్
> పరస్త్రీకాంతవిఖ్యాతో దశైతే వైష్ణవాః స్మృతాః

* * * *

**End**

చలింపక నిందాస్తుతులు సమంగాచూచి అనవరతము ఆచార్యుల స్మరణంకలిగి చతుర్విధభాండనియమము గలిగి అవైష్ణవులవల్ల సుఖం అత్యంత పారతంత్ర్యముగలవారు ప్రపన్నులు

(వి-వి)—

సమగ్రము వ్రాఁత రోఁతగానున్నది తప్పులు చాలఁగలవు శైదిల్యము గ్రంథపాతములుగలవు

వైష్ణవుని లక్షణములు పది యిందు వివరింపఁబడినవి అంతమున రెండాకులలో ఆరవపాటలు (వైష్ణవ విషయము) గలవు

---

## No 2111, నవరత్నమాలిక

## NAVARATNAMĀLIKA

Substance, palm leaf Size, 16 × 1¼ inches Pages, 11 Lines, 4 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing fair but not free from mistakes

Complete

Contains nine verses in Sīsa metre written in praise of Goddess Pārvati

**Beginning**

సీ శ్రీసదాశివురాణి పాశహంకుశపాణి - నిరుపమాకారణి నీలవేణి
వారాహిరుద్రాణి పరశాంతరూపిణి - పరమకల్యాణి దుష్పాపహారిణి
మోహనశుకవాణి మునిసన్నుతశ్రేణి - మంజుభాషిణి సర్వమాతృకరణి
కళ్యాణి గీర్వాణి గౌరి దాక్షాయణి - సకలకారణి సర్వశత్రుహరణి
సకలధర్మస్వరూపిణి జలజపాణి - కనక నవరత్నభూషణి వినుతచరణి
నీలవేణి త్రిశూలకపాలపాణి - మహిమశుకవాణి మాకు సామ్రాజ్యమొసగు

**End**

సీ పార్వతి నీపాద భక్తికల్గఁగఁజేయు - వారాహి మాకు నైశ్వర్యమొసఁగు
ధూర్జటిపత్ని నాదుష్కృతంబులు బాపు - శాంభవి మముఁగావు బాలఁబ్రోవు
దాక్షాయణీ నాదు దారిద్ర్యములు మాపు - కౌమారి నన్నునీకరుణఁజూడు
రుద్రాణి మాఘనరోగముల్ మాన్పుము - గిరికన్య మాకును కీర్తియొసఁగు
సకలభారముల్ నీమీదఁబాటినాఁడ - నెట్లురక్షించెదో నన్ను నెలమిఁబ్రోవు
నీలవేణి త్రిశూలకపాలపాణి - మహిమశుకవాణి మాకు సామ్రాజ్యమొసఁగు

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు —

"నందన సంవత్సరం భాద్రపద బ 12 శుక్రవారము"

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులుగలవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

పార్వతీదేవి స్తుతి రూపముగా తొమ్మిది సీసపద్యములు తప్పులు యతులు కర్త పేరు తెలియరాదు

తుద నొక యాకుమీఁద యానాముకాపులు మాదేటి సర్వేశలింగమునకు భూమి నిచ్చినట్లు సీసమాలిక యొకటి కలదు

---

## No 2112 నిగమనప్పడి

### NIGAMANAPPADI

Substance paper Size, 11¾ × 8 inches Pages, 23 Lines, 22 on a page Character Telugu Condition fair Appearance old Mode of writing fair but not free from mistakes

Begins on fol 288 *b* The other works herein are —1 *a* Dasāvatāra caritra, 63 *a* Mollarāmāyanamu, 126 *a* Bālabhāgavatamu 173 *b* Bala rāmacaritra, 229 *a* Sāmbavilāsamu, 255 *a* Sārangadharacaritra, 280 *a* Tengalavaisnava Sampradāya Stōtramulu, 301 *a* Gurunambicaritra, 319 *a* Lingadhāranacarca, 325 *a* Sugrivavijayamu (Yaksagāna)

Incomplete

This is a Telugu rendering of the Tamil work of the same name describing the religious customs of the Tengalai sect of Srī Vaisnavas

**Beginning**

తిరుమంత్రము యెనిమిది తిరువక్షరములై మూడు పదములైయుండును అది యెట్లున్నను ఓం నమః అనిన్నీ, నారాయణాయ అనిన్నీ, మూడు పదములైయుండును ఇది మొదలిపదమై యేకాక్షరమైన ప్రణవము అకారమనిన్నీ ఉకారమనిన్నీ మకార మనిన్నీ మూడు తిరువక్షరములై మూడు పదములైయుండును

**End**

పెరియవాచ్చాంబిళ్లగారు తమయొక్క ఆచార్యులయిన నంబిళ్లగారి తిరువడిఘళ యందు సాష్టాంగ దండం సమర్పించి వ్యాఖ్యానాలన్నిన్ని సన్నిధినుంచి అడియనికి తంజ మైవుండెడిది ఒక అర్థమానతిర్యవలెనని విన్నపంచాయను విని నవధరించి చాలా ప్రీతులై మిగులా ఆదరించి ప్రపన్నోజ్జీవనమైన యొక యర్థము ప్రసాదించేమని తిరు వుళ్లమందు దలచి పరమ ప్రపన్నాధికారులకు వుజ్జీవనమై వుండెడిది ఒక అర్థముంగలదు వినుమని ఆనతిస్తున్నారు ‘ విష్ణుశ్శేషీ ’ అనే శ్లోకముచేతను ఈశ్వరునకున్ను ఆళ్వా రులకున్ను శరీరి శరీర సంబంధముగానున్ను ఆళ్వారుకున్ను యెంబెరుమానారుకున్ను అవయవాయవవి సంబంధము

(వి–వి)—

ఆసమగ్రము వ్రాఁతతిన్ననిదే కాని తప్పులు చాలఁగలవు శైథిల్యము లేదు. గంథపాతములు లేవు

**End.**

ఈ చెప్పిన అర్థాలన్నీని గీతయందు యస్త్వాత్మరతిరేవస్యాత్, అను శ్లోకం చేతనున్ను, నబుద్ధిభేదంజనయేత్, అనిన్ని నైవతస్యకృతేనార్థ అనిన్ని సక్తాః కర్మణ్య విద్వాంస అనిన్ని శ్రీ భాగవతమందు ఏకాదశస్కంధమందు జ్ఞాననిష్ఠోవిరక్తోవా మద్భక్తోవా నలింగానాశ్రమాంస్త్యక్త్వాచరేదవిధిగోచరః అనే శ్లోకంచేతనున్ను భగవానులు ఆనతిచ్చినారు వేదశాస్త్ర పురాణాలయందు స్మృతియందున్ను ఈ అర్థము ప్రసిద్ధము విధి అనగా వృథాలాపంచాతనున్ను వేదమందుల అర్థంచేతనున్ను చెప్పంబడ్డ కర్మము నిషేధమనంగాను

(వి-వి)—

అసమగ్రము వ్రాంతమంచిదిగాదు తప్పులకుప్ప శైథిల్యములేదు గాని ప్రతి విలేఖకుండు మూలమునుజూచి వ్రాయుటలో అందు గ్రంధపాతములుండుటచేతగాంబోలును ఇందుం జాలపట్టుల వ్రాంతలేకున్నది

ఉపనిషత్తులనుండి గీతలనుండి ఇంక ననేక వేదాంత గ్రంధములనుండి సంగృహీతములయిన సూక్తులతో నీ ప్రశస్తవేదాంత గ్రంధము తెలుంగువచనమున రచితమయినది గ్రంధకర్తపేరుగల శ్లోకభాగముపోయినది గుంటుపల్లి మృత్యుంజయ మంత్రి యీగ్రంధకర్తకుం దండ్రి గ్రంథారంభమున శ్రీ శివరామగురు పరబ్రహ్మణేనమః అని కలదు గాన గ్రంధకర్త శివరామగురు శిష్యుండనితోంచును

---

## No 2115 నిగమార్థ తత్త్వము

### NIGAMĀRTHATA TVAMU

Substance, palm leaf Size $16\frac{3}{8} \times 1\frac{1}{2}$ inches Pages, 83 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము వ్రాంతమంచిది తప్పులుగలవు శైథిల్యము చాలాగలదు గ్రంధపాతములు గలవు

పూర్వము వోలె

---

## No 2116 పంచసంస్కార ఫలము.

### PAÑCASAMSKĀRA PHALAMU

Substance, palm leaf Size, $8\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches Pages, 13 Lines, 10 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good and free from mistakes

Begins on fol 27 *a* of the manuscript described under No 2103

Complete

Describes the importance of the five religious practices, viz , tāpa, pundra nāma mantra and Ātmanivēdana observed by Visistād-vaitas

**Beginning**

చక్రాంకితుడైనందుకు ఫలము —

శంఖచక్రతహీనస్తు పంక్తిమధ్యేతుభుంజతే ?
త్యక్త్వాయమపురంఘోరం తద్విష్ఠః పరమంపదమ్

చక్రాంకితులైనవారు ఇతరాంతర నివర్తకులై చక్రధారణములేనిచోట సాపడరాదు ఊర్ధ్వపుండ్రధారణఫలము ఊర్ధ్వపుండ్ర విహీనస్తు చితిమోక్షబ్రాహ్మణాధమః సజీవ న్నేవచండాల స్సర్వకర్మ బహిష్కృతః, ఊర్ధ్వపుండ్రం సదాశుభ్రం లలాటే యస్య దృశ్యతే చండాలోపి విశుద్ధాత్మా మమలోకే మహీయతే

**End**

బహు ప్రమాణసమ్మతులుగలవు గనుక పరుసవేదికి సరియయిన విలక్షణ సంబంధము గల శ్రీ మహాభాగవతుల తుల్యులనిన్నీ తన్నిష్ఠులై ఉండుటే పరమప్రాప్యమనిన్నీ వచన భూషణమందు పిళ్ళైలోకాచార్యులు ఆనతిచ్చుటంజేసి తన్నిష్ఠులైయుండేడి వారు ముక్త సములని అస్మదాచార్యోక్తముగాను ఇట్టి అర్థములు ప్రసాదించిన సదాచార్యులున్న దేశమే నిత్యవిభూతిన్నీ తచ్ఛేషభూతులే నిత్యముక్తులున్నూ శ్రీమహాభాగవతాభిమానమే పరమ ప్రాప్యమున్నూ అతికరణమందు నమ్మి నిశ్చింతులైయుండుట శ్రీమతే రామానుజాయ నమః

(వి-వి)—

సమగ్రము వ్రాంతచక్కనిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇందు తాప, పుండ్ర, నామ, మంత్రాత్మనివేదనములను పంచ సంస్కారముల వలని ఫలము తెలుపబడినది ఇది విశిష్టాద్వైత సంప్రదాయ విషయము

---

## No 2117 పంచాక్షరీమంత్ర మాహాత్మ్యము

## PAÑCĀKSARĪ MANTRA MĀHĀTMYAMU

Substance, palm leaf Size, 16 × 1¼ inches Pages, 7 Lines, 5 on a page Character, Telugu Condition, good Appearance, new Mode of writing, fair but not free from mistakes

Complete

Written in praise of the five lettered mantra addressed to Śiva

**Beginning**

శ్రీ సద్గురు కరుణామృత జలధి ప్ర
భామయ విధుబింబము పంచాక్షరి

అతులితమౌ వేదాంతమను శ్రుతి
నతజన తదుపాసిత పంచాక్షరి
అద్యనీలతో యదమధ్యస్థా
ద్విద్యుల్లేఖా విధ పంచాక్షరి

**End**

యంత్రము పరశివమంత్రము పరమ స్వ
తంత్ర మభిమతవి తతి పంచాక్షరి
మోక్షము నిరవయ లక్షణగురుని క
టాక్షము నక్షరహర పంచాక్షరి
అరయ యజుర్వేదాబ్ధి మధ్యను
స్థిరకల్పకమౌ శివ పంచాక్షరి
అమిత మనంత మగమ్యముశమదను
విమలానంద మయము పంచాక్షరి
కుటిలాటవి దుర్వటి పాపోత్కటు
విటపికురారము పటు పంచాక్షరి
హరియజా మహేంద్రాదుల కర్మము
హరియించును పురహరు పంచాక్షరి
అంబుజ గర్భహృదంబు జవణి నవ
లంబన కృతచిల్లత పంచాక్షరి
మేఘ సామ్యపా పోఘ వర్జితా
మోఘమాయ సన్ముఖ పంచాక్షరి ౨౦

(వి-వి)—
సమగ్రము ? వ్రాంత మంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

'పంచాక్షరి' యను పదము చరణాంతమున వచ్చునట్లు కూర్పబడిన పదరచనమిది యిందు శివపంచాక్షరి మంత్ర మాహాత్మ్యము ప్రస్తుతింపబడినది

---

## No 2118 పంచీకరణము.

### PANCĪKARAṆAMU

Substance, paper Size, 12⅜ × 8 inches Pages 21 Lines, 20 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 279 *b*

The other works herein are —1 *a*, Chandrāngadacaritra, 121-*a* Usāparinayamu, 240 *a* Vēdāntavārtikamu, 290 *a* Prabhudēvaravākyamu, 295 Misrārpanamu, 301 *a* Vēdānta Vārtika Visavasūci

306 *a* Pañcīkaraṇaviṣayasūci, 306 *b* Miśrārpaṇaviṣayasūci, 312 *a* Bhāskara Śatakamu

Complete

Written in the form of a conversation between Vidura and Ātrēya, it explains some of the advaitic doctrines

Date of transcription 15th February 1841

**Beginning**

ఓంకారమనే ప్రణవమందు అకార ఉకార (మకారవులు) మూడు బీజాక్షరా లు వివరం అకారమనేదే నాదం, ఉకారమనేదే బిందువు మకారమే కళా వతిన్ని, అకారమే రుద్రుండు, ఉకారమే ఈశ్వరుండు, మకారమే సదాశివుండు, ఇట్లు అకార ఉకార మకారాదులకు నాదబిందు కళా ఆధారం, అనాదబిందు కళలకు ప్రకృతి ఆధారం, ఆ ప్రకృతికి ప్రాణమే ఆధారం, ఆ ప్రాణానకు లింగమే ఆధారం అది యెట్లంటేను

**End**

ఇఖను మానసమంటేను మనస్సున తలచుట, వాచికమంటేను తాపలుకుట, కాయి కమంటేను తా ముట్టిచేసుట, ఇవి త్రికరణాలు, ఇఖను మానసమంటేను పరదాగ్ని కా మాగ్ని శోకాగ్ని ఒడబాగ్ని జఠరాగ్ని ఇవి పంచాగ్నులు ఇది మైత్రేయ మహా మునీ శ్వరుండు విదురుండు బ్రహ్మాండ పిండాడం ఉపదేశంచేసిన పంచీకరణం సంపూర్ణం (పి-వి)—

సమగ్రము వ్రాంత మంచిది తప్పులుగలవు శైథిల్యము లేదు గ్రంథపాత ములు లేవు ఈ ప్రతి విలేఖనము 1841 వ సం॥ ఫిబ్రవరి నెల 15 వ తేది ప్రాం తము ముగిసినట్లున్నది

వ్యావహారి కాంధ్ర వచనరచలో అద్వైత వేదాంతులు తెలుపు పంచీకరణ విషయ మిందుc జెప్పcబడినది ఇది విదురాత్రేయ సంవాదరూపముగాc గలదు

ఇందలి గ్రంథాంతరములు —

1*a* చంద్రాంగద చరిత్ర, 121*a* ఉషా పరిణయము, 240*a* వేదాంత వార్తిక ము, 290*a* ప్రభుదేవర వాక్యము, 295*a* మిశ్రార్పణము, 301*a* వేదాంత వార్తిక విషయసూచి, 306*a* పంచీకరణ విషయసూచి, 306*b* మిశ్రార్పణ విషయసూచి, 312*a* భాస్కర శతకము

---

## No 2119. పంచీకరణము.

### PANCĪKARAṆAMU

Substance, palm leaf Size, 16¼ × 1½ inches Pages, 23 Lines, 8 and 9 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

**Same work as the above**

(వి-వి)—

సమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైదిల్యము లేదు గ్రంథపాతము లులేవు

పూర్వమువోలె

గ్రంథాంతమున 7 వ పుటలలో పై గ్రంథమునకే మాతృక శిథిలమై కొంత గ్రంథ లోపముతోఁగలదు

---

## No 2120 పది వార్తలు.

## PADIVĀRTALU

Substance, palm leaf Size, 8½ × 1⅜ inches Pages, 3 Lines, 10 on a page Character Telugu Condition fair Appearance, old Mode of writing good and almost free from mistakes

Begins on fol 20 *a* of the manuscript described under No 2103

Complete

It is stated that during his last days Sri Ramārujācārya wrote out the main principles of Visistādvaita school in ten topics This is a Telugu translation of the original work in Tamil

**Beginning**

ఉడయవరు పిళ్లయురంగావిల్లి దాసులకు విషయముగాను ముదలియాండానుకు ఆనతిచ్చిన పది వార్తలు ఉళ్లంపిరంజి ముదువు హప్పందు ఉడయవరు శ్రీ పాదములకు అర్ఘ్య ప్రదాన పూర్వకముగా దండము సమర్పించి అంజలి హస్తుఁడైనిలిచి మనకున్ను మన ముదలిహాళకున్ను ఆధిక్యమును ఆనతియ్యవలెనని విన్నపముచేస్తేను మేము చెప్పఁగల అర్థమును మీరే అడిగితిరని ప్రీతుడై సకల వేదసారమందున్ను సకలశాస్త్రములందున్ను సకల ప్రమాణములయందున్ను ఆళువారానతిచ్చిన దివ్య ప్రబంధములయందున్ను మన పూర్వాచార్యుల యనుష్ఠానములయందున్ను సూక్ష్మముగాను సులలితముగాను ఇవి చెప్పెదము

**End**

ఈ పది వార్తలున్ను మనకున్ను మన పూర్వాచార్యులకున్ను నిత్యాను సంధానముగా నానతిచ్చి మనము యింతకాలమున్ను చేసిన అపచారములు వీలాగున పాయునంటేను మన మనోవాక్కాయ కర్మములెల్లాను ఇందుల పరిహృతములై పోవునని శ్రీ రామానుజాచార్యులు ఆనతిచ్చిరి.

(వి-వి)—

సమగ్రము వ్రాంత చక్కనిది తప్పులులేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

విశిష్టాద్వైతమత సిద్ధాంతములను శ్రీ రామానుజాచార్యులవారు తమ యుపాసాన కాలమున వది వార్తలు అనుపేర గ్రంధముగా వెలయించిరట ! ప్రవిద్ధములగు యా గ్రంధమునకిది తెలుగుసేత

---

## No. 2121 పరతత్త్వ రసాయనము

### PARATATVA RASĀYANAMU

Substance palm leaf Size, 16⅛ × 1⅜ inches Pages, 32 Lines 6 on a page Character Telugu Condition injured Appearance old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 20 *a*

The other works herein are —1 *a* Sivajñānamanjari, 46 *a* Vēdānta sārasangrahamu, 65 *a* Ajnānadhvāntacandabhāskaramu, 89 *a* Upadēsakramamu, 130 *a* Astāvakragitāsāstramu

Complete

Same work as that described under R No 111

(వి-వి )—

అసమగ్రము అయిదవ యాశ్వాసము మాత్రముగలదు వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్యము గలదు గ్రంధపాతములు లేవు

ఇది ఆర్ నె 111 రున వర్ణితము

ఇందలి గ్రంథాంతరములు—1*a* శివజ్ఞాన మంజరి, 46*a* వేదాంతసార సంగ్రహము, 65*a* అజ్ఞాన ధ్వాంత చండభాస్కరము, 89*a* ఉపదేశ క్రమము, 130*a* అష్టావక్ర గీతా శాస్త్రము

---

## No. 2122. పరబ్రహ్మ సకల విలక్షణత్వ నిర్ణయము

### PARABRAHMA SAKALA VILAKSANATVA NIRNAYAMU

Substance, palm leaf Size, 16½ × 1⅜ inches Pages 22 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 67 *a* The other works herein are —1 *a* Ātmadar-*S*anamu, 10 *a* Jivēśvaranirnayamu, 14 *b* and 28 *a* Kīrtanalu, 21 *a* Misrārpanamu, 49 *a* Jīvēsvarasamvādamu, 55 *a* Dandakamu, 59 *a* Dvādasamanjarikā Stōtramu

Complete

A treatise on Visistādvaita Vēdānta The name of the author is not known

**Beginning .**

శ్రీమన్నారాయణుండు నారాయణ పరబ్రహ్మతత్త్వం, నారాయణః, పరః అనియిట్టి శ్రుతి ప్రకారానను, సూర్యకోటి ప్రతీకాశం చంద్రకోటి సుశీతలం అనిన్ని తద్విష్ణోః పరమంపదం అనిన్ని యీ శ్రుతి ప్రకారానన్ను అనేకకోటి సూర్యచంద్ర ప్రకాశ

మయిన పరమపదమందు దివ్యావరణ శతసహస్రసమ్వృతి అనేటి శ్రుతివాక్యం ఉన్నట్టిఅనేక సహస్రాలు నవరత్నాలు స్థాపితమయిన కోటలున్ను, అనేక వేలు అమృతపు నదులున్ను కొలనులున్ను గలిగి దివ్య పురుషులు దివ్య స్త్రీలున్ను గలిగి మణిమయ స్తంభశోభితమయిన తిరువాయిముడి మంటపమనే కొలువుకూటమునందు నవరత్న సింహాసనముమీద సహస్ర దళ పద్మంగలది

* * * *

**End**

యత్ర పూర్వే సాధ్యాస్సంతి దేవాః అన్నటువంటి తిరువాయిముడి మంటప సమీపానకుపోయి పద్మరాగపు సోపానాలు యెక్కించుకొని సన్నిధి నిల్పితేను శ్రీమన్నారాయణాయ నమః అని సాష్టాంగములు చేయుస్తేను పరమపదరాజు ఆత్మావై పుత్రనామాసి అనే పితాపుత్ర న్యాయానను తమ చతుర్భుజాలా వానిని తమచాత తమ తొడలుమీదికి రాతిగిచి కౌగలించుకొని అనేక విధాల లాలించి శ్రీ మహాలక్ష్మీ శ్రీ హస్తాలకు యిస్తేను ఆ యమ్మగారు యెత్తుకొని ముద్దాడి స్తన్యపానం యిచ్చితేను ఉజ్జీవించి స్థిరమయిన సంతోషాన సామగానం చేస్తున్న ఆనందభరితుడయి అనంత కాలాలు సుఖాననుండును

(వి-వి)—

సమగ్రము వ్రాంత తిన్నగి దే తప్పులున్నవి శైథిల్య గ్రంధపాతములు లేవు విశిష్టాద్వైత వేదాంత విషయమిందు ప్రతిపాదితము కర్తపేరెఱుగరాదు ఇందలి గ్రంధాంతరములకు డి. నె 2059 రు చూచునది

---

## No 2123 పరమభాగవత విలాసము.

## PARAMABHĀGAVATA VILĀSAMU

Substance, paper Size 10 × 7½ inches Pages, 21 Lines, 28 on a page Character Telugu Condition, much injured Appearance, old Mode of writing not good and contains mistakes

Begins on fol 30 *a* The other works herein are —1-*a* Bhānukalyānamu, 19 *a* Sundarimaṇisatakamu, 43 *a* Airāvatacaritramu

Incomplete

Same work as that described under R No 220

(వి-వి)—

అసమగ్రము ప్రథమాశ్వాసము మాత్రముకలదు వ్రాంత మంచిదిగాదు తప్పులు చాలగలవు శైథిల్యముగలదు గ్రంథపాతములు గలవు

ఇది ఆర్ నె 220 రున వర్ణితము. గ్రంథకర్త ముడుంబి సింగరాచార్యుడు గ్రంథావతరణిక లేదు

ఇందలి గ్రంథాంతరము లివి —

1*a* భాను కళ్యాణము, 19*a* సుందరీమణి శతకము, 43*a* ఐరావత చరిత్రము

## No 2124 పరమయోగి విలాసము

## PARAMAYŌGI VILĀSAMU

Substance, paper Size, 12¼ × 8 inches Page 196 Lines 20 on a page Character, Telugu Condition fair Appearance, old Mode of writing, good and almost free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —109 *a* Samira-kumāravijayamu, 276 *a* and 292 *a* Vēmanapadyamulu

Incomplete

The biographies and cults of twelve Vaisnva preceptors are depicted The author is Timmabhūpāla, son of Kōnamāmba and Aubhalarāja, and the brother of Srirangarāja He was in charge of Kondavidu one of the strong holds of the Vijayanagar Kings He dedicated the work to God Nrsimha worshipped at Mangalagiri

**Beginning**

శా. శ్రీరంజిల్లఁగఁ బానకంబు పశమున్ సేవింపఁగాఁ దద్గుణం
బారూఢిం బొలుపొందెనో యనఁగ యోగానంద మాధుర్య ల
క్ష్మీరమ్య కృశినొప్పు మంగళగిరి శ్రీమాన్నృసింహుండు స
త్కారుణ్యామృత వృష్టిచేఁ దనుపు నిత్యంబున్ ప్రపన్నావళిన్

* * * *

వ. అని యిష్టదేవతా ప్రార్థనంబుగావించి తదనుగ్రహ సమాసాదిత విద్యావైశద్య విభ్రాజమాన మానసుండై

సీ. ఏరాజు ముత్తాతభూరి సామ్రాజ్య ల
క్ష్మీధురీణ భుజుండు సిద్ధనృపతి
యెనరాధిపు తాత నానార్థ సంతాన
సంతాన శాఖి యనంతశౌరి
యే గుణాఢ్యుని తండ్రి భోగవైభవ నూత్న
సుత్రాముతో బళఘోణి భర్త
యే విభుండౌ రామభూవిభు తిరుమల
ప్రభు వెంకటేంద్రుల భాగినేయుఁ
డట్టి తిమ్మభూవరుఁడాజిహత తురుష్క
రక్తశోణ నదీకృత ప్రబలసలిల
వితత కృష్ణా నదికుఁ డూర్జితుఁడు కోన
మాంబసుతుఁడు శ్రీరంగరాజానుజుండు

వ. సకలశ్రీయుత కొండవీటి నగరీ సామ్రాజ్య ధౌరేయతా
ధికతన్ మీఱుచు నొక్కనాఁడచలభక్తి స్ఫూర్తి శ్రీ వైష్ణవ

ప్రకరంబుల్ భజియింపుచుల్ హరికథా ప్రస్తావనల్ దివ్యయో
గికథల్ వించుఁ దదర్థకావ్య రచనాకేళీ సమాసక్తుఁడై

* * * *

ఉ ఉన్నతి మీఱఁగాఁ బరమయోగి విలాసము పేరి కావ్యము
ద్యన్నవ భావబంధుర రసాన్వయ సన్నుత శబ్దశుద్ధి సం
పన్నత నిల్పు సిద్ధనరపాలుని యాబళు తిమ్మభూవరుం
డెన్నికఁ జేయఁబూని మదినెంతయు సంతసమొందు ధన్యతన్

వ ఇవ్విధంబునఁ గృత ప్రారంభుండై

క అంచితమునిహృజ్జలజద
ళాంచల పీడనపద ప్రమార్జన లీలా
చుంచు సరోరుహ రేఖా
చంచచ్చరణునకు నార్తజన శరణునకున్

* * * *

క ఉల్లలిత కృష్ణవేణీ
కల్లోలక బృందబంధు గంధవహాళీ
హల్లీసక మహిమసము
ద్యల్లాలక వైజయంతికా మోదునకున్

* * *

వ సమర్పణంబు సేసిన యిమ్మహా ప్రబంధంబునకుం గథా ప్రారంభం బెట్టిదనిన

సీ శఠకోప సంయమీశ్వరుఁడీ ప్రబంధంబు
గావించి కడుఁబెద్ద కాలమగుట
నిది సమస్తంబును జదివిన యంతన
ప్రజలు సద్యోముక్తి పదముగనుటఁ
జేసిఖిలంబయ్యె క్షితిలోనఁ గడమకా
వ్యంబు నాథుడు నాథ యతివరుండు
కురుక కురుకేశు నగరిలో
పల వినిర్నిద్రత నలరు

**Colophon**

ఇది శ్రీమంగళగిరి నృసింహ సంతతానుగ్రహ మహనీయ వైభవసిద్ధిరాజవంశావ తంస శ్రీమదాబళ రాజనందన తిమ్మభూవర ప్రణీతంబైన పరమయోగి విలాసంబను మహాప్రబంధంబునందుఁ జతుర్థాశ్వాసము

(వి-వి)—

అసమగ్రము పంచమాశ్వాసమునఁ గొంతవట్టు కొఱంత వ్రాఁత చక్కనిది తప్పు లంతగా లేవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

శ్రీవైష్ణవ మతాచార్యులౌ కన్నిద్దరాచార్యులై చక్రమింప వస్త్రము తాళ్లపాక తిరువేంగళనాథునిపరమయోగి విలాస మనంటివిదిగో పి గ్రంధకర్త తిమ్మరాజు ము కోనచూంబకు నాబళరాజుకు గొమకు శ్రీరంగరాజుకు దమ్ముడను అనంత శారికి మనుమడు ఒద్ద నృపాలునకు మనిమనుమడు, అళియ రామరాజుకు, తిరుమల రాజుకు వెంకటరాజుకు మేనల్లుడు ఈతడు విజయనగర రాజ్యమున ప్రధాన దర్గమగు కొండవీటి దుర్గాధిపతియై వెలసెన్నవాడు ఈ గ్రంథము నాతడు మంగళగిరి నృసింహస్వామికి సమర్పించెను

ఇందీ యితర గ్రంథములున్నవి —109*a* సమీరకుమారవిజయము, 176, 292*a* వేమనపద్యములు

---

## No 2125 పరమానందబోధ ప్రకరణము

## PARAMĀNANDABŌDHA PRAKARANAMU

Substance, palm leaf Size, $16\frac{1}{4} \times 1\frac{1}{2}$ inches Pages 10 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 25 *a* The other works herein are —1 *a* Uttaragītā tika, 30 *a* Mahāvākyaprakaranamu

Incomplete

A treatise on Advaita Vēdanta, written by Dāsagōsāyi, a disciple of Dattātrēya It appears, the author first wrote it in Marathi language

**Beginning**

దత్తాత్రేయునకు దాసోగోసాయి ప్రదక్షిణ నమస్కారంచేసి అంజలిచేసి స్వామీ మావంటి అజ్ఞానులకు పరిపూర్ణ బ్రహ్మానుభవము బ్రహ్మసాక్షాత్కారము స్వరూప స్థితి ఆత్మైక్యంసమాధి పూర్ణత్వం చెప్పవలెనంటివా ఆ చెప్పిన వాక్యాలు తమ శిష్యులకు పరమార్థ ప్రాప్తి నిమిత్తము ఉపదేశ వాక్యాలు వేదాంత సిద్ధాంత వాక్యాలు అవి యేవి అంటే చెప్పేను దాసో గోసాయి మహారాష్ట్ర వాక్యాలు తెలియవని ఆంధ్ర భాషను చెప్పిన వాక్యాలు గోపాళ భట్లు సర్వదేవునికి వుపదేశించిన వాక్యాలు తమ ప్రియ శిష్యులకు అతిరహస్యంగా చెప్పేము అవి యేవి అంటేను చెప్పేము అఖండ సచ్చిదానంద స్వరూపముయిన ఆత్మ యెటువంటిది అంటే,—

**End**

ఆత్మ పూర్ణసమాధి నిష్ఠుడైన వానికి సజాతీయ విజాతీయ భేదంలేదు. వర్ణాశ్రమాచార ధర్మాలు చేయుబని లేదు సర్వ ధర్మాలు విడిచి బ్రహ్మమై దేశకాల వస్తువులు లేక అపరిచ్ఛిన్నుడై జ్ఞానపూర్ణుడై పరబ్రహ్మమువలెనే వుండి వాఙ్మనోతీతమై నామరూపరహితమై అఖండ పరిపూర్ణస్వరూపమై వుండును ఇది సకల వేదాంత సిద్ధాంతం, యోగసాంఖ్య సిద్ధాంతం బృహదారణ్య సకలో

పనిషత్సారం పత జలి సకల జ్ఞాన శాస్త్ర ఉత్తర గీతలు మొదలుగాగల సకల శాస్త్ర సిద్ధాంతం ఇది తమకు అత్యంతమైన ప్రియ శిష్యులకు అధి గత పరమార్థులయిన భక్తి నిష్ఠులయిన పరమపుణ్యాత్ములకు చెప్పేది భక్తిహీనులై పరశిష్యులై స్త్రీ అర్థాదుల యందు ప్రేమగల్గినవారలై కామక్రోధలోభమోహమదమత్సరులై గురుభక్తిహీనులై మంత్ర దేవతలయందు నిష్ఠలేక ఎశ్వాసహీనులై కేవల మూర్ఖులై యున్నవారికి చెప్పవద్దు, చెప్పినట్లాయనా గురుదేవతా ద్రోహము చేసినవాడు

**Colophon**

ఇతి దాసగోసాయీ విరచితాయాం పరమానందబోధ ప్రకరణం నామ ప్రథమ ప్రకరణం

(వి వి)—

అసమగ్రము ఇది యొక గ్రంథమున ప్రథమ ప్రకరణ భాగంమాత్రము వ్రాతమంచిది తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

అద్వైత వేదాంత ప్రతి పాదకమగు నీ గ్రంథము దత్తాత్రేయ శిష్యుడయిన దాసగోసాయి రచియించినది ఆయన తొలుత నీగ్రంథమును మహారాష్ట్ర భాషలో రచించినట్లున్నది దానిని గోపాలభట్టునతడు సర్వదేవుడనునతని కుపదేశించి నట్లుగాం దెలుగువాడుక భాషలో పరివర్తనమిది కలదు

---

## No 2126 పరవాది గజాంకుశము

## PARAVĀDI GAJĀNKUŚAMU

Substance, palm leaf Size, 16⅞ × 1¼ inches Pages, 28 Lines, 5 and 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Same work as that described under No **1610**

(వి-వి)—

సమగ్రము 156 పద్యములున్నవి వ్రాతతిన్ననిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ఇది నె 1610 రున వర్ణితము

గ్రంథాంత మందీ వ్రాతగలదు

“ క్రోధినామ సంవత్సర భాద్రపద శు 15 సో॥ భండారు కామయ దేవాని బస్వప్ప మాత్యకలోనున్న క్రమానను, పరవాది గజాంకుశము సంపూర్ణంగా వ్రాశెను ”

## No 2127 పిండోత్పత్తి ప్రకరణము

## PINDŌTPATTI PRAKARANAMU

Substance palm leaf Size, 15 × 1¼ inches Pages, 17 Lines, 5 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Describes in colloquial Telugu, the origin of physical body, as explained by Śiva to Pārvati

**Beginning**

మఱియుఁ ర్వంబునఁ బరమేశ్వరుండు పార్వతి దేవితో చెప్పిన పిండోత్పత్తి ప్రకరణం

పృథివ్యాపస్తేజోవాయురాకాశంబు లయిదున్ను, శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వాఘ్రాణంబు లయిదున్ను, శబ్ద స్పర్శరూపరసగంధ బు లయిదున్ను వాక్పాణిపాదపాయుగుదంబు లయిదున్ను మనోబుద్ధిచిత్తాహంకారవ్యసనంబు అని యెదునంతఃకరణ చతుష్టయంబును, అటుగాన యిరవైనాలుగు తత్త్వంబులనంబడియెను ఇరవై అయిదో తత్త్వం జీవుడనంబడెను

**End**

మఱియు రాజసతామససాత్త్వికగుణంబులు గలిగిన శరీరంబునకు డెబ్బది రెండు వేలనాళ్లున్ను ఇన్నూట తొంబదిది కీళ్లున్ను నూట తొమ్మిది సంధులున్ను నూట యిరవై తొమ్మిది సందులున్నూ నూట యిరువై తొనిమిది శల్యంబులున్నూ ద్వావింశతి వింశతి నఖంబులున్నూ మూడుకోట్లు ఊర్ధ్వరోమకూపంబులున్ను మూడుకోట్లు డెబ్బది రెండువేలు అధోరోమరంధ్రంబులున్ను ముక్క ర్యేడు శైత్యము, మూడు మానికల శ్లేష్మము సోలెడు శుక్లము, కామాగ్ని, శీతాగ్ని, కోపాగ్ని, ఉదరాగ్ని, దావాగ్ని అనియేటి పంచాగ్ని మధ్యంబున జీవుండు నిలిచియుండును ఈ వ్యాఖ్యానంబు పరమేశ్వరుండు పార్వతిదేవికి బోధించిన పిండోత్పత్తి ప్రకరణం

గ్రంథాంతమందీ వ్రాతగలదు.—

“ధాతనామ సంవత్సర జ్యేష్ఠ బ 2 జయవారం వ్రాశ్శి తారీఖు”

(వి–వి)—

సమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్య మించుక గలదు గ్రంథ పాతము లల్పముగాఁగలవు

స్థూల శరీరోత్పత్తి తత్త్వశాస్త్ర రీతినిందు వివరింపఁబడినది పార్వతికిఁ బర మేశ్వరుఁడు బోధించినట్లుగా వాడుక తెలుఁగులో నీ రచనము గలదు

## No 2128 ప్రపన్న పరిత్రాణము

## PRAPANNA PARITRĀṆAMU

Substance palm leaf Size, 13¼ 1¼ inches Pages, 11 Lines, 6 on a page Character Telugu Condition, fair Appearance, old Mode of writing, fair almost free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —7 *a* Arthapancakamu, 15 *a* Tatvatrayamu, 29 *a* Rahasyatrayamu, 42 *a* Caramarahasyatrayam

Complete

Describes how God Nārāyana protects those who seek for his protection with a pure mind It appears to be a Telugu version of a Tamil work

**Beginning**

శ్రీ భగవద్గీతలయందు "జన్మనాజాయతే
శూద్రః కర్మణాజాయతేద్విజః। వేదాధ్యాయేన
విప్రత్వం బ్రహ్మజ్ఞానేన బ్రాహ్మణః"

అన్నట్లు పరతంత్ర జ్ఞానాధికులై పరమపావనులైన వారికి అనన్యార్హత్వమున్ను అకించనత్వమున్ను కలయును ఇందుకు అనన్యార్హత్వమయ్యేడిది శ్రీమన్నారాయణుడొక్కడే కాని మరితక్కిన వేమిన్ని రక్షకులుగారనేది తమకు తామున్ను, పుత్రాదులున్ను, భర్తలున్ను, తల్లిదండ్రాదులున్ను, రాజలున్ను, చంద్రసూర్యాదులున్ను, దేవేంద్రుడున్ను, బ్రహ్మదేవుడున్ను, రుద్రుడున్ను వీరు మొదలయినవారు రక్షకులు గారని యథావత్తుగా తెలిసి ధీమతాత్ముండైవుండుట అనన్యగతిత్వము అందుకు వివరణము

**End**

బ్రహ్మను నాభికమలమందు సృష్టించిన్ని పోనాడుకొన్న వేదములు తెచ్చియిచ్చిన్ని ప్రణవాదిమంత్ర వేదోక్త విద్యాదులు సాధనములుగాను పరమహంస(?)హయగ్రీవ దములు ఉపదేశించిన్ని బ్రహ్మను యీలాగున రక్షించెను గనుక ఇతడే రక్షకుడు బ్రహ్మరుద్రాది దేవతలకున్ను ఆపదలు వచ్చినట్లు శ్రీమన్నారాయణునికో ఆపదలు వచ్చిన రావులున్ను ఇతర దేవతలు మాన్పిన రావులున్ను లేవు గనక శాస్త్రహృదయము తెలియంగక సామాన్యులుకొందరు రామకృష్ణాద్యవతారములుగొన్న జననమరణాద్యవస్థలు కల్పింతురు అది వేదపురాణాదులయందున్ను విచారించేటప్పటికి శాస్త్రస్వరూపము లేదు కలిగినవి లేకుండుట యెట్లంటేను తద్విరోధులని గ్రహింపవలసిన్ని బ్రహ్మరుద్రాదుల రక్షింపవలసిన్ని అవతరించె గనక వేరొక్కటిగాదు సత్యం సత్యం పునస్సత్యం ముద్ధృత్యభుజముచ్యతే। వేదశాస్త్రాత్పరం నాస్తిన దైవం కేశవాత్పరమ్,

(వి- ) —

సమగ్రము వ్రాంతమంచిది తప్పులంతగాలేవు శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

శ్రీమన్నారాయణుని ప్రపన్న పరిత్రాతృత్వమును నిరూపింపబడిన. శ్రీవైష్ణవుల యరవ గ్రంథమునకిది తెలుగుగాంబోయును

---

## No 2129 ప్రభుదేవర వాక్యము

## PRABHUDĒVARA VĀKYAMU

Substance, paper Size, 12⅜ × 8 inches Pages, 10 Lines, 20 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 290 *a* The other works herein are —1 *a* Candrāngadacaritramu, 121 *a* Usāpariṇayamu, 240 *a* Vedāntavārtikamu, 279 *b* Pancikaranamu, 295 *a* Misrārpanamu, 301 *a* Vēdāntavārtikavisayasūci, 306 *a* Pancikaranavisayasūci, 306-*b* Prabhudēvaravākyavīsayasūci 312 *a* Bhāskara Satakamu

Complete

This is stated to be the Commentary on the teachings of Allamaprabhu also known as Prabhudēvara, and Siddharāmayya, to his disciples It describes the creation of the physical body The work is also called Pindacakranirnaya

**Beginning**

ప్రభుదేవర వాక్యం గురుకరుణాసమ్యజ్ జ్ఞానంవల్లను అఖండలింగ ప్రసాదం ప్రత్యేకం సేయించుకొని ఆ సమ్యజ్ జ్ఞానంవల్ల లింగాన్ని యెరిగి శివమంత్ర యుక్తమై ధ్యానిచరే ధ్యానయోగమని షట్స్థలలింగాన యోగాగ్నుండై అనుభవిస్తుండేదే దారుణం యోగమనిన్నీ ఆట్టిలింగాంగంవల్ల ఆ లింగాన్ని యెఱిగిన యెఱుక అణంగి నిలిచిన దేవ సమాధి యోగమని ప్రభుదేవర ఉపదేశంశాయను సిద్ధరామయ్య దేవకరుణించి యెత్తుకొని షట్స్థల బ్రహ్మోపదేశాన్ని అతిరహస్యంగా ఇరువైయేడు పదాలుగా ఉపదేశించినారని ఈ మంత్రగోప్యం అంత పర్యంతం గోప్యంగా ఉన్నది మంత్ర గోప్యమయివుండిన్నీ మంత్రానకు అర్థమును శివశరణులకందరికిన్నీ జ్ఞాన గోప్యమైవుండరాదని నాటి చిత్ప్రభువనే తామే ప్రకాశం చేసినారు

**End**

ముఖ్యశాయువు చేతుల యెముకలు రెండు కదురు యెముకలు రెండు కూడిన ఉక్కునసుండి దేహ తత్త్వాల నెల్లా వకకడకు తెచ్చును అంతర్యామి వాయువులు ఆత్మపురుషునికి వాహనమైవుండి ప్రాణాలు తెప్పించును ప్రపంచ వాయువు దేహాన కడగా వుండును వజ్రడ దేహాన్ని అంచుగా వుండును అంచుచీలలు చెడితే దేహం చెడును ఇది పిండచక్ర నిర్ణయం.

(వ చ)—

ఈ ప్రతి ప్రాచీనమైనది తప్పు లున్నవి వైద్యము లేదు గ్రంథ పాతము లేదు

అల్లమప్రభు నిరాహంకారముగల ప్రభుదేవర యు, సిద్ధరామయ్యయు శిష్యులకు జేసిన తత్త్వోపదేశమున కిది యాంధ్ర వ్యాఖ్యానము రేవణ సిద్ధాదులు దీని తెలుగున వ్యాఖ్యానించిరనియు నిందుc గలదు ఇందు స్థూలశరీర నిర్మాణ రీతి వివరింపc బడినది పంచప్రకరణనిర్ణయమనియు దీనికి పేరు

ఇందలి గ్రంథాంతరములకు నెం 1638 రు చూచునది

---

## No 2130 ప్రభులింగ లీల

## PRABHULINGA LĪLA

Substance paper Size, 12⅜ × 7⅞ inches Pages, 506 Lines, 19 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, very good but not free from mistakes

Complete

Gives an account of a devotee of Śiva known as Allamaprabhu, Prabhudevara and Prabhulinga This work by Koccarlakōṭa Rāmakavi is an adaptation of the dvipada work by Somakavi of Piduparti, who wrote his work on the lines of the Kannada work of the same name by Cāmarasa The author, Koccarlakōta Rāmakavi, was a native of Pālakolanu, in Godavari district and the work has been dedicated to Rāmēsvaraswāmi of that place

**Beginning**

శ్రీవాణీవర ముఖ్యదేవవినతం వేదాంత విద్యాశుభం
గౌరీమానస పద్మమిత్రమ మలం ఖండేందు మౌళిం శివమ్
క్షీరారామ పురాధిపం సువరదం రామేశ్వరం భాస్వరం
నిత్యానందమయం భజే సుకవితా సిద్ధ్యై పరం శ్రేయసే

* * * *

సీ సకల మహాకావ్య సంగత మర్మముల్
తెలిసి యలంకారకలనc జేసి
వైయాకరణ లీల వర్తిల్లి బహువిధ
తర్కకర్కశయుక్తిc దనరి నిగమ
సిద్ధాంతవైఖరిc జెన్నొంది యాగమ
మంత్రరహస్య సమ్మతము పూని
తనుసంగతాంబుజ దళవర్ణదైవస
స్థితి రెంటిcగి వినమ్రశిష్యజనుల

కరుణ మీఱంగ నెపుడు రక్షణము సేయు
నట్టి మహనీయగుణుని దివ్యాసుధావృఁ
గలిత శ్రీ విష్ణువజ్జలకుల సుధాబ్ధి
చంద్రు రముకతివర దేశికేంద్రు దలఁతు

సీ. శ్రీమంతమగు శృఁగిరిటి గోత్రజాతుఁడు
జంగమలింగ ప్రసాద జీవి
హరకుల జాతుండు గురులింగ పుత్రుండు
సవ్యసీమాలంఘన వ్రతుండు
బసవపురాణాది భవ్యకావ్యంబులు
శివునికిఁ బ్రీతిగాఁ జెప్పినాఁడు
వేదదుగ్ధాంబుధి విదిత ధీమంథాన
భవభక్తిసుధ వేడ్కఁ బడసినాఁడు
సిద్ధవీర శివాచార శీలమూర్తి
చంద్రశేఖరు భక్తి భూస్థలమునఁదు
నిలిపినాఁడని జనులు వర్ణింప నొప్పు
పాల్కురికి సోమనారాధ్యుఁ బ్రస్తుతింతు

* * * *

సంగన బసవన్నఁదలఁతు సద్భక్తి మెయిన్

గీ. మహిమచే వీరశైవాగమ ప్రకార
సారమగు షట్స్థల జ్ఞాన సరణిభక్త
వరుల కెలమిని దెల్పుచు వఱలుచున్న
బసవశివమూర్తి కెప్పుడుఁ బ్రణుతి సేతు

గీ. అంతరంగమున సహార్య ధన్విని నిల్పి
లలితవృత్తి సొన్నలాపురమున
నీడులేని మహిమ నెనసిన సిద్ధరా
మయ్యఁదలఁతు నెపుడు మదిఁ జెలఁగి

* * * *

పరులఁ గెల్చి మదినిహరుఁ గనుఁగొనునట్టి
యక్కమాంబఁదలఁతు నహరహంబు

గీ. బిజ్జలాధిపతికిఁ బెంపారు శివభక్తి
బలముఁ దెలియఁబఱిచి ప్రాభవమున
మహిఁ జెలంగునట్టి మడివాలు మాచయ్య
భక్తియుక్తిఁ దలఁతుఁ బ్రత్యహంబు

తే అట్టి యంకన్నమంత్రికి నమరుపత్ని

* * *

వితరణ గుణావలంబ శ్రీవీరమాంబ

(వారికిద్దఱు కొడుకులు)

క అందగ్రజుండు లోకపు

లందరుఁ డెందైర్యవిజితరత్న ప్రస్థుం

డింద్ధరపాద జలజమ

రందాసక్తాళి రామరాజు వలంపన్

వ తదనంతరంబ

సీ

అతఁడు మిహికాపటీరోదయాస్తశైల

మధ్యదేశప్రదేశితమానితాబ్జ

చంద్రచందనసంతాన సాంద్రకీర్తి

ఘనుఁడు కొచ్చెర్లకోట లింగన్నమంత్రి

క తురగా భాస్కరగర్భ

స్థిరజలనిధి జనితమైన శ్రీరమణియనన్

బరగిన నర్సును వేడన

పరిణతుఁడై లింగమంత్రి భాసిల్లెధరన్

వ ఆ దంపతులకుం బుత్రికాపంచకంబును బుత్రద్వయంబును జనియించె వా రెవ్వరనిన,

సీ సురసపని వ్రతాసరణి నరుంధతి
    రాజితనుగుణ తరంగలింగ
సాత్త్వికవిజిత రసాసారస క్షిమ
    హెూరు సత్యవ్రతాచారవీర
సకలబంధు సమూహ సన్నుత సత్కీర్తి
    రాజితగంగ శ్రీరామలింగ
మానినీలోకా సమానతుషారాద్రి
    భూరాజిత గురుత్వభారహార
వీరినల్గురి వెనుకను జారులీల
సర్వ సౌభాగ్యముల మహిఁజాను లెందుఁ
దనకు నెవ్వరుసాటిలేరనఁగనెసఁగుఁ
గలితగుణరత్నపేటి యక్కమవధూటి.

ఉ అందుమదగ్రజుండు సుగుణాంచితసత్యమునందుధర్మజుం
డిందుమరాళహారశరహీరపటీర వియన్నదీశర
త్కుందసితాబ్జకీర్తివరతామరసేక్షణ పాదపంకజ
స్యందమిళిందమూర్తి ధరణీసురుఁడయ్యనరామరాజనన్

క తదవరజుఁడు రామేశ్వర
పదసరసిజనిహితహృదయ బంధురమతి నం
పాదపనుకవీంద్ర హితుఁడన
విదితుఁడుఁ చిన రామనామ విఖ్యాతి మెఱుగ్

* * * *

క సారస బాంధవవంశ్యాతు
పారకిరణ లోచనునకు సర్వజ్ఞునకున్
క్షీ రారామపురీశ
శ్రీరామేశునకు భక్తచింతామణికిన్

వ సాష్టాంగ నమస్కార పూర్వకంబుగా సమర్పింపఁబూనిన ప్రభులింగలీల యను మహాప్రబంధంబునకుం గథాక్రమం బెట్టిదనిన,

క శ్రీవిష్ణు వజ్జలాన్వయ
భావుకజలనిధి శశాంక భవ్యరఘుపతి
ప్రావీణ్య లబ్ధచిన్మ
ద్రావిలసిత పాలకొలని రామేశశివా!

వ అవధరింపుము

**End**

సీ బాలురవృద్ధులఁ బ్రౌఢుల వసుమతీ
పాలురఁబేదల బలయుతులను
సత్యవ్రతస్థుల సద్గుణశ్రేష్ఠుల
సత్కృపాపరులను సజ్జనులను
గోవుల బ్రాహ్మల గురుభక్తియుక్తుల
నఖిలజనంబుల ననవరతము
సతతకారుణ్య వీక్షావిశేషంబున
నవ్యయుఁడవలుండు నమరవర్య
మౌళిఘటితదివ్య మాణిక్యసమ్ప్రభా
జాలవిహితపాద జలసిజుండు
వహితకీర్తి యొల్లమ ప్రభువర్యుంను
సుందరంబుగాఁగఁ జూచుచుండు.

విర విత రవి తేజా వీరమాంబాతనూజా

*   *   *

క శ్రీనగజాధీశ్వరకరు
ణావిత్త్య సమగ్రవిభవ నాళికరుహ
జ్ఞాన సూనక రాయణ
మానస శ్రీపల్లపల్లి మల్లారాధ్యా

ద్వితీయాశ్వాసము

*   *   *   *

నాగనాథవంశపావన మహేశసేవనా !

**End**

క బాలుగవృద్ధులనవనీ
పాలరంబేదలను సత్కృపాతురగుణసం
శీలుర గోబ్రాహ్మణులను
బాలింపుచునుండెc గరుణాబ్రభువనయంబున్

క ఇరువది యేనవగతియం
దిరవొందంగ బ్రభుని మహిమ యీశ్వరుండుమనున్
గరవర్తిcజెలిపె నిది గను
స్థిరముగవిన్నంత నిష్టసిద్ధులుగలుగున్

మ చామరసయ్యమున్న పదసంఖ్యకు వేయును నూట పద్నొకం
డైవలియిర్వదేను గతులందును శ్రీప్రభులింగలీల యొం
తేమహిమన్ రచించె నది తెల్లముగాc బిడుపర్తివాcడా
సోమగురుండు ద్విపద చొప్పడcజెప్పె విచిత్రవైఖరిన్

క ఆ సోమగురుcడు ద్విపదగc
జేసిన ప్రభులింగలీల క్షితి వెలయంగా
నాసక్తి బద్యకావ్యము
భాసురిగలిc బాలనార్య బసవన చేసెన్

**Colophon**

ఇది శ్రీమత్పాలకురికి సోమేశ్వరవరప్రసాదలబ్ధ కవితాచాతుర్యధుర్య పిడుపర్తి పాలనార్య సత్పుత్త్రిక లపవిత్ర బసవప్ప నామధేయ ప్రణీతంబైన ప్రభులింగలీలయను శివజ్ఞానంబునందుc బంచమాశ్వాసము

గ్రంథాంతమందీ వ్రాcతగలదు

మాతృకతో మొకాబిలా చేయడమయినది

(వి-వి)—

సమగ్రము ప్రాఁతమంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములుగలవు షష్ఠమాశ్వాసమున గ్రంథపాతము అధికముగాఁగలవు

పూర్వపు నెం 2130 రున వర్ణితమయిన గ్రంథమును బోలినదే గ్రంథమిది పాద్యవిషయమదియే కాని రచనము వేఱు పిడుపర్తి బసవప్ప దీనికిఁగర్త ఇతఁడు పాలనార్యుని కుమారుఁడు పాలకురికి సోమనాథునితఁడు తన గురువుగాఁ పేర్కొన్నాఁడు పిడుపర్తి సోమనాథుని ద్విపద ప్రభులింగలీల ననుసరించి యీతఁడీ పద్యకృతిని రచియించెను పిడుపర్తి సోమనాథునీతఁడు సోమగురుఁడని స్తుతించెను భృంగిరిటగోత్రుఁడును, వీరమాంబాపుత్రుఁడును చల్లపల్లి శాసనుఁడునగు వల్లపల్లి మల్లారాధ్యునకిది యంకితము సేయఁబడినది విశేషములకు బాహ్యత గ్రంథభాగములఁగాంచునది

ఇందలి గ్రంథాంతరము 1 *a* హరిశ్చంద్రోపాఖ్యానము

---

## No 2132, ప్రభులింగ లీల

## PRABHULINGA LĪLA

Substance, palm leaf Size, 16⅞ × 1⅛ inches Pages, 366 Lines, 5 and 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Same work as the above

(వి-వి)—

సమగ్రము ప్రాఁతమంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు— గ్రంథపాతములులేవు

పూర్వముంబోలె

---

## No 2133 ప్రమాణత్తిరట్టు

## PRAMĀNATTIRATTU

Substance, palm leaf Size, 14 × 1¼ inches Pages, 54 Lines, 5 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 48 *a* The other works herein are —1 *a* Ācāryābhimānamu, 75 *a* Mōkṣa Śāstramu, 102-*a* Paravastunāyaka Śatakamu

Complete

Some of the principles of the Tengala Sect of Śrī Vaiṣṇava school are explained in this

**Beginning :**

మన్త్రే తద్దేవతాయాం చ తథా మంత్రప్రదే గురౌ
త్రిషు భక్తిస్తథా కార్యా సా హి ప్రథమసాధనమ్

మంత్రశ్రేష్ఠమైన పెరియ తిరుమంత్రమందున్ను ఆ మంత్రమునుచేత ప్రతిపాదింపబడ్డషు వంటి సర్వేశ్వరునియందున్ను ఎప్పుడున్ను భక్తి కలిగివుండేను కార్యసిద్ధియవును కార్యసిద్ధికే యీ భక్తి ప్రథమసాధనము తిరుమంత్రమందు భక్తి కలిగివుండేను కార్యసిద్ధియవును కార్యసిద్ధికే యీ భక్తి ప్రథమసాధనము తిరుమంత్రమందు భక్తి కలిగి వుండేను కార్యకరమును యీ మంత్రం శ్లాఘ్యమైనదా అంటేను యీ తిరుమంత్ర ప్రభావము చెప్పేము

మన్త్రాణాం పరమం మన్త్రం గుహ్యానాం గుహ్యముత్తమమ్
పవిత్రం చ పవిత్రాణాం మూలమన్త్రం సనాతనమ్

మంత్రాలలోపలనెల్లాను అధిక్యమైన మంత్రమున్నై రహస్యాలలోపలనెల్లాను ఉత్తమమైన రహస్యమున్నై పవిత్రమైనవానిలోపలనెల్లాను ఆదిక్యమైన మూలమంత్ర మనిన్ని—

**End**

అటుగనుక విష్ణుభక్తులమీదను యెవ్వరు నిగ్రహించినాను వారే చెడిపోదురు ఏ పట్లనున్ను శ్రీ వైష్ణవదాసులకు ఒక్క దవలున్ను లేవు యాపితంపరిమపుణ్యమ పుణ్యమన్యత్ అని సర్వేశ్వరునికి యేది తిరువళ్ళమైవున్నది ఆ సర్వేశ్వరుని తిరువళ్ళం కానిదే పాపమనిన్ని శాస్త్రం చెప్పుచున్నది గనుక ఈశ్వర తిరువళ్ళానుసారంగాను స్వామికి అవయవభూతులు గనుక శ్రీ వైష్ణవులకు పరితంత్రులై వారి అపచారానకు వెలచి వాదిగి యెంబెరుమానార్ తిరువడిగళే శరణమని దృఢాధ్యవసాయపరులై వున్న వారికి కైయ్యలెంగునెల్లికని అని మణవాళమహామునులానతిచ్చిన ప్రకారానే యీ చేతనునికి మోక్షం అరచేతిదై వుండును సందేహంలేదు

(వి-వి)—

సమగ్రము ప్రాచీనమైనది తప్పులున్నవి శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

తెంగల వైష్ణవసంప్రదాయమువారి మత సిద్ధాంతసారమిందు వివరింపబడినది ఇది ద్రవిడ గ్రంథమునకు తెలిగింపయియుండును ఇది శ్రీ వైష్ణసంప్రదాయపువారికు తెలుగునగలదు.

ఇందలి గ్రంథాంతరములివి

1a ఆచార్యాభిమానము 75 a మోక్షశాస్త్రము 102 a పరవస్తునాయక శతకము.

## No 2134 బసవ పురాణము.

## BASAVA PURĀṆAMU

Substance, paper Size, 12⅜ × 7⅝ inches Pages 422 Lines 20 and 21 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, good, but not free from mistakes

Begins on fol 1 *a* The other work herein is —212 *a* Visādhipa-śatakamu

Complete

A poetic version of the same work in dvipada by Pālkuriki Somanātha The original has been closely followed and the work is dedicated to Pālkuriki Sōmanātha An account of the life of Pālkuriki Sōmanātha and his works is given in the introductory portion of this work The author is Sōmaya, son of Basavanācārya of Piduparti family and the Dīkṣabōdha, etc For details see the extracts below

**Beginning**

ఉ శ్రీఘనసితత్రిపుండ్రక పరీతవిశంకటఫాలు జూటజూ
టీభరధారు నిర్మలపటీకటలావృతదేహు సక్షమా
లాభరణాఖిలాంగు బసవాక్షరపారపవిత్రవక్త్రుఁజి
చ్ఛోభితచిత్తుఁ బాల్కురికి సోమయదేశికుఁ బ్రస్తుతించెదన్

* * * *

చ ప్రసవశరాసనాంతకుని పంపున మున్నవతారమంద శ్రీ
బసవపురాణసంకథిత భక్తమణిగ్రథనైకసూత్రమై
వసుమతివీరశైవమభివర్ధన మందఁగఁజేసినట్టి యా
బసవనమంత్రిఁగొల్తుభవబంధురసింధువుఁదాఁటఁగోరుచున్

* * * *

శా ఆశంబాసివిరక్తులై మొదల మోక్షాపేక్షదేశాంతరం
బాశాంతంబుగఁ జేసి స్వానుభవశాస్త్రోక్తులం దాత్మిక
ప్రాశస్త్యంబు సమున్నతిం దెలిసి [illegible] జిల్లినాపుట్టశాం
తేశ శ్రీగురుశిష్యుఁ జెన్న బసవాధీశుం బ్రశంసించెదన్.

మ స్మయమాయాదివికారదూరు శివపూజామాతులన్ మాతులన్
ప్రియసంభాషణభూషణున్ వడరి భీభిద్బాహువున్ భావుకున్
దయ నన్నుద్ధరదక్షుఁజేసిన మహాధన్యాత్ములన్ భక్తితో
నయగారప్పయగారిఁ బాల్కురికి సోమారాధ్యులంగొల్చెదన్

ఉ హృద్గతమోహబంధననికృంతనశాలి విశాలబుద్ధినా
శుద్ధహనావలీభవద పారకృపాకరు ముక్త్యవాప్తికై

మద్గురువర్యునిన్ సుజనమానితచర్యు నహార్యధైర్యునిన్
సద్గుణపాత్రుఁబిడ్పఱితి శాసను సోమయదేవుఁ గొల్చెదన్

శా. శ్రీమద్దేవయదేశికేంద్రతనయున్ శిష్యావళీరక్ష-
ప్రేమార్ద్రాద్రిమనస్కు నంబునిధి గంభీరున్ దపోవిష్కృ
తాత్మామాద్యంతర రాతిజైతు బుధలోకస్తోత్ర పాత్రున్ గుణ
స్తోమున్ శ్రీ పిడుపర్తి వాసు బసవేశుంగొల్తు వాక్సిద్ధికిన్

వ. ఇట్లు * * * గావించి * * * యొక్క మహాప్రబంధంబేను సంధానంబు సేయనుద్యోగించియున్న సమయంబున,

సీ. గీ. అనుచుఁగొనియాడ వహికెక్కినట్టిఘనుఁడు
దేవనాచార్యనైయ్యంపు దేవియైన
మల్లమాంబసుపుత్రుఁడామ్నాయవేది
భవ్యగుణశాలి పిడుపర్తి బసవశౌరి

క. ననునొకనాఁడాత్మాంక
స్థునిఁ గనుఁగొని పాలకురికి సోమేశుని పే
రను బసవపురాణము ప
ద్యనిబద్ధతవెలయఁ జేయఁ దలఁచితిమి సుతా!

* * * *

ఆ. సోముఁడేమి చెప్పె సోమేశుద్విపదలే
కెట్టిపద్యములుగఁ బెనచె నందు
రన్యులనఁగవలవ దాయయ్యశిష్యుల
మగుటకునకుఁజెల్లునవియునిలువ

సీ. విరచించె జైమిని వేదపాదస్తవం - బొకపాదమున వేదసూక్తి నిలిపి
హరభక్తివైదికంబని శ్రుతులిడి చెప్పెఁ - బ్రతిభసోమేశుఁడారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁడా చరితపద్యప్రబం - ధము చేసె ద్విపదలు తఱచునిలిపి
యాతండు పద్యకావ్యముచేసె నైషధ - మంచితహర్షవాక్యములఁ బెట్టి
సోమగురువాక్యములఁ బెట్టి భీమసుకవి
గరిమ బసవపురాణంబుఁ గన్నడించె
గాన పూర్వకావ్యము వేఱుగ తిరచించు
వారి కాదికావ్యోక్తులు వచ్చునిడఁగ

క. నీవును సోమేశుని ద్విప
దావలి యర్థ(పద్య?)ములు సేయు మందులయర్థం
బావంతయు డిగవిడకు
మేలియు మున్నందులేని విడకు కుమారా!

సీ. చదివించినారము శబ్దార్థసాహిత్య
 కావ్యనిర్మితి శక్తిగలదు నీకు
మతకులాచార్యుడై మహివీరశైవైక
 మార్గంబుc జూపిన మహితయశుని
సోమేశ్వరునిc గృతిస్వామిగా నియమించి
 బసవ పురాణంబు పద్యకావ్య
మర్థిc గావింపుమీ యని యానతిచ్చినc
 గరములు శిరమునం దిరవుకొలిపి
మీకు నంకితముగ నాకాంక్షనొక కృతి
సేయ వేడ్క నాకుc బాయదెపుడు
నైన మీ యనుజ్ఞయది గడకయెట్లు
సేయుమన్ననట్లు సేయువాడ

క. అనియే నువిన్నవించిన
విని ననుc గారుణ్యదృష్టి వీక్షించి మహా
త్మునిc బాలకురికి సోమే
శునిc గృతిపతిc జేయ సకల శుభదము మనకున్

క. నాకొక కృతియీc దలంచుట
చేకాని సంతసము నాకుc జేయుటకై కా
యాకృతి గురువుల కిచ్చిన
నాకును సంతసము శతగుణంబగుc బుత్రా!

వ. అని యానతిచ్చినం దద్వచనంబు శిరంబునన్ ధరియించి చెప్పంబూనిన కావ్యకన్యకా ముఖమండనాయమానంబగు కృతిపతి మాహాత్మ్యంబు ప్రథమకథనీయంబు గావున దాని వర్ణించెద నదియెట్టులనిన,

* * * *

చ. అసదృశతన్మహా మహిమమారవి తారకమై చెలంగ శ్రీ
బసవ చరిత్రమున్ సకల భక్తకథామణి సూత్రభాతిగా
వెస రచియింపు మీవు పృథివీస్థలికింజని నాcగభృంగి సం
తసమునc బుట్టెc బాల్కురికి నామపురీవరసోమనాథుcడై

సీ. గీ. అతని నుతియింప నాబోటికలవి యగునె
జైనమస్తక విన్యస్త శాతశూల
కలితబిజ్జల తలగుండు గండబిరుద
శోభితుcడు పాల్కురికి సోమనాభిధుండు

క. అతcడు గురువరకర సం
జాతుండై విశ్వనాథు సన్నిధిcగవితా

చాతురి దొంటింగి బసవ
ప్రీతిగ రచియించినట్టి కృతులెయ్యవనఁగ

సీ. బసవపురాణంబు పండితారాధ్యుల
చరితంబు ననుభవసారమును జ
...శ్వదసారసూక్తులు సోమనాథ భా
ష్యమ్ము శ్రీరుద్రభాష్యమ్ము బసవ
రగడ గంగోత్పత్తిరగడ చెన్న బసవ
రగడయు సద్గురు రగడ చెన్న
మల్లుసీసములు నమస్కారగద్య వృ
షాధిప శతకంబు నక్షరాంక
గద్యపద్యముల్ పంచప్రకార గద్య
మష్టకము పంచకము నుదాహరణయుగము
నాదియగు కృతుల్ భక్తహితార్థబుద్ధిఁ
జెప్పె నవి భక్తసభలలోఁ జెల్లుచుండు

సీ. ఒకనాఁడు శివభక్తులొకచోటను స్వయం
భూదేవు మంటపమున వసించి
బసవపురాణంబు పఠియించి వినువేళ
వరుసగోల్యఁ బ్రతాపుడచటి కేఁగి
యీసంభ్రమంబేమి యనుడు భక్తులు బస
వని పురాణంబర్థి వినెదరనిన
వినమా పురాణంబు విధమెట్టిదో యన్న
ధూర్తవిప్రుఁడొకఁడు భర్తఁజేరి
పాల్కురికి సోమపతితుఁ డీనడుమను
బెనచె మధ్యవళ్లు పెట్టిద్విపద
యప్రమాణమిది యనాద్యంబు పదమన్న
నరిగెరాజు భక్తులది యెఱింగి

* * * *

క. చనిపాలు కుఱికి సోమ
ఘనితోనప్పాలు పలుకుచొప్పడఁ జెప్పన్
విని యారకన్న భక్తుల
కునుదల వంపొనటంచుఁ గుపితాత్ముండై

* * * *

గీ. గవనిపైఁ జెచ్చి ప్రతిమయుఁ గరులు రెండు
నుండఁగాఁ బండిగట్టిన యాత్మయుగము
గవనిఁ జొరకున్న సోమశేఖరుఁడెఱింగి
తొలఁగుమని పంపనవి నేలఁ దునిసిపడిరా

చ అదివిని దూషకావళులు నాపురియేలు ప్రతాపరుద్రుఁడున్ భయా
స్పదులయివచ్చి మ్రొక్కినఁ గృపామతి వారలఁ గాంచి పంచియ
మ్మదన విరోధిభక్తుల సమాదరణంబునఁ గొంచుఁబోయి సా
భ్యుదయ మనస్కులై కొల్చుచుండఁగ నుండెను కొన్ని ఘస్రముల్

వ ఇట్లుండియు సోమేశ్వరుండు కాలత్రయ వేది గావున నాగామికాల్య దౌశ్శీల్యంబు నెఱింగి పిడుపర్తి శివరాత్రి కొప్పయ్యగారాదిగాఁ గల తమ శిష్యులనందఱఁ బిలిపించి యీ దేశంబింకఁ దురుష్కరాజాక్రాంతంబు గాఁగలదు మాబోటి నియమస్థుల కిందునికి పొందుపడదని వారితో నిట్లనిరి

క ఈ రాజ్యంబున మాకిఁక
నారూఢిఁ జరింపుచుండ ననువుపడదు మీ
కీ రాజు సీమలో నొక
యూరు ఘటించిత్తు నందుచుండుండనుచున్

స తన శిష్యుఁడైన నా ప్రతాపునిమంత్రియు
నగు నిందుటూ (లూ ?) రి యన్నయ్యఁ బిల్వ
బనిచి నీవెప్పుడు భక్తితో నరవత్తు
ముగురనర్చింతువు ముఖ్యవృత్తిఁ
దత్ప్రీతిగా మావ్రతస్థులకొక గ్రామ
మిప్పింపుమీ ధరాధీశుచేత
ననవుడు నతఁడు మహాప్రసాదంబని
యిప్పించె దోంకిపర్తి ధరిత్రి
నందుఁ బ్రతివసించి యామువత్తుము గురున
దాముఁ బ్రేమఁ గనడభూమికరిగి
యచటి భక్తులెల్ల నతిభక్తి సేవింపఁ
గొంతకాలముండి యంతమీఁద

* * * *

చ కలిమలభంగ చంగశివగంగకుఁ జెంగటఁ గల్కిమన్పురిన్
బలకలగుఁటిమాయిన సమాధిరచింపఁగఁ జేసి భూతిలోఁ
దలముగఁ బోసియందు పయిఁబావసియింపుచుఁ గావుగప్పభృ
త్యుల నియమించి నిశ్చలతనుండె వృషేంద్రపదాంతరంగుఁడై

* * * *

సీ భవిఁబాడ ననుచు నా కట్టిన నియమంబు
కడమగాకుండఁగాఁ బడమిజనులు
నారూపు నీరూపు నడుమఁగాంచుటదోవ
నాకుఁ బ్రియంబైన నందిరూపు

ఒటిఁటఁబ వసు దాల్చి బర్గనీగర్భంబు
నందునన్న ధరించి సంపియంబు
పూనువల్లుగ ని సమాధిమీఁదటఁ గొంత
తడవుండి సద్భక్తతతినుతింప
గొంచుఁ బొమ్మ రజలదుఖఃటఁబునకు నన్న
నసెన నల్లకొంచునరుగ శివుని
సమ్ముఖంబునందు సమ్మదంబున నుండె
సోమత ల్యాఁగుచు సోమగురుఁడు

ఇ అట్టి పాల్కురికి సోమేశ్వరున కంకితంబుగా బసవ పురాణంబు పద్యకావ్యంబు గావింప నుద్యోగించిన తచ్ఛిష్య ప్రశిష్య ప్రశిష్యుండనగు మద్వంశాను క్రమంబెట్టిదనిన ,

క సోమేశుఁడు హరపురికిం
గాంచేఁ గళముస్న యన్నదండాధిపుచేఁ
బ్రేమంబున నిప్పించిన
భూమండలి దోకి పల్కురి శరణులలోన్

క ధరఁ బాలకురికి సోమే
శ్వరగురు కారుణ్యహస్త సంభవుఁడగుచున్
గురుదత్త లింగభావాం
తరుఁడై శివరాత్రి కొప్పనాదుం డొప్పున్

క ఆకొప్పయ్యకుఁ బుణ్య
శ్లోకుఁడు బసవయ్యపుట్టి సోమేశునకున్
జోకఁ బిడుపర్తి లోపలఁ
బ్రాకారముఁ బుట్టఁదోఁట బావిఘటించెన్

* * * *

చ ఆనఘు విచారుఁడై బసవయ ప్రభుఁడొప్పెద దాత్మసంభవుల్

ఆ సోమయప్రభుండు సారిదిఁ గొప్పయ్యయు
గొండవీటి లింగశోభితుండు
శివునియానతయ్య భువనయ్యదేవర
యనఁగ వెలసిరందునగ్రజుండు

* * * *

క ఆదిని బ్రతాపుఁ డిచ్చిన
యాదోకిపురంబు నడుమ నంకిలిపడినన్
మోదమునఁ బ్రౌఢరాయని
కీదయితునిచేతఁ దెచ్చెనిందఱు నెఱుఁగన్.

క శ్రీవెలయఁగనా సోమయ
దేవరపిన సోమగురుని దేవప్రభునిన్
భావినుతుం జిక్కయ్యయుఁ
గోవిదు బసవయ్యఁ బాలకురికయ్యఁగనెన్

* * * *

క పినసోమయగురువర్యున
కును నిశ్శంకయ్యగారుఁ గొమరయ్యార్యుం
డును నిమ్మనాథుఁడును నన
నసఘులు మువ్వురు జనించిరందఱిలోనన్

సీ * * *

శుద్ధాత్మ పిడుపర్తి సోమయ దేశిక
సత్పుత్త్రుఁ డష్ట భాషావిదుండు
భక్తులకెన్నఁడుఁ గవితచెప్పనిఘనుఁడు
శాంతులుడిగిన సమలోష్టకాంచనుండు
శాంతిదాంతిమయస్వాంతసంయుతుండు
జగతిఁ బెంపారు నిమ్మయాచార్యవరుఁడు.

క ఆ నిమ్మనార్య పుత్త్రుఁడు
నానాగమ శాస్త్రవేదినయ వినయాఢ్యుం
డానత జనబాంధవక
ల్పానోకహమనఁగ బసవనార్యుఁడు వెలయున్

వ అట్టి పిన సోమగురుని యనుసంభవుఁడు

సీ * * *

అతఁడు నియమవ్రతాది విహారనిలయు
డతఁడు రాజన్యమూర్ధన్యహారహీర
కిరణ వికసిత పాదపంకేజయుగళుఁ
డగుచు దేవయ దేశికుఁడవని వెలసె.

శా ఆదేవప్రభు భార్యమల్లమ యతిఖ్యాతారాధనాధుర్యధై
ర్యోదారాఢ్యులఁ బుత్త్రులం గనియె సోమాభిఖ్యనానా కళా
వేదిన్ శ్రీ బసవేశు వారిరువురిన్ విశ్వంబు వర్ణింపఁగా
స్వోదర్యోచితకృత్యముల్ జరపిరత్యార్యక్షస్థలో జస్వులై

సీ * * *

సద్గురుండైన సోమయ సద్గురుండు
సాధుసమ్మత సద్గుణాసక్తుఁడగుచుఁ

బ్బ్రతులఁగాఁచె సోమన్న ఁబుడమిఁజెప
నార్యు గుంటూరి వీరయ్య నలఘుయశుల

* * * *

క వారలలో దేవయగణ
వారుఁడు శైవాగమేతిహాస పురాణా
ధారార్థవేది విమలవి
చారుఁడు గురులింగ జంగమారాధకుఁడున్

వ తదను సంభవుండు

క. అయ్యంకి వీరగురునకు
నెయ్యుండును సుజనమాననీయుండునునై
రాయ్యెడ గుంటూరి వీ
రయ్య శివజ్ఞానభరితుఁడై విలసిల్లున్

వ అనోమేశునను సంభవుండు.

సీ. గురునాథుఁడగు పాలకురికి సోమేశుండు
చెప్పినకృతులెల్ల జగతిమీఁదఁ
బ్రకటింపవచ్చిన ప్రత్యక్ష బసవేశుఁ
డని భక్తజనములు వినుతిసేయ
భక్తిమర్మములు తప్పకయుండ నర్థముల్
చెప్పి శిష్యులను రక్షింపనేర్చు
నొనరదీక్షాబోధయును బిల్లనైనారు
కథయు బ్రహ్మోత్తర ఖండమునను
నాదిగాఁగల శివరహస్యములు పెక్కు
శివ కథలుమెచ్చ ద్విపదలుచేసి భక్త
సభల వెలయించి మించిన సజ్జనుండు
బంధుసురమణి పిడుపర్తి బసవశౌరి

సీ. ద్రవిడ కర్ణాటాంధ్రయ వనభాషలఁ బేర్లు
గొన్నాఁడు పెక్కులు సన్నుతముగఁ
దలయెత్తినది మొదల్ ధరఁగల్గు దుర్గాధి
పతులచేఁ బూజలువడసినాఁడు
కాలకంధరుని పక్కమలంబు పూజించు
పంచాక్షరి జపించుఁ బాయకెపుడు
భవిపాకవర్జిత ప్రవిమలవ్రతుఁ డన్య
మంత్రాంగదాహము ల్మానినాఁడు

కవితభవులకుఁ జెప్పని సవినయుండు
బంధుజనములఁ బ్రోవఁ బాల్పడ్డవాఁడు
నిత్యజంగమ పూజనాస్వీతబుద్ధి
వశమె పొగడంగఁ బిసుపర్తి బసవఘనుని

ఆ అట్టి బసవనార్యుఁడతుల శివార్చ నా
రతుఁడు ధర్మయుతుఁడు వ్రతియునైన
వీర్నకోటమల్ల విభుపుత్రి నాగాంబఁ
దగ వివాహమయ్యెఁ దత్పురంధ్రి

* * *

సీ ఆనాగమాంబకు నత్యంత శివభక్తి
యుక్తుఁడౌ బసవనార్యునకుఁ బుత్రు
లనుపమాన చరిత్రు లతిపవిత్రులు నల్వు
రైరి ధర్మార్థకామామృతములు
మూర్తులు దాల్చినా మొదల సోమన్నయుఁ
బాపన్న గురువన్న బసవనయును
వారిలోనను నే నవరజుండ బహుకావ
నాటకాలంకారరఘోటు వేదిఁ
జెప్పఁ దొడఁగినాఁడ శ్రీబసవపురాణ
మవనిఁ బద్యకావ్యమై చెలంగ
మంజులోక్తి యుక్తిమత్కృపగురుఁడైన
పాలకురికి గురునిఁ బతినిఁ జేసి

* * * *

క అజ్ఞానాపహ కరణ
ప్రాజ్ఞునకును సకలసుకవిభావజ్ఞునకున్
వైజ్ఞానిక సేవితునకు
సుజ్ఞానికిఁ బాలకుఱికి సోమేశునకున్

వ భక్తిశ్రద్ధానిబద్ధ బుద్ధిపూర్వకంబుగా ననేక సాష్టాంగదండనమస్కారంబు లాచరించి జన్మసాఫల్యంబుగా నా చెప్పఁబూనిన బసవపురాణంబను మహాప్రబంధంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన

గీ దేవముఖ్యు మీఁగుద్విపద గావించిన
బసవచరిత మేనుభవదనుజ్ఞఁ
బద్యహృద్య కావ్యభంగి నానేర్చిన
యట్లు విన్నవింతు నవధరింపు

క భృంగిరిటి గోత్రసంభవ
జంగమ లింగార్చనా విశారద విలస
త్సంగీత శాస్త్రి పారగ
గంగోత్పత్తి ప్రకారకావ్యధురీణా!

* * *

**End**

క అవి యివియనఁగా నేటికిఁ
బ్రవిమల సద్భక్తియుక్తి బసవపురాణం
బు వచింప విన్నమాత్రన
శివుకృపచే నిహపరార్థ సిద్ధులుగలుగున్

* * * *

మా జితకలిమలదోషా శిష్టసద్భక్తిభూషా
శితభసితవిలేపా శిక్షితాత్మావలేపా
శ్రుతిమత హితచర్యాశుద్ధ సద్భక్తవర్యా
వితత సుగుణ జాలా వీరశైవాతిలోలా

**Colophon**

ఇది శ్రీ మల్లికార్జున సోమేశ్వర గురుప్రసాద లబ్ధ ప్రబంధ నిబంధన శక్తియుక్త శ్రీ పిడుపర్తి బసవనాచార్యవర్య పత్పుత్త్రికులపవిత్ర సోమయ నామధేయ కవి ప్రణీతంబైన బసవపురాణంబను మహాప్రబంధంబునందు సప్తమాశ్వాసము

గ్రంథాంతమున ప్రతివిలేఖకుఁ డీక్రింది పద్యములు వ్రాసికొనెను

గీ వసుధ శ్రీ విశ్వవసునామ వత్సరమున
భాద్రపద శుద్ధపంచమీ భాను దివస
మాదిసద్భక్తి బసవపురాణ మొప్ప
వ్రాసెఁ బిడుపర్తి రాజ సరాజసుకవి

క ధరఁజె బురాణవవర్గ
స్థిరత శ్రీ సిద్ధరామదేశిక భవ్యో
త్కర హస్తాంబుజ సంభవు
డరుణాత్మజమారుఁడు వీరయామాత్యసుతుఁడన్.

(వి–వి)—

సమగ్రము వ్రాఁత తిన్ననిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథ పాతము లేవు

పాల్కురికి సోమనాథుఁడు ద్విపదలో రచియించిన బసవపురాణమునకిది సరియగు పద్య రూపరచనము అందలి కథార్థములెల్ల నిందునుగలవు పాల్కురికి సోమనాథునికే యిది కృతి యీయఁబడినది కృత్యవతరణికలోనిందుఁ బాల్కురికి సోమ

నాథుని చరిత్రము, తత్కృతులు వివరింపఁబడినవి ఇందున్న రీతిని బట్టి చూడఁగాఁ పాల్కురికి సోమనాథుఁడు ప్రతాపరుద్రదేవుని కాలమున నున్నవాఁడగును ప్రతాపరుద్రదేవుని మంత్రియగు నిందులూరి యన్నయచే పాల్కురికి సోమనాథుఁడే తత్కృతిపతికిఁ బ్రాచార్య ప్రాచార్యాచార్యుండగు శివరాత్రి కొప్పయ మొదలగువారికి దోకిపర్తి యనునగ్రహార మిప్పించెనట

పాల్కురికి సోమనాథుని గ్రంథముల జరన పారవాది సూక్ష్మప్రచారమునకుఁ దెచ్చిన తచ్ఛిష్యవంశము వారునునగు పిడుపర్తి వారిలో సుప్రఖ్యాతుడును, దీక్షాబోధాది గ్రంథకర్తయునగు బసవనారాధ్య కవిప్రేరణమునఁ దత్పుత్రుఁడు సోమయ దీనిరచియించెను విశేషములకు చావ్యాత గ్రంథ భాగములఁగాంచునది పిడుపర్తి వంశ్యులింకను బహువురు బహుగ్రంథముల రచించిరి ఏ తత్ప్రతి మాతృకను వ్రాసిన వ్రాయసగాఁడు ' రాయస రాజకవి ' గూడఁ బిడుపర్తి వంశ్యుఁడే.

---

## No. 2135 బసవ పురాణము

## BASAVA PURĀNAMU

Substance, palm leaf Size 18¼ × 1⅝ inches Pages, 27 Lines, 8 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము ప్రథమాశ్వాసమధ్యమున వ్రాఁత నిలిచిపోయినది వ్రాఁత మంచిదే కాని తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

పూర్వము వోలె

---

## No. 2136 బసవ పురాణము

## BASAVA PURĀNAMU

Substance, paper Size, 12¼ × 7¾ inches Pages, 586 Lines, 20 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good but not free from mistakes

Complete

Same work as that described under No 2134

(వి-వి)—

సమగ్రము వ్రాఁత చక్కఁగానున్నది తప్పులు చాలఁగలవు పాఠ భేదములు బంతులనడుమఁ జేర్పఁబడినవి అధిక పాఠములు వ్రాసిన కాగితపుముక్కలు నడుమ నదికింపఁబడినవి

పూర్వవర్ణితమే

గ్రంథాంతమందిట్లు వ్రాయఁబడినది —

తే॥ వసుధ శ్రీవిశ్వావసునామ వత్సరమున
భాద్రపద శుద్ధపంచమి భానుదివస
మాడ సద్భక్తి బసవపురాణ మొప్ప
వ్రాసెఁ ఓడుపర్తి రాజసరాజను కవి

క॥ ధరణిఁ బురాణదవర్గ
స్థిరతర శ్రీ సిద్ధరామ దేశిక భవ్యో
త్కర హస్తాబ్జ సంభవుఁ
డరుణాత్మజహరుఁడు వీరయాహ్వయ సుతుఁడ॥

---

## No. 2137 బసవ రగడ

## BASAVA RAGADA

Substance, paper Size, 12¼ × 7½ inches Pages, 5 Lines, 21 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 178 *a* The other works herein are —1-*a* Krisna Śatakamu, 11 *a* Venkatācalavihāra Śatakamu, 17 *a* Kālahasti Śatakamu, 32 *a* Mādhavakrisna Śatakamu, 36 *b* Cennarāyādhipa Śatakamu, 46 Cillara Kāvyamulu, Kīrtanalu, 65 Nellūri Nārasimha Śatakamu, 69 Nīlanagādhināyaka Śatakamu, 75 Sadānanda Śatakamu, etc

Complete

Written in praise of Basavēśvara by Pālkuriki Sōmanātha

**Beginning**

శ్రీవరాజ దేవరాజ సిద్ధసాధ్య యక్షర
క్షోవిహంగ రాక్షసతంగ సోమధూమకరమరుం
జీవితేశ విధృతపాశ సేవితద్వయాంఘ్రిరా
జీవనిస్సునాం పాకశ్వ శ్రీ వృషాధినాయకా ।

రగడ

శ్రీ వృషాధినాయక ప్రసిద్ధ భావ శరణు బసవ
తావకాంఘ్రి సేవకాఘ దాహదాహ శరణు బసవ
నందిత ద్వితీయ శంభునామధేయ శరణు బసవ
వంది తత్త్రిలోకవిబుధవరనికాయ శరణు బసవ
అచల శైవధర్మనిర్ణయావతార శరణు బసవ
ప్రచుర యుగమితాంఘ్రి ధర్మపథ విహార శరణు బసవ

ప్రమథగణపద ప్రసిద్ధ కట్టెఘద్ర శరణు బసవ
ప్రమథ శాశ్వత స్వభావ భావశుద్ధ శరణు బసవ
శరణు కిరణ శరణ బసవ శరణ భరణ శరణు బసవ
శరణ శరణు శరణు బసవ శరణు శరణు శరణు బసవ

**Colophon**

క శరణస్తవ మేతోష్టవ
శరణు గణోత్సాహరగళి—

క వావిరి బసవస్తుతిసం
భావనమైఁ జదివిచదివి ప్రమదంబునవా
పోవక బాబా సాసా
వావాయనకున్న నోట వాంచెల్లుఁ సుగుణ

(వి-వి.)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాత ములు లేవు

బసవేశ్వర స్తుతిరూపమైన యీరగడ పాల్కురికి సోమనాథుఁడు రచియించినది ఆద్యంతములందుఁ కన్నడ పద్యములు రెండున్నవి కట్టకడపటనున్న తెలుఁగు పద్య ము గ్రంథములోనిది కాకపోవచ్చును

ఇందలి గ్రంథాంతరములు — 1 a కృష్ణ శతకము 11 a వెంకటాచలవిహార శత కము, 17 a శ్రీకాళహస్తి శతకము, 32 a మాధవకృష్ణ శతకము, 36 a చెన్నారాయాధిప శతకము, 46 చిల్లరకావ్యములు, కీర్తనలు, 65 నృసింహారి నారసింహ శతకము, 69 నీలనగాధినాయక శతకము, 75 సదానంద శతకము వగైరా

---

## No 2138 బసవ విజయము

## BASAVA VIJAYAMU

Substance, paper Size, 12⅝ × 8¼ inches Pages, 143 Lines, 24 and 25 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but full of mistakes

Complete

Following the dvipada work by Palkuriki Sōmanāthakavi, Nāga bhūsanakavi of Tummalapalli, a disciple of Ivaṭūri Bhōgayya (Mallayya) and the son of Tripurāntaka, wrote this in three āsvāsas It is stated that the story in this was explained to King Pratāparudra by his minister Śivadēvayya, and that Pratāparudra invited Palkuriki Somanatha to his Court and honoured him

**Beginning**

ఉ. శ్రీ గురుమూర్తి పాదములు చిత్తములోనఁ దలంచి భక్తితో
నాగమ వేద తత్త్వవిదు నగ్రవరేణ్యుఁడు నివ్వటూరి శ్రీ
భోగవిశేష ధీరగుణ పూర్ణుఁడు నాశ్రిత భక్తవత్సలుం
డీగురుమల్లునిన్ భజనచేసు ప్రసంభ్రమలీలఁ జేయుమిన్

* * * *

గీ. భారతీదేవి శారదఁ బ్రస్తుతించి
అంబజగదంబఁ దల్లిని నమస్కరించి
క్షీరసాగరకన్యను జెలువు మీఱఁ
దలఁచి బసవన్న విజయంబుదగ రచింతు

* * * *

సీ. బిజ్జలు విరసము ప్రీతి దలిర్పంగ
వృషభేంద్రు మహిమలు విశదముగను
నెన్న నెవ్వరికిని నిలలోనవశమగుఁ
బన్నగా బ్రహ్మయేర్పఱుపలేఁడు
బసవని మహిమంబు పాల్కురికి సోమన్న
కర్ణామృతంబుగాఁ గలియుగమున
వర్ణించి చెప్పెను వరసతో
భక్తులు నానంద పదవినొంద
నాంధ్ర దేశంబునందున నమరియున్న
ప్రాభవంబైన గుడివాడ పట్టణమున
ప్రబలమైనట్టి తుమ్మలపల్లి వంశ
సంభవుండను నాగభూషణుఁడనంగ

గీ. బసవ విజయంబు రచియింతుఁ బద్యకావ్య
ముగను గవివరు లెచ్చియు మోదమందఁ
జిన్న పెద్దలువినియును బ్రీతి సేయ
భువిని బ్రఖ్యాతమానట్లు పొందువఱిచి

**End**

వ. అని శివదేవుండు నా ప్రతాపరుద్రునకు బసవన్న మాహాత్మ్యంబు వినిపించిన నతండును విని సంతసిల్లె శివదేవునకు వివిధాంబరంబులును వివిధ వస్తువులను బ్రతాప రుద్రుం డొసంగి యతని సంతుష్టుం జేసి సుఖంబుండిరి

మా. సదయమమృత హృదయా సార్వభౌమప్రదాయా
కదనవిజయశీలా గానవిద్యావిలోలా

సదమల గుణ సేవా సత్యవాక్య ప్రభావా
కుధరతనయ మోహాకర్త నందీశవాహా !

**Colophon**

ఇది శ్రీమన్మహా మహేశ్వర వరప్రసాద లబ్ధ దివ్యసౌభాగ్య జ్ఞానపర్వ సదాచార జంగమ లింగైక్యానుసంధాన హరితసగోత్రోద్భవ తుమ్మలపల్లి వంశాబ్ధి సుధాకర త్రిపురాంతక వరపుత్త్ర నాగభూషణ నామధేయ ప్రణీతంబైన బసవవిజయంబను మహాపురాణంబునందు బిజ్జలరాజు చరిత్రంబును నొక్క జంగమంబుచేత బసవన్న మహాత్మ్యంబు చోళరాజు విని కళ్యాణంబునకు బసవనిం గొలువవచ్చుటయు చోళనరేంద్రుండు కైలాసంబునకుం బోవుటయు బసవన్న యుంగరంబుగొని క్రొమ్ముక్కుటయు, శ్రీశైల మహాత్మ్యంబు వర్ణించుటయు చామంతిరాజు కరయును దవనమారయ్య నిమిత్తంబు శివుండు సెట్టివేషంబు దాల్చి భూలోకంబునకు వచ్చి మారయ్యను కైలాసంబునకుం గొని పోవుటయు చోరశంకరుండు సత్యశంకరుండై గురునియమంబైక్యంబగుటయు నన్నది సర్వంబున తృతీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము ప్రాంతమున్నది తప్పులు చాలగలవు వైవిధ్యము లేవ గ్రంథపాతములు లేవు.

పాల్కురికి సోమనాథ కవి ద్విపదరూపమున రచియించిన బసవ పురాణము ననుసరించి పటూరి భోగయ్య (మల్లయ్య) శిష్యుడును, హరితసగోత్రుడును, త్రిపురాంతక పుత్త్రుడును అగు తుమ్మలపల్లి నాగభూషణ కవిచే రచియింపబడిన మూడాశ్వాసముల కావ్యము ఈ కథార్థమును ప్రతాపరుద్రునకుం దన్మంత్రియగు శివదేవయ్య చెప్పినట్లుగా నీ ప్రబంధ రచనముగలదు ప్రతాపరుద్రుడు పాల్కురికి సోమనాథునిం దన యాస్థానమునకు రావించి సత్కరించినట్లు గలదు

---

## No 2139 బసవోదాహరణము

## BASAVŌDĀHARAṆAMU

Substance, palm leaf Size, 16¼ × 1⅜ inches Pages, 5 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —3 *b* Caturvēdasāramu, 5 *a* Siddhalinganavaratnamālika

A group of eight verses in popular meters beginning in order with the nominative and ending with the vocative, each followed by the metrical composition, in Kalika and utkalika (which can be adapted for purposes of singing) is called a udāharana The last verse of a udāharana is written in all the eight cases A work of this kind is usually

written in praise of some deity or great person The work under notice is written in praise of Basavēśvara, the founder of the Vīraśaiva religion The author is Pālkuriki Sōmanātha He is known to have written similar works also in Sanskrit

**Beginning**

ఉ శ్రీగురులింగ తత్పరుఁడ శేష జగన్నిధి శుద్ధతత్త్వసం
యోగసుఖ ప్రపూర్తి వృషభోత్తమమూర్తి యుదాత్తకీర్తి ది
వ్యాగమ మార్గవర్తి బసవయ్య కృపాంబుధి మాకు భక్తి సం
భోగములం బ్రసాద సుఖభోగములం గరుణించుఁ గావుతన్

కళిక

వెంచియుఁద్రిభువన వినతి సమేతుఁడు
మండిత సద్గుణమహిమోపేతుఁడు
సురుచిర శివసమసుఖ సంధానుఁడు
పరమ పరాకర భరితజ్ఞానుఁడు
విదితానందాన్వీత మనస్కుఁడు
సదమల విపుల విశాల యశస్కుఁడు
శ్రీవిలసితపద చిరతర భద్రుఁడు
గావున సాక్షాత్కలియుగ రుద్రుఁడు

ఉత్కలిక

భువనోపకారాభవమోదధీరా
భక్తిసంయోగా ముక్తిసంభోగా
సౌఖ్యాబ్ధిలోనా ముఖ్యుఁడైతానా
వెలయుశుభకరుఁడూ యిలవిశ్వగురుఁడూ

చ పసిగొని యెవ్వఁడేని బసవాయనునీ సుకృతాక్షరత్రయం
బెసగఁబఠించెనేని గిరిజేశున కాతనివక్త్రగహ్వరం
బసదృశగేహమన్నయవి యార్యుల వాక్యము లట్లుగావునన్
బసవనఁబుణ్యమూర్తిఁ దలఁపఁగదె చిత్తమ పాయకెప్పుడున్

**End:**

ఉ నీవు దయాపయోనిధివి నిన్ను నుతించినఁ గల్గు భక్తి నీ
చే వరవీరశైవనుతి చేకుఱు నీకయి యిత్తుఁగబ్బముల్
నీవలనన్ గృతార్థత జనించును నీకు నమస్కరింతునా
భావమునందునుండి ననుఁ బాయకుమీ బసవయ్య వేఁడెదన్

(వి-వి.)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులులేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

పద్యము, కళిక, ఉత్కళిక అను క్రమముచొప్పున ప్రథమాదిగా సంబోధనముతో గలసి యెనిమిదియగు విభక్తులతో నెనిమిది పద్యములను తుది కెనిమిది విభక్తులతోను నొక పద్యమును, నెనిమిది కళికలు, నెనిమిది యుత్కళికలు, గలుగునట్లు రచిపబడు కావ్యభేదమున కుదాహరణమని పేరు. ఇది ప్రాయికముగా స్తుతి విషయకముగా నుండును వీరశైవమత ప్రవర్తకుడగు బసవేశ్వరుని స్తుతి రూపముగా నీ యుదాహరణముగలదు దీనికి కర్త పాలుకురికి సోమనాథుడు ఆతడు సంస్కృతమునను గూడనిట్టి యుదాహరణమును రచియించినాడు

ఇందలి గ్రంథాంతరములు —3-b చతుర్వేద సారము, 5-a సిద్ధలింగ నవరత్న మాలిక

---

## No 2140 బ్రహ్మబిల పంచ రత్నములు

## BRAHMA BILA PANCA RATNAMULU

Substance, palm leaf Size, 12½ × 1½ inches Pages, 3 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but full of mistakes

Begins on fol 1 *a* The other works herein are --2 *a* Satcakranirnayamu, 4 *a* Prāstāvikaslōkamulu

Complete

Describes the nature of Daharākāśa (the subtle space in the heart) as explained in the Nārāyanānuvāka of the Taittiriyōpanisat Brahmabila is another name for Daharākāśa The author is not known

**Beginning .**

సీ నీలతోయద మధ్య నీవారశూకవ
  త్పరిపూర్ణ కాంతిచేఁ బ్రబలుచుండు
శంపాలతలభాతిఁ జతుల ప్రకాశమై
  చంచరీకమురీతిఁ జరుగుచుండు
కరికుంభ మధ్యస్థ ఘనమౌక్తికద్యుతుల్
  వెలయఁబ్రకాశమై వెలుఁగుచుండు
ఋతు శరత్కాలంబు రూఢిగా వ్యాపించు
  చంద్రచంద్రిక లీల జరగుచుండు
పద్మగర్భోదయంబైన భానుపగిదిఁ
బటువ దీపించు చతుల హృత్పద్మమందు
పరమహంస విహార చిత్పణవధార
పదుబనైదిటు శోభిల్లు బ్రహ్మబిలము

**End :**

> సీ. కదలకయుండ తారకమలంబులోనున్న
> భుజగ కన్యకఁగూర్చి పొరలదీర్చి
> సముమైన మలకలు చక్కగా సవరించి
> షణ్మండలంబుల సంధిపరచి
> పరిమిత షట్చక్ర పద్మాంతములయందు
> పరిపూర్ణబిందువుల్ పరగనునిచి
> ప్రాణవాయు స్థానపటుకళా సంపూర్ణ
> ఘంటానినాదఁబుకలయ దెలసి
> దెలసి విధుమండలంబుల తేటపడగ
> కడగలారింట పవనంబు ప్రణవనాద
> నాదపరిపూర్ణ చిత్కళానాదమగుచు
> పదులనైదింటు శోభిల్లు బ్రహ్మబిలము

(వి-వి)—
సమగ్రము వ్రాఁతమంచిది తప్పులుచాలఁగలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

తైత్తిరీయోపనిషత్తున నారాయణానువాకమునఁగల దహరాకాశ విద్యకిది తెల్గుపద్య రూప పరివర్తనము కర్త పేరెఱుఁగరాదు దహరాకాశమునకిందు బ్రహ్మబిలమని పేరుగలదు

---

## No 2141 బ్రహ్మసూత్ర టీకా సంగ్రహము

## BRAHMASŪTRA ṬĪKĀ SANGRAHAMU

Substance, paper Size, 6⅝ × 4⅜ inches Pages, 173 Lines, 18 on a page Character, Telugu Condition, much injured Appearance, old Mode of writing, not good but fairly free from mistakes

Complete

A Telugu exposition of the Uttaramīmāmsa of Vyāsa (Bādarāyana) The author is Tanakumalla Venkatakrsnarayalu He states that he wrote it in the year Raktākṣi

**Beginning**

> శా. శ్రీనారాయణమౌని వర్యుఁగరుణాసింధున్మదింగొల్చి య
> మ్మౌనీంద్రాంశజుఁడైన వ్యాసమునిచే మాహాత్మ్యతన్దెల్పినా
> నానార్థప్రతిపాది సూత్రములకున్నాంధ్రంబునన్ టీకఁ జే
> యన్నేఁబూనితి శిష్యబోధమున నైయార్యాతి దేశంబునన్
>
> క. అతిగహనమగుటఁ గొంచెపు
> మతిగలవారలకు శిష్యమననము కొఱకై

వితతార్థంబుల నెల్లను
నతిసంగ్రహరీతిఁ జెప్పనలవడె నింక౯

క శుభమ (545) ను నక్షర సంఖ్య౯
శుభమతి నీ సూత్రవితతి సుఖబోధముగ౯
శుభమతిఁ జదివెడువారికి
శుభములు చేకూరుఁగాత శుంభల్లీల౯

క రక్తాక్ష్యబ్దాషాఢిని
ముక్తిపమగు బ్రహ్మ సూత్రముఖ్యార్థములన్
భక్తిని సంగ్రహముగనను
రక్తిడడకమల్లి కృష్ణరాయఁడు పలికె౯

క ఇందలి గుణదోషంబుల
నిందుగరళములను దాల్చు నీశ్వరుపగిది౯
సందియములున్న దిద్దుచు
విందొనరింపంగవలయు విబుధులు కరుణ౯

టీకాసంగ్రాహకః —

అథాతో బ్రహ్మజిజ్ఞాసా ౧

ఇంక బ్రహ్మవిచారము చేయబడుచున్నది ఇంక, ననుశబ్దమువలన నింతకుమునుపు కర్మమీమాంసా ప్రశంసచేయఁబడెననియు అందు ప్రతిపాదింపబడిన కర్మ మీమాంసోదిత ఫలము అల్పంబయ్యును నస్థిర ఫలంబును నగుట తదనంతరము బ్రహ్మజిజ్ఞాస చేయంబడి యెడునని యభిప్రాయము ఇచ్చట మతభేదములు, అద్వైతమతమునందు మీమాంసా శాస్త్రము వేఱనియు, వేదాంత శాస్త్రము వేఱనియు పూర్వోక్త శాస్త్రక్రమంబున నుడు వంబడిన 48 సంస్కారములచే సంస్కృతుండగు పురుషునిచే బ్రహ్మ విచారాధికారి యగుననియు నా పిదప బ్రహ్మవిచారము చేయవలయుననియు విశిష్టాద్వైతులచే పూర్వ మీమాంస కర్మకాదంబగుటయు, దానివలన దెలియబడిన కర్మంబుల ఫలంబులు (ఓంకా రశ్చాథ శబ్దశ్చ ద్వావేతౌ బ్రహ్మణఃపురా, కంఠంభిత్వా వినిర్యాతౌ తస్మాన్మాంగళికావుభౌ అని గ్రంథారంభంబున మంగళార్థంబుగా అథశబ్ద ప్రయోగము) అల్పంబులును అస్థిరం బులునుంగావునను ఉపరిభాగంబున బలుకబడిన బ్రహ్మజ్ఞానంబు అనంతంబును అక్షయ ఫలంబునుగావున బ్రహ్మజ్ఞానము తెలిసి బ్రహ్మవిచారము చేయబడుచున్నదని సంగ్రహము ఈ విషయంబున విస్తారము ఉపన్యాసము గలిగియుండుటయున్నది శాస్త్రముచేతనే తెలియదగినదగుట యిచ్చట సంక్షేపింపబడియె ఇందు నలువది యెనిమిది సంస్కా రము లెవ్వియనిన,—

**End**

దర్శయతశ్చైవం ప్రత్యక్షానుమానే–జగన్ని యమనాదులు బ్రహ్మకర్తృక ములుగానే శ్రుతిస్మృతులు పలుకుచుండుటవలన జీవుఁడు భోగమాత్రమున కర్తుఁడుగాని అధికము లేదనుట.

భోగమాత్ర సామ్యలింగాచ్చ-సోఽశ్నుతే సర్వాన్ కామాన్ సహ బ్రహ్మణా విపశ్చి తేతి అను వడియాలంబులకలన జీవునకు భోగసామ్యతమాత్రమంటే స్వాతంత్ర్యమనుట ,

అనావృత్తిశ్శబ్దాద నావృత్తిశ్శబ్దాత్-అట్టి ముక్తుడు ఎప్పటికిని మరలరాడనుట, రెండు వాల్లు వలుకుట శాస్త్రము ముగియుననుట తెలుపబడుచున్నది.

ఇట్లు నాల్గు పాదములు ముగిసెను —

అధి 6 సూత్ర 22

(వి-వి)—

గ్రంథము వ్రాత మంచిగాను తప్పులు లేవు శైథిల్యము కడు హెచ్చు పెక్కు పత్రములు పొడిపొడియైనవి గ్రంథపాతములు శైథిల్యముచే నేర్పడినవి

వ్యాస మహర్షి ప్రణీతమగు నుత్తర మీమాంసాదర్శనమునకు సంగ్రహ రూపమగు తెలుగు వివరణమిది తిరునగరి వేంకటకృష్ణరాయలు దీని రచియించిరి ఒక్కొక్క పాదము తుదను, అద్వైత మతమునకును, విశిష్టాద్వైత మతమునకును, అధికరణ భేదముతో, అనుకూల ప్రతికూల సూత్రము లేవో పేర్కొనబడినవి ఈ గ్రంథము రక్తాక్షి సంవత్సరమున రచించినట్లు గ్రంథకర్త తెలుపుచున్నాడు అది క్రీ 1864 వ సంవత్సర మగునేమో ?

---

## No 21 2 బ్రహ్మాండ వచనము

## BRAHMĀNDA VACANAMU

Substance, palm leaf Size, 15½ × 1¼ inches Pages, 21 Lines, 6 on a page Character Telugu Condition, good Appearance, old Mode of writing, fair, free from mistakes

Complete

Purports to relate in accordance with vēdas and purāṇas, the order of the creation of the universe The author is Mācana, son of Bhairavāmātya

**Beginning**

శ్రీమన్మహాదేవుండు కైలాస శైలోపరిభాగంబునందు సుఖాసీనుండైయున్న సమయంబున సకల జగన్మాతయగు పార్వతీదేవి సాష్టాంగ దండప్రణామంబు లాచరించి లేచి నిలిచి కరకమలంబులు మోడ్చి దేవా సకల జగదుత్పత్తిస్థితిలయ ప్రకారంబులకుం గారణ కర్తలయిన మూర్తిత్రయంబెట్లు కలిగె బ్రహ్మాండ నిర్మాణం బెట్టిది

**End**

ఈ యాఖ్యానంబు వివరయేని తాత్పర్యంబునం బఠించిన వారికి సకల దురిత క్షయంబును శాశ్వత సంపదయును శతాశ్వమేధ ఫలంబులు గలుగు ఈప్సితార్థంబులు సమకూరునని నా పరమేశ్వరి యానందంబునం బొంది సకల లోకంబులు దయతో రక్షించుచుండె

**Colophon**

ఇది శ్రీనారాయణ శ్రీమహాదేవచరణ ధ్యానానంద జనసమ్మత భారద్వాజగోత్ర పవిత్రభైరవామాత్య పుత్రసూచనామాత్య నామధేయ విరచితంబైన చతుర్వేదాష్టాదశ పురాణసారంబగు బ్రహ్మాండ వచనంబు ఆచంద్రతారకంబై సకలలోక ప్రసిద్ధంబై వరగు

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

బ్రహ్మాండ నిర్మాణక్రమమిందు వేద పురాణాదుల ననుసరించి నిరూపింపబడినది ఇది వచనకృతి భైరవామాత్య పుత్రుడగు సూచన గ్రంథకర్త

---

## No. 2143 భగవద్గీత.

### BHAGAVADGĪTA

Substance, palm leaf Size, $11\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches Pages, 75 Lines, 6 on a page Character, Telugu Condition, much injured Appearance, old Mode of writing, fair but not free from mistakes.

Incomplete

This is a Telugu exposition of Bhagavadgita The name of the author is not known

**Beginning**

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ

అర్థము—ధర్మరాజాదులున్న, దుర్యోధనునివారున్ను, యుద్ధానకు ఆయత్తపడి ఉభయ దళాలున్ను మోహరించియున్నందుకు ధృతరాష్ట్రుడు తన కొలువు చావడిలో చింతిస్తుండగాను అక్కడికి వేదవ్యాసులువచ్చి ధృతరాష్ట్రుండా? నీవేల వగచెదవు? కృష్ణ డిమ్మహీభారము లణంచను అవతరించినాడు ఆ పోట్లాట రాజులకెల్లాను కాలంచేరువై ఉన్నది ఎవ్వరు మాన్పినా మానరు నానాటికి యుద్ధము నీకు తెలిపి చెప్పేటట్టుగాను, నా యనుగ్రహమువల్లను త్రికాలవేదియైన సంజయుండు నీకు తెలుపుచు వచ్చేని ఆ సంజయుని ధృతరాష్ట్రునివద్ద నేపెట్టి వేదవ్యాసుడు తమ ఆశ్రమానకు పోయెను ఆ తరువాతను ధృతరాష్ట్రుడు సంజయుని పోట్లాడిన వివరం అడుగుచున్నాడు ధృతరాష్ట్రుని వాక్యం—ఓ సంజయుండా! ధర్మక్షేత్రమైన కురుక్షేత్రమందు యుద్ధముకొరకు నిశ్చయించికూడినటువంటి కౌరవులున్నూ, పాండవులున్నూ ఏమిచేసిరి

**End**

ఇంద్రియాణి పరాణ్యాహు రింద్రియేభ్యః పరం మనః
మనసస్తు పరా బుద్ధి ర్యో బుద్ధేః పరతస్తు సః

అర్థం—ఇంద్రియాలు జ్ఞానానికి ప్రధానమైన సాధనాలని అందురు ఇంద్రియాల కంటేను మనస్సు నిలిపేది ప్రధానమందురు మనస్సుకంటేను బుద్ధి నిలిపేది ప్రధానమందురు బుద్ధికంటేను కోరిక నిలిపేది ప్రధానమందురు

(వి-వి)—

అసమగ్రము ఆరంభమునుండి మూడవ అధ్యాయము తుది దాకా గలదు వ్రాత చక్కనిది తప్పులున్నవి శైథిల్యము గలదు గ్రంథపాతములును గలవు

భగవద్గీతాయోగశాస్త్రమునకిది తెలుగు తాత్పర్య వివరణము ప్రాచీనకాలపు వారికి తెలుగులో నీ రచనము గలదు పుస్తకము చాల శిథిలముగా నున్నది కావున దీని తాత్పర్య రచయిత పేరు తెలియరాదు

---

## No 2144 భగవద్గీత

### BHAGAVADGĪTA

Substance, palm leaf Size, 16 × 1⅛ inches Pages, 32 Lines, 5 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above

(వి వి)—

అసమగ్రము ఆదినుండి మూడధ్యాయములు సమగ్రముగను నాల్గవ యధ్యాయారంభము కొంచెమును గలవు వ్రాత మంచిది. తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

పూర్వమువలె

---

## No 2145 భగవద్గీతా టీక.

### BHAGAVADGĪTA WITH MEANING

Substance, palm leaf Size, 16¼ × 1¼ inches Pages, 144 Lines 9 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and contains mistakes

Begins on fol 1 *a* The other work herein is —73 *a* Uttara gīta with meaning

Complete

A free rendering in Telugu of the Bhagavadgita. The author is Tāllapāka Tirumalayya, son of Tāllapāka Annamācāryulu. For Poets belonging to Tāllapāka family see D. No. 595 ante. Tāllapāka Tirumalayya referred to there as the author of Āndhra Vēdāntamu, Āndhra harivamsamu, etc., is probably the same as the author of the work under notice.

**Beginning**

భీష్మార్జునాదులున్ను దుర్యోధనాదులున్ను యుద్ధానకు ఆయత్తపడి ఉభయ బలములున్ను మోహరించి వున్నప్పుడు ధృతరాష్ట్రుడు తన కొడుకుల జాడలు చింతిస్తూవుండగాను అక్కడికి వేదవ్యాసులువచ్చి ధృతరాష్ట్రుడితో నీవేల వగచేవు శ్రీ భగవానులు భూభారము తీర్ప నవతరించినారు ఆ పోట్లాటకు వచ్చిన రాజుల కెల్లాను కాలము చేరువైయున్నది ఎవ్వారు మాన్పినాను మానదు ఆనాటి యుద్ధము నీకు అది గనుక చెప్పేటట్టుగాను నా యనుగ్రహము వల్లను త్రికాలవేదియైన సంజయుండు నీకు జెప్పుచువచ్చీని అని ఆ సంజయుని ధృతరాష్ట్రునివద్దనుంచి వేదవ్యాసులు తన ఆశ్రమానకు పోయెను ఆ తరువాతను ధృతరాష్ట్రుండు సంజయునితో పోట్లాడిన వివరం అడుగుచున్నాడు

ధృతరాష్ట్ర ఉవాచ—

ధర్మక్షేత్రే కురుక్షేత్రే సమవేతా యుయుత్సవః,
మామకాః పాండవాశ్చైవ కిమకుర్వత సంజయ

అర్థం—ధృతరాష్ట్రుని వాక్యం ఓయి సంజయుండ ధర్మమైన కురుక్షేత్ర మందు యుద్ధముశేయ నిశ్చయించి కూడి నటువంటి కౌరవ్యులున్ను పాండవులున్ను యేమిచేసిరి అని అడిగితేను

సంజయ ఉవాచ—

దృష్ట్వాతు పాండవానీకం వ్యూఢం దుర్యోధనస్తదా
ఆచార్య ముపసఙ్గమ్య రాజా వచనమబ్రవీత్

సంజయుండు చెప్పదొడంగెను అప్పుడు రాజైన దుర్యోధనుడు వ్యూహాకారంగా మూకగూడి వుండిన పాండవసేన జూచి ద్రోణాచార్యుల దగ్గిరపోయి వక మాట పలికెను

**Colophon:**

రెండో అధ్యాయం సంపూర్ణం ఇది తాళ్లపాక అన్నమాచార్యుల పుత్రుడు తిరుమలయ్య భగవద్గీతార్థము తెనిగించి వ్రాసెను

**End:**

తచ్చ సంస్మృత్య సంస్మృత్య రూప మత్యద్భుతం హరేః
విస్మయో మే మహా రాజన్ హృష్యామిచ పునః పునః,
యత్ర యోగేశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః
తత్ర శ్రీర్విజయోభూతి ర్ధ్రువానీతిర్మతిర్మమ

ఏ పక్షమందు యోగేశ్వరుడైన కృష్ణుడున్నాడో ధనుర్ధరుడైవుండును ?
ఆ దిక్కువారికి ఒక్కి తముస్ను జయమున్న స పదాన్న నీతిన్ని, ధ్రువమని నాయొక్క
మనస్సు గలద

**Colophon**

హరిః ఓం తత్స దితి శ్రీమహాభారతే శతసహస్రాస్యాం సంహితాయాం వైయాసిక్యాం
శ్రీభీష్మపర్వణి శ్రీభగవద్గీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీకృష్ణా
ర్జున సంవాదే సర్వోపనిషదర్థ ప్రతిపాదక మోక్షజ్ఞానయోగో నామాష్టాదశోధ్యాయః

(వి-వి )—

సమగ్రము వ్రాంత ముంపిడిగాదు తప్పులున్నవి శైథిల్యములేదు గ్రంథ
పాతము లేదు

భగవద్గీతా శాస్త్రమునకిది తెలుఁగు టీక ఇందు మూల శ్లోకములుగూడఁ
గలవు తాళ్లపాక అన్నమాచార్యుల కుమారుఁడైన తిరుమలయ్య దీనికిఁ గర్త ఈ
తాళ్లపాక యింటిపేరుగల కవులను గూర్చి డి నె 595 ఁ చూచునది అందు ఆంధ్ర
వేదాంతము ఆంధ్ర హరివంశము, చక్రవాళమంజరి శేష అకార నిర్ణయము, రచియిం
చినవానిని ప్రస్తుతింపఁబడిన వాఁడితడే యగును

---

## No 2143 భగవద్గీతా టీక.

### BHAGAVADGĪTĀṬĪKA

Substance, palm leaf Size, 16½ × 1¼ inches Pages, 22 Lines, 9 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

This is a free translation in Telugu of the Bhagavadgita The author is Sridharaswāmi, follower of Vīsnusvami's school of thought For details see extracts below

**Beginning :**

శ్లో॥ విష్ణుస్వామి అసత్పాద కంజకింజల్కరేణవే,
నమో విద్యేందిరా ధామ్నే సక్త విద్వజ్జనాశ్రయే

ఈ శ్లోకానకు తెలుగర్థం విష్ణుస్వాములనే గురువులయొక్క ప్రకాశమైన
దేవైనాను పాదపంకజాలు కలవో వాటియందున్న యేవైనాను తామరపూవుల
పుప్పొడి కలదో అందుకొఱకు నమస్కారము ఆ పాదపద్మాలు యేలాటివి అంటేను
విద్యలకు శ్రీ మహాలక్ష్మికిన్ని స్థానమైనవి ప్రేమగలిగి యెవ్వరైనా విద్వాంసులైన యోగులు
కలరో వారికి సేవచాయను యోగ్యమైనవి

శ్లో॥ శేష శేష ముఖవ్యాఖ్యా చాతుర్యం త్వేక వక్త్రతః
దధాన మద్భుతం వందే పరమానంద మాధవమ్.

అర్థము  శేషువుయొక్క సకల ముఖాలచేతనున్న వ్యాఖ్యానంచేసేటి ఆ చాతుర్యంకలదో ఆ చాతుర్యమును అంగాను ఒక్క ముఖంచాతనే ధరించువాడున్న ఆశ్చర్యకరమైన రూపంకలిగిన పరమానందమాధవులకున్నూ నమస్కారము చేసేను

శ్లో॥ శ్రీమాధవం ప్రణమ్యోమాధవం విశ్వేశమాదరాత్,
తద్భక్తియన్త్రితః కుర్వే గీతా వ్యాఖ్యాం సుబోధినీమ్

* * * *

శ్లో॥ భాష్యకారమతం సమ్యక్ తద్వ్యాఖ్యాతృగిరస్తథా
యథామతి సమాలోచ్య గీతా వ్యాఖ్యాం సమారభే

* * * *

గీతా వ్యాఖ్యాయతే యస్యాః పాఠమాత్ర ప్రయత్నతః
సేయం సుబోధినీ టీకా సదా ధ్యేయా మనీషిభిః

* * * *

ఈ లోకమందున్న సకల లోకాలకున్నూ హితవు చేసే నిమిత్తము అవతారము ధరించి పరమ దయాపరుండైన షడ్గుణ సంపన్నుండైన దేవకీ పుత్రుండైన కృష్ణభగవానులు తత్వజ్ఞానంయొక్క యెరగని ఆధిక్యంచాతను నాశం చాయబడిన దుఃఖమున్నూ అజ్ఞానం కలిగిన ఆ అజ్ఞానంచాతను నశ్వమైన వివేకంకలిగిన అందువల్లను తనకు విహితమైన ధర్మమును విడిచిపెట్టి పరులయొక్క ధర్మమును ఆచరించేను అని బుద్ధి గలిగిన అర్జునుణ్ణి ధర్మజ్ఞానరహస్యోపదేశంచాతను అన తెప్పచాతను ఆ శోకమున్నూ మోహమున్నూ అనే సముద్రంవల్లను తరింపజేసినవాడు అయెను ఆ భగవానులు చెప్పిన అర్థమును వ్యాసులు యేణ్నూరు శ్లోకాలచాతను చెప్పినవాడాయెను

**End**

ఏషా బ్రాహ్మీ స్థితిః పార్థ నైనాం ప్రాప్య విముహ్యతి
స్థిత్వాస్యామన్తకాలేపి బ్రహ్మ నిర్వాణ మృచ్ఛతి

ఓ అర్జునా! బ్రహ్మజ్ఞాని ఈలాగున ఉండి మోహపడడు మృత్యుకాలమందు సహితం ఈ బ్రహ్మజ్ఞాననిష్ఠయందు ఉన్నవాడు మోక్షమునే పొందును

**Colophon** ·

ఇది శ్రీ భగవద్గీతా టీకాయాం శ్రీధరస్వామి విరచితాయాం సుబోధిన్యాం సాంఖ్యయోగో నామ ద్వితీయోధ్యాయః

శోకపంకనిమగ్నం యస్సాంఖ్యయోగోపదేశతః
ఉజ్జహారార్జునం భక్తం స కృష్ణశ్శరణం మమ

(వి-వి)—

అసమగ్రము ఆదినుండి ద్వితీయాధ్యాయము తుదిదాక గలదు వ్రాత చక్కనిది తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

భగవద్గీతా శ్లోకములు కిది తెలుగు టీక విష్ణుస్వామి మతసంప్రదాయము వాఁడగు శ్రీధరస్వామి దీనికిఁ గర్త విశేషములకు వ్యాఖ్యాతగ్రంథ భాగముఁ జూచునది.

---

## No 2147. భగవద్గీతా టీక

## BHAGAVADGĪTĀ WITH MEANING

Substance, palm leaf Size $9\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 396 Lines, 6 on a page Character, Telugu Condition, much injured Appearance, old Mode of writing, bad and contains mistakes

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము గలదు గ్రంథపాతములు గలవు

పూర్వసంకేత

---

## No 2148 భగవద్గీతా భాష్యము

## BHAGAVADGĪTĀBHĀSYAMU

Substance, paper Size, $12_8 \times 8\frac{1}{2}$ inches Pages, 140 Lines, 23 on a pag Character, Telugu Condition, good Appearance, old Mode of writing, good but not free from mistakes

Complete

This is an elaborate commentary to the Bhagavadgīta The author is Mādhavakavi, son of Girimaranamantri and a pupil of Kidāmbi Venkaṭacārya The work has been dedicated to Śrī Rāma of Bhadrādri

**Beginning**

వ సమర్పితంబుగా నాయొనర్పంబూనిన భగవద్గీతాసారంబునకుఁ గథాక్రమం బెట్టిదనిన, జనమేజయునకు వైశంపాయనుండిట్లనియె పుణ్యక్షేత్రంబైన నైమిశారణ్యం బునకు శౌనకుండను మునీంద్రుండు బ్రహ్మర్షిగణసమేతుండై ఉపాసితుండై ద్వాదశ వర్షంబులు భగవదర్పితంబుగా సత్రయాగంబు సేయుచుండ నచ్చటికి రోమహర్షణ పుత్రుండైన పౌరాణికుండరుగుదేర

* * * *

శా క్షోణీనాథకులాగ్రగణ్యువిను మీక్రూరాత్ముఁడైనట్టిమీ
సూనుండాయమసూనుసేనలఁగడుఁబాజోద్యంబుగా సంగర

ష్టించగా చిదరంబులోపలను స్తోత్ర్యఘాత్కుడై కైరతా
ద్రోణాచార్యుని కేటబోయి పలికెన్ దోరంస నెయ్యంబునన్

ఉ భూరివివేకశాంతిలిట భూపతి బాహుబలంబు పెంపుచే
సారముగల్గియున్నది ప్రశస్తము పాండవసేనయందులన్
వీరులు మత్స్యవల్లభులు నెయ్యముగా ద్రుపదక్షితీశులున్
వారావిక్రముండగును దారుణు శైబ్యుడు ద్రౌపదేయులున్

**End**

గీ కృష్ణుడర్జునునకుంగృపతోడజూపిన విశ్వరూపమెవ్వేడుచు
కతన హర్షమొదవగలిగియున్నదినాకు జూడబూన్వి జన్మ సుకృతము

వ అని సంజయుండు చెప్పిన ధృతరాష్ట్రుండు విని పరమ హర్షాంకురితుండయ్యెనని శౌనకాదులు సాంద్రానందచేతస్కులైరని జనమేజయునకు వైశంపాయనుండెఱింగించుటయు

మ లిని

దశముఖకరిసింగా దాసహృత్పద్మభృంగా
కుసుమశరసమాంగా ఘోరసంతాపభంగా
వసుధతనయసంగా వ్యాళవైరీతురంగా
యసురహితపతంగా యంఘ్రిజాతాభగంగా

**Colophon**

ఇది శ్రీభద్రాద్రి రామభద్ర ప్రసాదలబ్ధ కవితా విచిత్ర గిరిమనమంత్రిపుత్త్రి కిడాంబి వేంకటాచార్య కరుణాకటాక్షదక్ష భగవద్భాగవత కృపావిధేయ మాధవనామధేయ ప్రణీతంబైన భగవద్గీతా భావ్యంబగు యోగశాస్త్రింబునందు సర్వంబును చతుర్థాశ్వాసము

గ్రంధాంతమందీ వ్రాతగలదు —

"విశ్వావసు సంవత్సర జేష్ఠ బ 10 లుకు సరి అయిన 1845 వ సంవత్సరం జూన్ 29 వ తేదిని కస్తూరి రామదాసుకు కడప క్రిష్టమ్మ వ్రాసియిచ్చిన భగవద్గీతా భావ్యం సంపూర్ణం

(వి-వి)—

సమగ్రము కృత్యవతరణికలేదు వ్రాతపంచది తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

భగవద్గీతా యోగశాస్త్రమునకిది పద్యగద్యాత్మకమగు విస్తృత వివరణము గిరిమన మంత్రి పుత్రుడును, కిడాంబి వేంకటాచార్యుని శిష్యుడునగు మాధవకవి దీనికి కర్త. భద్రాద్రి శ్రీరామదేవునకిది సమర్పితము

## No 2149 భగవద్గీత (వచనము)

## BHAGAVADGĪTĀ (PROSE)

Substance, palm leaf Size, 8 × 1½ inches Pages, 242 Lines, 6 and 7 on a page Character, Telugu Condition injured Appearance old Mode of writing fair but not free from mistakes

Begins on fol 114 *a* The other work herein is —237 *a* Vaisnavatvanirūpanamu

Complete

This is a free rendering in Telugu prose of each verse of the Sanskrit Bhagavadgita The author is Tupākula Anantabhūpāla He is the author also of the Telugu Bhārata, and the work under notice forms a portion of Bhismaparva

**Beginning**

క శ్రీరమణీహృదయ ప్రియ నాళీకపత్రాయతాక్ష సకలాధ్యక్షా
భూరికరుణావిలాసా శ్రీరాజతచుక్కణజా శ్రీగోపాలా

వ ఆవధరింపుము ఉపనిషద్దివ్యచరిత్రాతిశయ ప్రకాశంబైన శ్రీమహాభారతంబున భీష్మపర్వంబునందు కౌరవశ్రేష్ఠుండైన ధృతరాష్ట్రునకు వ్యాస వరప్రసాదలబ్ధ దివ్య జ్ఞానసంపన్నుండగు సంజయుండు భూగోళ విస్తారంబును జంబూద్వీప విస్తారంబును

*   *   *   *

యుద్ధంబు శాయంబగానియ స్వజనంబులఁ జూచిన నాకర చరణాద్యవయవంబులు తడబడుచున్నవి వదనంబు శోషిల్లుచున్నది నా మేన కంపంబును రోమాంచంబును బొడముచున్నది గాండీవంబు హస్తంబుననుండి జారుచున్నది దేహంబు పరితపించుచున్నది

**End**

రాజేంద్రా కేశవార్జునులకు నడచిన యద్భుతంబగు నీపుణ్య సంవాదంబు దలంచి తలంచి మఱియు మఱియు సంతోషించెద రాజోత్తమా! అద్భుతంబైన హరివిశ్వరూపంబు దలంచి తలంచి అత్యాశ్చర్యంబున మాటిమాటికి నానందంబునొందెద యోగీశ్వరుండైన కృష్ణుండును ధనుర్ధరవర్యుండైన యర్జునుండును నెచ్చటనుందురు-అచ్చట ఐశ్వర్యంబును జయంబును దిగంత విశ్రాంతంబైన కీర్తియు నీతియు శాశ్వతంబుగనుండునని నిశ్చయంబు

**Colophon**

ఇది శ్రీమన్మహాభారతంబున భీష్మ పర్వంబునందల భగవద్గీతా శాస్త్రంబునందు కృష్ణార్జున సంవాదంబునందు సకల శాస్త్ర నిర్ణయ మోక్షయోగంబన్నది పదియెనిమిదో అధ్యాయము

ఉ నీరదనీలగాత్ర రజనీచరగాత్ర విభేదవాదరో
దార చతుర్భుజాన్విత సుదర్శన శంఖగదాబ్జ సర్వబృం
దారక బృందవందిత పదద్వయ దివ్యకిరీటహారకే
యూర రవిభూషితాంగ సుగుణోన్నత సన్మునిజాల సన్నుతా ।

క వారిధికన్యాకుచకలశోరుపరీరంభజృంభ కోజ్జ్వలముక్తా
హారాంచిత వక్షస్థల శ్రీరమ్యకృపాలవాల శ్రీగోపాలా ।

మాలిని - దివిజ సవనఫలిం

దశసాధితారాతిపక్షా

**Colophon**

ఇది శ్రీమదుభయభాషా కవిమిత్ర చంద్రగిరి కృష్ణవరే ప్ర తల్పకల సంజాత కుమార చంద్ర విమలయశోవిశాల తుపాకుల అనంతభూపాల ప్రణీతంబైన భగవద్గీతా వచన కావ్యంబునందు సర్వంబునేకాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాతయంచి తప్పులంతగా లేవు శైథిల్యము గలదు గ్రంథపాతములు లేవు

మహాభారతమున భీష్మపర్వాంతర్గతమైన భగవద్గీతా శాస్త్రమునకిది తెలుగునేత తుపాకుల అనంతభూపాలుడు దీనికి కర్త ఆతని భారతాంధ్రీకరణమున నిది యేక దేశము ప్రతి శ్లోకమునకు విడివిడిగా టీకగాక యిది మొత్తముగా మూలార్థము విడువకుండజేయబడిన వచన కావ్యరచన గ్రంథముతొలుత మూల భగవద్గీత (శ్లోకములు) గలదు

237 a వైష్ణవత్వ నిరూపణము

---

## No 2150 భగవద్గీతా శాస్త్రము

## BHAGAVADGĪTĀ ŚĀSTRAMU

Substance, palm leaf Size, 17½ × 1¼ inches Pages, 89 Lines, 7 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

This is a Telugu rendering in prose and poetry of the Bhagavadgīta in Sanskrit The author is Dattōjipandita, a resident of Vēmugallu. He was a pupil of Narasimhadēvaguru, a follower of the philosophical system of Visnusvāmi (Vallabhācārya ?) Gāyamāmba and Nāgōjipandita were his parents

(వివి)—

సమగ్రము ప్రాంతపక్కపిది తప్పులున్నవి శైథిల్యము కొలదిగాకలదు గ్రంథపాతములు లేవు

భగవద్గీతా శాస్త్రమునకు వేముగంటి దత్తోజీ పండితుడు చేసిన పద్యగద్యాత్మక మగు తెలుగు సేతయిది గ్రంథకర్త విష్ణుస్వామి (వల్లభాచార్య ?) మతసంప్రదాయ ప్రతిష్ఠాపనాచార్యుడగు నరసింహదేవ గురువరేణ్యుని శిష్యుడు. వేముగల్లు పరవాస్తవ్యుడు ఆపస్తంబ సూత్రుడు హారీతగోత్రుడు గాయత్రాంబా నాగోజీ పండితుల పుత్రుడు

---

## No 2151. మనోబోధ

## MANŌBŌDHA

Substance, palm leaf Size, 15⅞ × 1⅝ inches Pages, 20 Lines, 6 on a page Character, Kanarese Condition, injured Appearance, very old Mode of writing, not good and not free from mistakes

Begins on fol 106 *b* The other works herein are —Caturvēda-sāramu 1 *a*, Śivastavamu 74 *b*, Lakṣmaiyagārivacanamulu 77 *a*

Complete

The greatness of Śiva and devotion to him are described herein. The author is Ganapanārādhya

**Beginning**

శ్రీపార్వతీనాథు శ్రీనాథనాథు
నలినసంభవ నాథు నలినాప్తనాథు
ముక్తికాంతానాథు మునిమనోనాథు
సురుచిరగణనాథు సురనాథనాథు
భక్తసాగరచంద్రు పరమయోగీంద్రు
* * * *
నిఖిలలోకాధారు నిరుపమాకారు
మనసా ! తలంపుమీ మాయలం బడక
మాయచే జగములు మాయమైయుండు

**End**

భక్తులం బూజింపు భక్తుంగొలువు
భక్తులందు శివుండు ప్రమథులు దాను
బాయకెప్పుడు నుండు బరమార్థమిదియ
నా బోధవిని భక్తి నైష్ఠికంబునను

భక్తానుభవమునఁ బ్రదుకవే మనసా
అని మది బోధించె నను రాగ నుఱర
భరము ? యోగీంద్ర పాదారవింద
పరిమళస్యంద సద్భ్రమరుఁడు పుణ్యుఁ
యనైఅంగని యీ మానసమున
విజ్ఞానగుణముల వెలయబోధించి
మదమె మహిమాన్వయుఁడు
ఉర్వీపైఁగాంతా సహోదరుండనగ
గణపనారాధ్యులం గరుణించు శివుఁడు
ఆచంద్రతారార్కమైయొప్ప భక్తి
వెలయు మనోబోధ వేడ్కమై జెప్పె
నీ బోధజదివిన నైలమిమై విన్నఁ
పరియింప వ్రాసిన భక్తియయుక్తి
భుక్తియు ముక్తియు భూతేశుఁ డొసగు

(వి-వి)—

సమగ్రము వ్రాతఁబుంబిదిగాదు తప్పులున్నవి శైథిల్యముగలదు గ్రంథ పాతములు గలవు

ఇది శైవవేదాంత గ్రంథము మంజరీరచనము గ్రంథకర్త గణపనారాధ్యుడు

గ్రంథాంతమందీ క్రింది శ్లోకములు గలవు

శ్లో॥ అశ్వీకృత శ్వీకృత వేదరాశి రస్త్రీకృత స్త్రీకృతదానవారిః ।
అస్వీకృత స్వీకృత శంబరారిః పాయాత్స్వవో దైవత సార్వభౌమః ॥
ఋగ్వేదే వేద్యసోమః పవత ఇతిమనా సర్వగీర్వాణతాత
మావో రాజానమంత్రే సురనరగణ పూజ్యం యజుర్వేద వేద్యే ।
త్వందే వేతాఖ్యమంత్రే విధువిధిషువరం సామవేదప్రపద్య
ఈ శానాదావ థర్వశ్రుతి చరమమనా చింత్యమేనం నమామి ॥

శ్లో॥ యస్యాసీద్భువ పురోగృహం చగృహజాయస్యాబలా లోచనం
యస్యయస్య గృహంగృహాంతరం చరోయస్యాత్త జన్మాభవేత్ ।
తత్స్వావ్యాసన శత్రులాంధనరు చేష్టస్యాంబకం యత్పదే
తత్పాదాంబు జమేవపాతు సతతం శ్రీ చిక్కభూమీ భుజమ్.

ఇంకవలి గ్రంథాంతరములు—

1 *a* చతుర్వేదసారము, 74 *b* శివస్తవము, 77 *a* లక్ష్మయ్యగారి వచనములు

## No 2152. మనోబోధ

## MANŌBŌDHA

Substance, palm leaf Size, 8 × 1¼ inches Pages, 54 Lines 5 on a page Character Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

A work on Śaiva system written in Manjaribhetle by Ganapınārādhya

**Beginning**

శ్రీ పార్వతీనాథు శ్రీనాథనాథు
నలిన సంభవనాథు నగవైరినాథుఁ
ముక్తికాంతానాథు మునిమనోనాథు
సుకవిరగణనాథు సురనాథనాథు
నా మనోనాథుండు నా మనోహరుఁడు
నా పాలిదైవంబు నా గురుస్వామి
భక్తి సాగర చంద్రుఁ బరమయోగీంద్రు
నణిమాది గుణశీలు నా నందలోలు

* * * *

మనసున దలఁపు మా మాయలఁబడక
మాయచే జగములు మాయచూచుండు
మాయచే జిత్తంబు మలినమైయుండు
మాయచే పాపంబు మధురమై యుండు

**End.**

భస్మాంగరాగుండు పరమేశ్వరుండు
కర్మవినాశుండు గౌరీశ్వరుఁడు
వటమూల శయనుండు వామదేవుండు
ఇట్టి మహాదేవు నెఱుఁగని మనస
శివభక్తి మంతుల శివుఁడని నమ్మ
మది మది బొందించి నానందమలర
పరశివయోగీంద్ర పాదారవింద
పరిమళస్యందన భ్రమరపుణ్యుండు
కందర్పుఁడను కరికదలసి ?
మంటలనడచు నమ్మహీ మాన్పదుండు
నుర్విపై గాంతా సహోదరుండైన
గణపతారాధ్యులం గరుణించి భక్తి
వెలయ మనోబోధ వేడ్కతోఁ జెప్పె.

గ్రంథాంతమందీ వ్రాఁతగలదు—

"దుర్మతినామ సంవత్సర భాద్రపద బహుళ 3 సో వర్కు మనోబోధ ప్రతిని ఉన్న క్రమాన సంపూర్ణం శ్రీ శ్రీ రాపూరి రామలింగస్వామీ రక్షింపుమీ ।" తుదినీతుమ్మెదపాట నాలుగాకులలో గలదు

శ్రీకంఠుడను పూవుతుమ్మెదా, మూడు
లోకము లాయెను తుమ్మెదా
సాకారమైవుండు తుమ్మెదా పర
మైకాంతమునజూడు తుమ్మెదా
శివశివ యనమేలు తుమ్మెదా శివయ
నంగవిన్నమేలు తుమ్మెదా
శివుని భక్తులకు తుమ్మెదా శివ
శరణన్నమేలేవో తుమ్మెదా ।

* * * *

గురుడునీశిరమున తుమ్మెదా మా
గురుడూనీ శిరమూన తుమ్మెదా
కరకర్మములు మోపి తుమ్మెదా
ఒరయ యేగంటీశుడు తుమ్మెదా
శివ శివయన మేలు తుమ్మెదా శివుడ
నంగవిన్నమేలు తుమ్మెదా
శివుని భక్తులాకు తుమ్మెదాం శివ
శరణన్నమేలేవో తుమ్మెదా ।

(బి-బి)—

సమగ్రము వ్రాంతమంచిది తప్పులుగలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

శైవవేదాంత ప్రతిపాదకమగు మనోహర మంజరీరచనమిది గణపనారాధ్యులు రచియించినది

---

## No 2153. మహావాక్య ప్రకరణము

## MAHĀVĀKYA PRAKARANAMU

Substance, palm leaf Size, $16\frac{1}{4} \times 1\frac{1}{2}$ inches Pages, 18 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old. Mode of writing, fair but not free from mistakes

Begins on fol 30 *a* The other works herein are —1-*a* Uttaragītā vyākhyānamu, 25-*a* Paramānandabōdhaprakaranamu

Complete

This appears to be a chapter of a work on advaita vēdānta The author is a disciple of Vāsudēvayati

**Beginning :**

యస్య ప్రసాదాదహమేవ తత్త్వం
బ్రహ్మైవజానాతి నిరస్తమోహః ॥
తమేవనిత్యం విభుమాత్మ తత్త్వం
శ్రీ వాసుదేవం శిరసానతోస్మి

ఈ లోకమందు ఒకానొక అధికారి అనేక జన్మాలయందు ఈశ్వరార్పణచేసిన నిత్యనైమిత్తిక కర్మాలచేతనున్ను, సగుణోపాస్తిచేతనున్ను, శుద్ధాంతః కరణుడైనషు వంటివాడై ఈ మనుష్యలోకము మొదలు చేసుకుని బ్రహ్మలోకము పర్యంతమున్నూ అనిత్యము దుఃఖ స్వరూపము అని యెఱిఁగి ఈ జనన మరణ ప్రవాహ రూపమయిన సంసారంవలన నండిన్నీ భయపడ్డవాఁడై నిత్యానిత్య వస్తువివేకం ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వము అనియేటి నాల్గు సాధనాలతో గూడుకొన్నవాడై కానుక చేతబట్టుకొని వేదాంతశాస్త్రజ్ఞుండై అనుభవనిష్ఠుఁడై శాంత నిధియైన సద్గురువును శరణుపొంది సాష్టాంగ ద్వాదశ నమస్కారాలుచేసి అడుగు చున్నాఁడు

**End :**

ఇటువలె గురువులవారు హస్తస్పర్శచేసి శిరస్సుపై తమ హస్తముంచి పూర్ణానుగ్రహముచేసిరి అటు తర్వాతను శిష్యుడు బాహ్యాల మఱచి అనేక తడవకు కన్నులు తెఱచిచూచి దిగ్గనలేచి గురుస్వాములకు అనేక సాష్టాంగ దండములుచేసి విజ్ఞాపన చేస్తున్నాడు హేస్వామిన్ నేను కృతార్థుడనయితిని నాకు మోహనివృత్తి అయెను, అని విజ్ఞాపన చేసుకున్నవాడాయెను అటు గనుక ఈ నాలుగు మహావాక్యాలయొక్క వివేకం యెప్పుడు విన్న, చదివిన, వ్రాసిన, తలంచిన అర్థం విచారించిన యెటువంటి మందుడైనవాడైన కృతార్థులైపోదురు

యత్కృపాలవలేశః ప్రాప్తా మయా బ్రహ్మైకతాత్మన ॥
తంవందే వాసుదేవేంద్ర దేశికేంద్ర మహామునిం

మహావాక్య ప్రకరణం సమాప్తము

(వి-వి )—

సమగ్రము వ్రాఁతతిన్నదిది తప్పులున్నవి ప్రాచీన్యము లేదు. గ్రంథ పాఠములు లేవు

అద్వైత వేదాంత బోధకమగు నీ గ్రంథము పేరేదో యెఱుంగరాదు. అట్టి గ్రంథ ములోని ప్రకరణ మొకటి యిది కాఁదగును వాసుదేవ యతి గ్రంథకర్త గురువు ఇది వాడుక తెలుఁగు రచనమునఁ గలదు

ఇందలి గ్రంథాంతరములివి :—

1 *a* ఉత్తర గీతాటీక, 25 *a* పరమానంద బోధ ప్రకరణము.

## No 2154. మహావాక్య వివేక టీక.

## MAHĀVĀKYA VIVĒKA TĪKA

Substance, palm leaf Size $17\frac{1}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 7 Lines, 6 on a page
Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair, and free from mistakes

Begins on fol 5 *a* The other work herein is —1 *a* Śukāṣṭakatīka

Incomplete

A work on advaita being a Telugu rendering of the same work in Sanskrit It contains also the Sanskrit original

**Beginning .**

వృత్తి అజ్ఞాన కార్యం గనుక ఆ బ్రహ్మజ్ఞానవృత్తి నశించగానే ఆ వృత్తి ప్రతిబింబ చైతన్యము, ప్రత్యగాత్మయందు కలశింది, గనుక అప్పుడు ఆత్మపర్ణితుడుగానే ప్రకాశిస్తున్నాడు 5 ఓయి ప్రత్యక్షంగా అనుభవింపబడే సంసారము అసత్తు అని సాధిస్తున్నాడు.

సంసార స్స్వప్నతుల్యోహి రాగద్వేషాది సంకులః
స్వకాలే సత్యవద్భాతి ప్రబోధే ఽ సత్యవద్భవేత్

రాగద్వేషాది సంకులః, రాగద్వేషాదులతో కూడుకొనివుండేటటువంటి, సంసారః, సంసారము, స్వకాలే, స్వకారణమైన అజ్ఞాన కాలమందు, సత్యవత్, సత్యమైన దానివలెనే, భాతిహి, తోచుచున్నదిగదా! ప్రబోధే, గురువేదాంత వాక్య శ్రవణంవల్ల జ్ఞానం పుట్టుచునుండంగాను స్వప్నతుల్యః స్వప్నంతో సమానమైనదై, అసత్యవత్, అసత్యమైన దానివలెనే భవేత్, అవుతున్నది

**End .**

దృశ్యమానస్య సర్వస్య జగతస్తత్త్వ మీర్యతే, బ్రహ్మశబ్దేనేతి—దీనికి అర్థము—దృశ్యమై మిథ్యాభూతమైనటువంటి ఆకాశాది జగత్తుకు పారమార్థిక స్వరూపమై దానికి అధిష్ఠాన భూతమై జగత్తు బాధింపబడ్డప్పటికిన్నీ తాను బాధింపబడనిదై సచ్చిదానంద స్వరూపమైనట్టి యేవస్తువు కలదో ఆ వస్తువు శబ్ద బ్రహ్మముచేత చెప్పబడుచున్నది బ్రహ్మశబ్దమునకు అర్థముచెప్పి వాక్యార్థము చెప్పుచున్నారు తద్బ్రహ్మ! స్వప్రకాశాత్మ రూపకమితి, దీనికి అర్థము—ఈ చెప్పబడ్డటువంటి లక్షణముగలిగిన బ్రహ్మము స్వప్రకాశుడైన ఆత్మస్వరూపముగా కలిగినది ఆ బ్రహ్మమే స్వప్రకాశ స్వరూపుడైన ఆత్మని అర్థము ఇతి శ్రీ మహావాక్య వివేకస్సమాప్తః॥

గ్రంథాంతమందీ వ్రాతగలదు —

"పార్థివసం॥ ఫాల్గున శు 2, శుక్రవారాన కస్తూరి గవతన్న స్వంతంకు శ్రీకృష్ణార్పణంగా వ్రాసుకొన్నైన."

(వి-వి)—

ఆసమగ్రము గ్రంథారంభమునఁ గొంతభాగము లేదు—వ్రాఁత మంచిది. తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

మహావాక్య వివేకమను సంస్కృత వేదాంత గ్రంథమునకిది తెలుఁగు సేత-మూలము కూడ నిందుఁగలదు—ఉపనిషత్తులలోని తత్త్వబోధక వాక్యములు క్రమమునఁ గూర్పఁబడినవి ఇది అద్వైత వేదాంత ప్రతిపాదకము

---

## No 2155. మాయానిరాలంబ మంజరి.

## MĀYĀNIRĀLAMBA MANJARI

Substance, paper Size, 11¾ × 7½ inches Pages, 52 Lines, 20 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 103 *a* The other works here in are —1 *a* Rajasē kharavilāsamu, 49 *a* Sānkhyavicāramu, 65 *b* Vēdāntavārtikamu, 132 *b* Candrahāsavilāsamu

Complete

The state of Yōga in which even the activities of mind are suspended is described in this as explained in the systems of Sānkhya and Yōga The author is Rāmakrsna kavi, son of Laksmamma and Venkatācalam He has dedicated the work to Subrahmanyaguru of Penuparti at whose instance he wrote the work

**Beginning**

శ్రీ పెనుపర్తి కులసింధు సితకరుఁడు
పాపసంహరుఁడు సుబ్రహ్మణ్యగురుని
శ్రీపాదపద్మముల్ చిత్తాన నిలిపి
యేపారఁ బ్రణమిల్లి యొలమిఁ బూజించి

* * * *

అట్టి శ్రీ గురునాజ్ఞ నౌఁదల నునిచి
పట్టుగ నిరాలంబపదవియు మఱియు
సహజామనస్కంబు సమమగుఁగాన
సహజంబుగా బుధసద్వాక్య ఫణితి

* * *

వరకందికంట్యాఖ్య వంశపావనుఁడు
పరగ లక్ష్మమ్మకుఁ బౌత్రుఁడు మఱియు
నమర వేంకటచలమాంబ పుత్రుండు
రామకృష్ణము కవి రచియించె వెలయ

శ్రీలీల ద్విపదగా శ్రీగురువాజ్ఞ
నాలించి వినరయ్య యాత్మానుభవులు

**End**

ఆశాపాశంబుఁ జెందనతఁడె జీవుండు
ఆశఁ దెంపని వాఁడు నతఁడె జీవుఁడు
గాన మహావాక్య క్రమమిది ప్రత
పూని మననము చేసి గాంచు మోక్షంబు
లాలితం బౌనిరాలంబోపనిషతు
నాలీల సహజామనస్కరాజంబు
పరగ మహావాక్య పద్ధతు లెలమి
వినుతింప వ్రాసిన వినినఁ జదివినను
ఘన పఠనమననంబు పరగఁ జేసినను
ఆరయ జీవన్ముక్తి యనుభవంబగుచు
పరశివ రూపుఁడై పరగ విదేహ
కైవల్యప్రాప్తిని గ్రక్కునఁ జెంది
తవిలి సంపదలచేఁ దనియుదు రెలమి
సనిస్సద్గురు స్వామి యాత్మానుభవము
వినుపడ నిరాలంబ పదవిబోధింప
నిశ్చయభక్తులు ఇనుమడిగానఁగ

* * * *

పరగ సుబ్రహ్మణ్య బ్రహ్మంబు పేర
సర్వశూన్యంబైన సహజామనస్క
మరియు నిరాలంబమంజరియనఁగ
స్థిరమతి ద్విపదగా శ్రీ గురుపేర
వరకంది కంట్యాఖ్య వంశపావనుఁడు
పరగ లక్ష్మమ్మకుఁ బౌత్రుండు మఱియు
నమర వేంకటచలమాంబ పుత్త్రుండు
రామకృష్ణమ్మిది రచియించినదియు
ధరలోన నాచంద్రతారార్కముగను
వరగురుకరుణచే వర్ధిల్లుఁగాత !

(పి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

సాంఖ్యాది యోగములలోని యమనస్క యోగమునుగూర్చి వివరణమిందుఁ గలదు లక్ష్మమ్మకు మనుమఁడు వెంకటాచలమునకుఁ గుమారుఁడగు రామకృష్ణ కవి ద్విపద

రూపమున దీనిని రచియించెను నిరాలంబో కనిపత్తు దీనికి మూలము షెపకర్త పు బ్ర
హ్మణ్య గురుడు దీనికి ప్రేరకుడు ఈ కృతితదంకితముగా రచితమయ్యెను

ఇందలి గ్రంథాంతరములు —1a, రాజశేఖరవిలాసము 49a, సాంఖ్య
విచారము 65b, వేదాంతవార్త్తికము 132b చంద్రహాస విలాసము

---

## No 2156. మిశ్రార్పణము

## MIŚRĀRPAṆAMU

Substance, palm leaf Size 15 × 1⅜ inches Pages 16 Lines 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, bad and full of mistakes

Complete

The six kinds of Lingas and the different methods of dedication thereto according to Virasaiva system are explained in this The author is said to be Cennabasavēsvara , the work is addressed to Kūdali Sangamēsvara

**Beginning**

షట్స్థల బ్రహ్మమొకటిగా గూడెననగ నది యెవ్వరికినందదు అర్పిత అనర్పితమని
వొప్పకోవలశివచ్చెంగాక అర్పితములోని అర్పితమెట్లెగ్గి అకురాలిన నివృత్తి నిజలిం
గైక్యము యొక్క యిథము అది యెట్లానయ్యా అంటేను అంగము యొక్క హస్తము
ముట్టి క్రియార్పణ చేసేటపుడు భోజ్యం ఆచార లింగమందు పానీయం గురులింగమందు
భక్ష్యంశివలింగమందు చోష్యం జంగమలింగమంద లేహ్యం ప్రసాదలింగమందు ఇటు
అన్నిటియందు రొంటుక మహాలింగమందు ఇది కాయార్పణ

**End**

వాచాతీతం మనోతీతం భావాతీతమగోచరమ్
సర్వశూన్యం నిరాకారం నిత్యత్వం పరమంపదమ్

అనేకనుక ఆదిశూన్యమధ్యశూన్య అంత్యశూన్య నిరామయమ్ । సర్వశూన్యం
నిరాకారం నిశ్శబ్దం బ్రహ్మముచ్యతే అనే వాక్యానికి యెడలేక నిరవయవస్థలమునందు
స్థిరమయి యేకీకరించివుండి అటువంటి ఘన శివయోగి అభేద్యభేదక అసాధ్యసాధక
చిద్రూపచిదానంద యిటువంటి శివయోగి మహాశరణుడు ప్రభుదేవరి బసవన్న యొక్క
కరుణచేత నేను బ్రదికితినయ్యా కూడలిచన్నసంగమ దేవయ్యా చెన్నబసవేశ్వర
దేవర నిరూపించిన మిశ్రార్పణం సంపూర్ణం—శ్రీమద్గురు బసవ లింగాయనమః—

(వి-వి )—

సమగ్రము వ్రాంత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము గలదు గ్రంథ
పాతములుగలవు

షట్స్థలలింగములును, ఆరదు అర్పణ భేదములును, వీరశైవ సంప్రదాయాను సారముగా నిందు వివరింపబడినవి దీనికి కర్త చెన్నబసవేశ్వరుడట ! ఇది కూడలి సంగమేశ్వర దేవరను సంబోధించునదిగానున్నది

తుది రెండు పుటలలో శివునిమీఁది మంగళహారతి కలదు

---

## No. 2157. మిశ్రార్పణము

### MISRĀRPANAMU

Substance, palm leaf Size, $16\frac{1}{2} \times 1\frac{3}{4}$ inches Pages, 13 Lines, 6 on a page Character, Telugu Condition good Appearance, new Mode of writing, good but not free from mistakes

Begins on fol 21 *a* The other works herein are —1-*a* Ātmadarśanamu, 10 *a* Jīvēsvaranirnayamu, 14 *b* and 28 *a* Kīrtanalu, 17 *a* Sītārāmānjanēyamu, 49 *a* Jivēsvarasamvādamu, 55 *a* Dandakamu, 59-*a* Dvādaśamañjarikāstōtramu, 67 Parabrahmasakalavilaksanatva nirnayamu

Complete

Same work as the above

(వి-వి)—

పుస్తకము వ్రాఁత తిన్ననిది తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు

పూర్వమువలె

ఇందు గ్రంథాంతరములు కలవు—

1 a ఆత్మదర్శనము 10*a*, జీవేశ్వర నిర్ణయము 17*a*, సీతారామాంజనేయము 14*b*, 28*a*, కీర్తనలు 49*a*, జీవేశ్వర సంవాదము. 55*a*, దండకము 59*a*, ద్వాదశమంజరికాస్తోత్రము 67*a*, పరబ్రహ్మ సకలవిలక్షణత్వ నిర్ణయము

---

## No. 2158 మిశ్రార్పణము

### MIŚRĀRPANAMU

Substance, palm leaf Size, $9\frac{3}{4} \times 1\frac{1}{2}$ inches Pages, 8 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and full of mistakes

Begins on fol 1 *a* The other works herein are —5 *a* Pramathaganamālika (Basavapurāna), 18 *a* Śivakīrtanalu

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము ప్రాంతే మంచివిగాదు [illegible] శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

పూర్వముద్రిత

ఇందే గ్రంథాంతరములు కలవు —5 a ప్రమద గణమాలిక (ఆపద పురాణము), 18 a శివ కీర్తనలు

---

## No 2159 మిశ్రార్పణము

### MIŚRĀRPAṆAMU

Substance, paper Size, 12⅜ × 8 inches Pages 12 Lines 9 on a page Character, Telugu Condition slightly injured Appearance old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 295 a The other works herein are —1-a Candrāṅgadacaritra, 121 a Uṣāparinayamu, 240-a Vēdāntavārtikamu, 279 b Pañcīkaranamu, 290 a Prabhudēvaravākyamu, 301 a Vēdantavārtikavisayasūci, 306 a Pañcikaranavisayasūci, 306 b Miśrārpana Visaya vivaranamu, 312 Bhāskara Śatakamu

Same work as the above

(వి-వి)—

సమగ్రము ప్రాంత మంచిది తప్పులు కలవు శైథిల్యము గ్రంథ పాతములు లేవు

అనేక పాఠములు భిన్నములుగానున్నను నిది పూర్వవర్ణితమే

ఇందలి గ్రంథాంతరములను నెం 2118 చూడదగును

---

## No. 2160. మిశ్రార్పణ విషయ వివరణము

### MIŚRĀRPAṆA VIŚAYA VIVARAṆAMU

Substance, paper Size, 12⅜ × 8 inches Pages, 2 Lines, 15 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 306 b The other works herein are —1 a Candrāṅgadacaritra, 121 a Uṣāparinayamu, 240 a Vēdantavārtikamu, 279-b Pañcikaranam, 290 a Prabhudēvaravākyamu, 295 Miśrārpanamu, 301 Vēdāntavārtikaviṣayasūci, 306 Pancikaranavisayasūci, 312-a Bhāskara Śatakamu

Complete

This is an explanation of the contents in Miśrārpana

**Beginning**

షడ్విధ లింగ వివరమనఁగా—ఆచార లింగ, గురులింగ, శివలింగ, జంగమలింగ, ప్రసాద, మహాలింగములనే షడ్విధలింగములున్నూ ఈ షడ్విధలింగస్థానములున్నూ ఈ షడ్విధలింగములు రాతిరేవస్తు నిరూపణమున్ను కాయార్పణ కరణార్పణ మిశ్రార్పణ లక్షణములున్నూ ఈ షడ్విధలింగ హస్తములనున్నూ

**End**

షడ్విధ చక్రములున్నూ షడ్విధదళములున్నూ షడ్విధ వర్ణములున్నూ షడ్విధ అక్షరములున్నూ షడ్విధ అధి దేవతలున్నూ షడ్విధ అవస్థలున్నూ పిండాండమందు నాదబిందు కళలున్నూ ఆత్మత్రయమున్నూ స్థూలసూక్ష్మ కారణతనువులున్నూ త్యాగాంగ యోగాంగ భోగాంగములున్నూ ఇవి మొదలయిన పిండ సహితమైన వాటిని అన్నిటినిన్నీ పరిపూర్ణమైన బ్రహ్మము తెలియఁజెప్పుటే షడ్విధలింగ వివరణము

(వి-వి )—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులు లేవు శైథిల్యములేదు గ్రంథ పాతము లేవు

మిశ్రార్పణమను గ్రంథమునఁగల విషయములిందు వివరింపఁబడినవి

---

## No 2161. ముముక్షు జనకల్పకము

## MUMUKSU JANAKALPAKAMU

Substance, palm leaf Size, 16 × 1⅜ inches Pages, 88 Lines, 7 and 8 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

This is a Telugu version in Sisa metre of the same work in Tamil written in *manipravāla* style on Vaisnavism The name of the author is not known but one Lakṣmanācārya is referred to in almost every verse It is stated that this work was written under the influence of this Lakṣmanācārya He was born in Āndhra country in the lunar month of Pusya of the year Srīmukha, under the star Mrgaśira He was educated under Tirusingarācārya at Addanki, and he settled down at Tirukoilur where he propagated Vaiṣnava religion He died on the 4th day in the second half of the lunar month Āsadha in the year Vibhava—Śaka 1480

**Beginning**

సీ అఖిలవేదాంత రహస్య ప్రవర్తకా
చార్య పరంపరాజన్మభూమి
చేతనా చేతన శేషి పరవ్యూహ
విభవాంతరాత్మార్చ వేషధారి

స్వేచ్ఛా గృహీత నిజేష్టవిగ్రహుఁడో
నిఖిల హేయ ప్రత్యనీకమూర్తి
భోగ లీలార్థ విభూతిద్వయైశ్వర్యుం
డఖిల కల్యాణ గుణాకరుండు
అతఁడు ఫణిశాయి గరుడవాహనుఁడతండు
అతఁడు లక్ష్మీశుఁడానందమతఁడుదానె
యతఁడు కారణకార్యాంతరాత్మ యొకఁడె
ధ్యేయుఁడని చెప్పె లక్ష్మణదేశికుండు॥

**End :**

సీ. శ్రీముఖ వత్సరస్థిర పుష్యమృగశిర
నంధ్ర దేశంబులో నవతరించి
శ్రీమంతుఁ దిరుసింగరాచార్య (అ)
నద్దంకిలోపల నాశ్రయించి
దివ్యదేశంబులు తేజరిలఁగఁ జేసి
నిజవైష్ణవ స్థితి నిర్వహించి
తిరుకోవలూరిలోఁ దేజంబుతో నుండి
శిష్యులకును దత్త్వ శిక్ష చేసి
పరమభక్తియు తీంద్రసంస్మరణ బుద్ధి
విభవ సంవత్సరాషాఢ విద్యమాన
బహుళపక్ష చతుర్థిని భాష్యకారు
ముదముతోఁ జేరె లక్ష్మణమునివరుండు॥

సీ. శకవత్సరంబులు చన్నవి వేయును
నన్నూటతొంబది నాటివిభవ
కర్కాట కాషాఢగామిసితేతర
పక్షచతుర్థిని

* * * *

బ్రహ్మ
రంధ్రమున వెళ్లి యతికుల రాజు జేరె
లక్ష్మణార్యుండు లోకవిలక్షణుండు॥

* * * *

సీ. శ్రీనిధి శరవైరి చిత్తంబులోనుండి
వేదార్థమెల్లను విశదపఱచె
శరవైరి యతిపతిస్వాంతస్థుఁడైతత్త్వ ?

నాతిప్రసమార్థంబు తెలుఁగఁజెప్పె
యతిపతివర వరాహ్వయ యోగియంమడి
సర్వరిహాస్యార్థ గరిణి చూపె
నావం బని లక్ష్మణార్య హృద్యస్థుడై
పరమావికార సిద్ధయును దెలిపె
పట్ల లక్ష్మణ మునియస్మదంతరంగ
మందుఁబొసంఁడి మోక్షార్థికైన తెరవు
కానవించు ముముక్షువు కల్పకంబు
పేరని కావ్య మిప్పుడీ పృథ్వి నిలిపె॥

* * * *

సీ॥ తప్పుదా భాష్యకారావ తారుఁగను చుఁ
ఐ మవదమఁదు స్వగ్రయావమెఱింప
వచ్చివచ్చి ముముక్షువు ల్వసుధలోన
లక్ష్మణార్యుల కరుణకు లక్ష్యమైరి॥

**Colophon**

గద్య॥ ఇది ముముక్షు జనకల్పకంబను ప్రబంధంబునందు
సర్వమును ద్వాదశ ప్రకరణము॥

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులుగలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

ముముక్షు జనకల్పకమను పేరనే ద్రవిడమణిప్రవాళ భాషలోఁగల వైష్ణవమత గ్రంథము ననుసరించి తెలుఁగున సీసపద్యములలో వ్రాయఁబడిన గ్రంథమిది గ్రంథకర్త పేరేదో సరిగాఁ దెలియదు ఇందుఁ బ్రాయికముగాఁ బ్రతి పద్యమునను 'లక్ష్మణాచార్య' ప్రస్తావము కలదు ఆయనయే గ్రంథకర్త యందావిష్కృఁడై యీ గ్రంథమును రచించెనని కలదు ఆ లక్ష్మణాచార్యుఁడు శ్రీముఖ వత్సర పుష్య మాస మృగశీర్షా నక్షత్రమున నాంధ్రదేశమున జన్మించి యద్దంకిలోఁ దిరుసింగరాచార్యులయొద్ద విద్యాభ్యాసముచేసి తిరుకోవలూరిలో శైలాని వైష్ణవమతము ప్రబలఁజేసి 1480 శక వర్షమునకు సరియగు విభవ వత్సరమున నాషాఢ బహుళ చతుర్థినాఁడు మృతినొందె నట

## No. 2162. ముముక్షు జనకల్పకము

## MUMUKSU JANAKALPAKAMU

**Substance, palm leaf Size, 15¼ × 1¼ inches Pages, 183 Lines, 5 and 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, not good and contains mistakes**

Incomplete

Same work as the above

(వి-వి)—

ఆదినుండి పదొకొండు ప్రకరణములు కలవు వ్రాఁత మంచిదిగాదు తప్పులు చాలఁగలవు శైథిల్యము చాలఁగలదు గ్రంథపాతములు కలవు అక్కడక్కడ కొన్ని పత్రములు పోయినవి

పూర్వమునోటు

---

## No. 2163. ముముక్షుజనకల్పకము

### MUMUKSU JANAKALPAKAMU

Substance, palm leaf Size, $15\frac{3}{8} \times 1\frac{1}{8}$ inches Pages, 70 Lines, 7 and 8 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, good but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

ఆదినుండి దశమ ప్రకరణమున 21 పద్యమువరకుఁగలదు వ్రాఁత చక్కనిది తప్పులున్నవి శైథిల్యము కొంచెముకలదు గ్రంథపాతములు లేవు

పూర్వమునోటు

---

## No 2164. ముముక్షుజనకల్పకము

### MUMUKSU JANAKALPAKAMU

Substance, palm-leaf Size, $15 \times 1\frac{5}{8}$ inches Pages, 290 Lines, 7 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and contains mistakes

Complete

Same work as the above

(వి-వి.)—

సమగ్రము పదొకొండు ప్రకరణములు కలవు వ్రాఁత మంచిదిగాదు. తప్పు లున్నవి శైథిల్యము కలదు గ్రంథపాతములు కలవు

పూర్వమునోటు

---

## No. 2165. ముముక్షుజనకల్పకము.

### MUMUKSU JANAKALPAKAMU

Substance, palm leaf Size, $14\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 147 Lines, 6 on a page Character, Telugu Condition, much injured. Appearance old Mode of writing, not good, full of mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము పదోకొంత ప్రకరణములు గలవు వ్రాఁత మంచిదిగాదు తప్పులు చాలఁగలవు శైథిల్యము ప్రారంభమునఁ జాలఁగలదు. గ్రంథపాతములు గలవు

పూర్వమువలె

గ్రంథాంతమున ఎనిమిది యామునులో, వైష్ణవుల కీర్తనలు, ఆళ్వార్ల తనియనులు గలవు

---

## No 2166 ముముక్షు జన కల్పకము

### MUMUKSUJANAKALPAKAMU

Substance, palm leaf Size, 18½ × 1½ inches Pages, 74 Lines, 7 on a page Character Telugu Condition, much injured Appearance, old Mode of writing, not good and fairly free from mistakes

Incomplete

Same work as the above

(ఎ-వి)—

ఆదినుండి పదోకొంతు ప్రకరణములు గలవు వ్రాఁత చక్కనిది తప్పులంతగా లేవు శైథిల్యము చాలఁగలదు గ్రంథపాతములు చాలఁగలవు

పూర్వమువలె

---

## No 2167. ముముక్షు జన కల్పకము (సటీకము).

### MUMUKSU JANAKALPAKAMU (WITH MEANING)

Substance, palm leaf Size, 13⅜ × 1⅜ inches Pages, 20 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above with a commentary for each verse

**Beginning**

సీ॥ అఖిలవేదాంత రహస్య ప్రవర్తకా
చార్య పరంపరా జన్మభూమి

* * * *

అతఁడు కారణకార్యాంతరాత్ముఁ డొకఁడె
ధ్యేయుఁడని చెప్పె లక్ష్మణదేశికుండు

అర్థము —సమస్త వేదాంతాలచేత పలుకబడిన రహస్యము [illegible], ఆ తిరుమంత్రం శ్రియఃపతి తానె గురుపరంపరకు ఉపదేశించిన మొదటి ఆచార్యుఁ డనిన్ని కారణమున్ను కార్యమున్ను ఈ రెంటికిన్ని అతఁడే అంతర్యామి యై యుండడననిన్ని ధారకపోషకాలకు అతఁడే కర్త అనిన్ని లక్ష్మణార్యులు అని[illegible]రి

**End**

సీ. గీ. అట్టి యతిరాజు పూర్వావతరించి
మనల రక్షింపవేంచెసె మనుజులార
చేరి బ్రదుకఁడు మీరని చెప్పచుండు
రాప్తులైనట్టి మా లక్ష్మణాచార్యులెపుడు

(వి-వి)—

అసమగ్రము ప్రథమ ప్రకరణముఁ గొంత పత్రకలదు వ్రాఁత చక్కనిది తప్పులున్నవి శైథిల్యము, గ్రంథపాతములు చాలఁగలవు

ఇది పూర్వవర్ణితమే కాని యిందుఁ బ్రతిపద్యమునఁ టీక లేదు

---

## No 2168 మూలస్తంభము

## MŪLASTAMBHAMU

Substance, palm leaf Size, 15 × 1¼ inches Pages, 210 Lines 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, good, free from mistakes

Incomplete

Describes the creation, preservation and the destruction of universe, as narrated by Śiva to his wife Pārvati, at her request

**Beginning**

శ్రీ మహాదేవుండు కైలాస శిఖరభాగంబునందు సుఖాసీనుండై కొలువున్న సమయంబున జగన్మాతయగు పార్వతీదేవి సాష్టాంగ దండప్రణామంబుగావించి లేచి కరకమలంబులు ముకుళించి దేవ సకల జగదుత్పత్తి స్థితిలయ కాలంబులకుఁ గారణకర్తలైన మూర్తి త్రయంబును, తదీయాంతర్గతంబైన యీరేడు లోకంబులు, చతుర్దశభువనంబుల వరుసయు, మన్వంతరంబులును, త్రికాలంబులును, స్థావరజంగమాత్మకంబైన యీ విశ్వప్రపంచకంబును ప్రళయకాలంబులును నేవిధంబున గలిగియుండె అవ్వృత్తంబెట్టులుపుట్టె సంతయుఁదెలియ నానతీవలయునని విన్నవించిన,

**End**

ఆవర్ణ బ్రహ్మచేత ననుజ్ఞాతులై సురమునీంద్రుండు తమ తమ నివాసంబుల కరిగిన పిమ్మట నావర్ణుండు కొంతదడవచ్చట రంభోర్వశీ మేనకాదులయిన యప్సరోనికురుంబంబుల యాటపాటలకు మనంబున ననురాగం బుప్పతిల్ల విలోకించి రాగరస

మగ్నుండై యూర్వశియను దేవ వేశ్యాశ్రేష్ఠను రూప సౌందర్యంబులకు నోటువడి మదన ప్రసూనబాణ బాధితుండై యూర్వశితోఁ గామోపభోగంబులం దేలి సద్యోగర్భంబున,

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత కడుఁ జక్కనిది తప్పులు లేవు శైథిల్యము ఎడనెడఁ గలదు అక్కడక్కడ శైథిల్యమువలని గ్రంథపాతములు గలవు

పార్వతీదేవి జగత్సృష్టి స్థితిలయములఁ దెలుప శివునిఁ గోరఁగా నాయమకు శివుఁ డదియెల్ల వివరించున ట్లీ విపుల గ్రంథమున జగదుత్పత్తి, యుగమన్వంత రాదులు, ప్రళయము మొదలగువాని వ్యాఖ్యానములతోను పన్యసించుటయందలి విషయము గ్రంథమున నెక్కడను గ్రంథనామముగాన రాదుగాని, మూలస్తంభమని ప్రతి విలేఖకుడు పుస్తక ముఖమున వ్రాసికొన్నాడు మంచి వచనరచనతో నీ గ్రంథము గలదు

---

## No 2169. మోక్షశాస్త్రము.

## MŌKSAŚĀSTRAMU

Substance, palm leaf Size, 14 × 1¼ inches Pages, 54 Lines, 4 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, not good and full of mistakes

Begins on fol 75 *a* The other works herein are —1 *a* Ācāryābhimānamu, 48 *a* Pramānatturattu, 102 *a* Paravastunāyaka Śatakamu

Complete

This appears to be a Telugu rendering of a Tamil work describing the nature of moksa (final liberation from worldly existence) and the means of obtaining it The author is Āccirāmānujayya

**Beginning**

ఆచి రామానుజయ్యగారు మోక్షశాస్త్రం అనతిచ్చినారు పెద్దలు అనతిచ్చిన ప్రకారం ఈ శాస్త్రములో చెప్పిన అర్థ విశేషములు లెస్సగానెఱిగి అందరిని గూర్చుక అనుభవించవలెను ఎవ్వరెక్కడపోయిరేమి తనమాత్రమే మోక్షముగలిగితే చాలు ననినవారు కల్పవృక్షంవంటివారు అని పెద్దలు అనతిత్తురు మధ్యాహ్నకాలమందు యెండబడి కల్పవృక్షము క్రిందికిబోతేనె ఆ నీడ తనమాత్రమేకాని మఱివొకరికి లేదు గనక భూతదయాళంగలవారే శ్రీవైష్ణవులు

**End**

ఇతర సహవాసమున్ను ఇతర విషయమున్ను నరకహేతువని యెఱుంగునది ......

వజ్ఞానంగలిగి యిక్కడవుండే నాల్గు నాళ్లున్ను భగవద్భాగవతాచార్యులయొక్క కథలచేతనే కాలంగడపుకొని యీయామరికిచ దుఃఖాలనువిడిచి విరజకావలి సీమఁజేరి తల్లిదండ్రులతో కూడేపర్యంతము యేమరక స్వామి కథలచేతనే కాలం గడపవలెను

దొరకదు అటువంటి ఆచార్యులు దొరకరు ఇటువంటి జ్ఞానము దొరకదు

ఈ రామానుజ దర్శనమున్న్నా దొరకద. మనఘా దొరికెను గాలిగఁజప్పుడే తూరుపెత్తుకోవలెను ఈ సందేహ ముండేటప్పుడే మోక్షహేతువే నెయపఁయిన అహంకారమమకారాల యమదూతలైపోమరు యమహాధలు చెప్పే మంటేను ఆ దుఃఖాలు కడ గుఱుతులేద చెప్పేసన్నా వశము గాద అతి ఘోరమై యుండును

శ్రీమద్వేదాంతగురువేనమః, ఆళ్వారు తిరువడిగళే శరణం, ఎంబెరుమానారు య్యారు తిరువడిగళే శరణం

(వి-వి )—

సమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యముగలద గ్రంథ పాతము లంతగాలేవు

శ్రీ వైష్ణవ సంప్రదాయము చొప్పున మోక్షమనఁగానేమో దానిఁ ఒడయుట యెట్లో యిందుఁ జెప్పఁబడినది ఇది ద్రవిడ గ్రంథమునకుఁ దెలిఁగింపైయుండును ఆచ్చి రామానుజయ్యగారు దీనికిఁ గర్తలట.

ఇందలి గ్రంథాంతరములివి —

1 ఆచార్యాభిమానము, 48-*a* ప్రమాణ తిరట్టు 102-*a* పరవస్తు నాయక శతకము.

---

## No 2170. యతిరాజవింశతి టీక

## YATIRĀJAVIMSATITĪKA

Substance, palm leaf Size, 11⅝ × 1⅛ inches Pages 210 Lines, 4 on a page Character, Telugu Condition slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

This is a commentary on the work Yatirājavimsati which is a Telugu rendering of the Sanskrit work written by Manavālamahāmuni, in praise of Rāmānujācārya The name of the author is not known

**Beginning**

ఉపదేశించిన—ముఖత్తాలె = వారియొక్క ఉపదేశంచాతను లభించి, మిక్క వేధయర్ వేధత్తినుళ్ పొరుళానుమిక్క వేధయర్ = శ్లాఘ్యమైన వేదం, వేదంకళ్ వేదత్తిల్ = వేదంయొక్క, ఉళ్ పొరుళాన = తాత్పర్యార్థమైన, చరమపర్యంతవేనిష్ఠ రాయ్ = చరమోపాయ నిష్ఠలై, పంచమోపాయనిష్ఠులైన, చరమాధికారికళకు = చరమపర్వనిష్ఠులకు అనవరతాను సంధానమాహ = నిత్యానుసంధానమైనటువంటి ఆచార్యాభిమానమందు నిష్ఠులై, యస్తుతిం, యః = వి అళిఘు మనవాళజియ్యంగారైననేమి. యతిపతి = యతీశ్వరులకెల్లాను, పతిం = స్వామియైనటువంటి యెంబెరుమానారుయొక్క

ప్రసాదనీం, నిర్హేతుక కృపచేతను, యతిరాజవింశతిం = యతిరాజవింశతి అనే పేరుగల, స్తుతిం = స్తోత్రమును వ్యాజహార అనతిచ్చిరి, ప్రపన్నజనచాతకాంబుదం— ప్రపన్న = ప్రపన్నజనులనెడి, చాతక-చాతక పక్షులకు, అంబుదం = మేఘమైనటువంటి, తం = ఆయీ వరయోగిపుంగవం, వర = అధికమైనటువంటి, యోగిపుంగవం = యోగిశ్రేష్ఠులకు స్వామి = సేవించేను సమస్తమైన శ్రీవైష్ణవులకు ధారకపోషక భోగ్యము లయ్యేటట్టుగాను అనతిచ్చిన మణవాళమాముని తిరువడిగళె పరమప్రాప్యమని ఈ శ్లోకానకు తాత్పర్యం

**End**

అని చెప్పినట్టు భగవదనుభవాదులందు పరాకులేక తిరువుళ్లం పట్టి యవధరించవలె నని ప్రార్థిస్తున్నారని అనతిచ్చుటయును, వక్తృవైలక్షణ్యంచాతను ప్రపన్నులకు నిత్యానుసంధానం అయ్యేటట్టుగాను ఈ శ్లోకం నైచ్యపరమైన్ని అతిశయపరమున్నై వుండును ఈ స్తోత్రమందు ఇష్టప్రాప్తిన్ని అనిష్టనివృత్తిన్ని అనతిచ్చుటయును, ఉక్తివిశేషాకబాహ్య భాషాజాహ్యాదు జాహ్యాదు అని ఆశ్రితులయినవారు విషయవైలక్షణ్యమే చూచు కొందురు ని తెలుంగని కొంచెదమనమని చూడరు హరికీర్తి (౦?) వినా నాన్య బ్రాహ్మణోవర ఉత్తమః" అన్నట్టు గీర్వాణ భాషైనాను జడశాస్త్రిలున్న యోగ్యంగానట్టి ఈశ్వరపరమై తేను ఏ భాషైనాను మంచిదని అనతిచ్చినారు విజ్ఞాపనం విన్నపం

(వి-వి)—

సమగ్రముకాని తుదియాకు పోయినది వ్రాత మంచిది తప్పులున్నవి. శైథిల్యము కలదు గ్రంధపాతములు గలవు

మణవాళ మహామునులు సంస్కృతమున రచియించిన రామానుజాచార్య స్తోత్రమునకు యతిరాజవింశతి యనుదానికి తెలుగు టీక యిది అరవమునన్న టీకకిది తెలుగుసేత కాబోలును రచయిత పేరెఱుంగరాదు

---

## No 2171 యోగతారావళి

## YŌGATĀRĀVALI

Substance, palm leaf Size, $16\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches Pages 7 Lines 5 on a page. Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

This is a Telugu rendering of the work in Sanskrit by Śankarācārya. The author of the Telugu version is Lōkāreddi Krnamacārya

**Beginning**

శా శ్రీసంధానములుగ్ర సంసృతి మహాశ్వేళాప్తసంమోహమి
త్రాసవ్యాళఫిపక్కులాత్మసుఖబోధప్రాప్తిసందర్శితా

యోగాభావముల్ ప్రైనావళి సువిద్యాదానధుర్యుండై
భాసిల్లం దగదేశికేంద్రచరణాబ్జాతంబులన్ గొల్చెదన్

సీ. ధరసపాదలక్షలయావధానములు ప
దాశివోక్తంబులై చాలఁదనరుచుండు
వాటిలో నిరుపమత చేవర్ణ్యగగచు
నలరునాదాను సంధానమాత్మనెంతు

క. మారుతరేచక కుంభక
పూరకములనాడులన్ని పాలుపొందంగాఁ
దీరయనాహత పద్మపు
దారిన్ స్వాత్మప్రబోధదాన జనించున్

గీ. జాతనాదానుసంధాన ! చేతునీకుఁ
దలఁతులయముల కెల్లనిన్ దత్త్వమనుచు
గాన నీదయఁబవనంబుతోనె విష్ణు
పదమునను లీనమగు నాదుభావమెలమి

**End**

క. పవనము సెలయేటిగతిన్
జవనమునన్ బ్రహ్మరంధ్ర సంగతమగుచో
శ్రవణాతీతంబగు నొక
గవము వినంబడును నదియె ప్రాప్యంబనఘా !

క. శ్రీరాడ్గోవిందగురు స
దారాధ్య సుశిష్య శంకరాచార్యముఖో
దీరితయగు తారావళి
నారసి తెలిఁగించెఁ గృష్ణమాచార్యుడిలన్

శా. శ్రీకళ్యాణగుణుండు నాశ్రితబుధశ్రేయః కటాక్షంబునన్
లోకారెడ్డి కులాఢ్యుఁడీ భువనముల్ లోవెల్గఁ జూపు నా
రాకాచంద్రుఁడు రామకృష్ణగురుఁడున్ రంజిల్లు తారావళిన్
లోకుల్ మెచ్చఁగఁ జెప్పెఁ దత్త్వకవితారూఢిం బ్రమోదంబునన్.

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులు గలవు శైథిల్యము లేదు. గ్రంథపాతములు లేవు

యోగతారావళి యనుపేర శ్రీ శంకరాచార్య విరచితమనఁబరగు సంస్కృత గ్రంథమున కిది తెలుఁగునేఁత ఇందు లయ యోగములలో ముఖ్యమగు నాదానుసంధానము కొండాడఁబడినది. లోకారెడ్డి కృష్ణమాచార్యుఁడు దీనికిఁ గర్త

## No 2172 యోగదర్శన విషయము

## YŌGADARŚANAVIṢAYAMU

Substance, palm leaf Size 18¼ × 1½ inches Pages, 41 Lines, 5 on a page
Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, not good but free from mistakes

Incomplete

This is a very ancient work on Śivayōga The name of the author and the title of the work are not known from this The work is divided into Skandhas , third skandha has got the other name Vimarsa skandha and the fourth skandha Vibhūti skandha The subjects dealt with in this are mostly on Yōga , reference is also made to other systems For details see extracts below

**Beginning**

ఈరీతిగా జగత్తును అయిదు ప్రకారాలుగా విభజించి చిదాత్మకత్వ నచేసి మళ్లిన్ని భావనాలాఘవం కొఱకు మూడుగా విభజించి చిదాత్మకత్వమును ఉపదేశం చేస్తున్నాడు 5

సోమరవీతి

ఈ ప్రకారం భోగ్యంసర్వాగ్రాహ్యం గనుక సోమలక్షణము ఇంద్రియముల పరాక్ప్రత్య గ్రాహకములయినవి గనుక రవిలక్షణములు భోక్తప్రత్యగేకస్వభావం కల వాడు గనుక వహ్నిలక్షణము ఈ మూడు స్వభావములుగలదేను విశ్వము ఇదిగా కించితున్న లేదు ఈ భోగ్యాదులయొక్క యేభాన ఖండంగలదో అది భోగ్యత్వాది విశేషవిగళనమందు సామాన్యాత్మకమై విమర్శమయమయి నదభుకుంచున్న బిందువని చెప్పబడుచునున్నది

*  *  *  *

(ఈ గ్రంథమున నుదాహృతములగు శ్లోకముల ప్రతకము శ్రీక్రిందివి) —

I సోమరవీతి

షోడశధేతి

చిద్గగనేతి

శక్తిరితి

ఇతి స్కంధోద్వితీయః

విమర్శస్కంధం ఆరంభింపబడలచు —

అహమితి

ప్రథమ ఇతి

యుష్మదితి

ద్యావాపృథివీతి

ధూమావతీతి (ధూమావతిశక్తి, వహ్ని దాఖ్యశక్తి, భాస్వతిశక్తి, స్పందాఖ్య శక్తి, విభ్వీశక్తి (తిరోధాన, ఆప్యాయన, అవభాసన, క్షోభ, వ్యాప్తులయందు పై శక్తులు)

ధూమావతీ పృదివ్యామితి
ధర్మిణమితి
కుతో ప్యేతి ?
అకరోదితి ?
కార్త్స్న్యేనేతి
అంతస్సుఖేతి
అక్రమతేతి
గాతారమితి
వేద్యమితి
స్మృతీతి
స్మృతిరితి
అస్తమితమితి 19

ఇతి తృతీయస్కంధః అధచతుర్థ విభూతిస్కంధ ఆరభ్యతే

శ్లో. అంతర్నిరంతర నిరింధన మేధమానే
మోహాంధకారపరిపంధిని సంవిదగ్నౌ
కస్మింశ్చిదద్భుత మరీచివికాసభూమా
విశ్వంజుహోమి వసుధాది శివావసానమ్

మత్ స్థమవిభువనబృందం

అప్రబుద్ధ, ప్రబుద్ధకల్ప, ప్రబుద్ధ, సుప్రబుద్ధకల్ప, సుప్రబుద్ధ—ఇతి పంచప్రమాతారః అనాశ్రితాది కాలాగ్ని రుద్రాంతమయిన భువనబృందము—

గ్రాహకమితి
జడతామితి
రవిసోమేతి
యాదేవతేతి
ధారణేతి
ఇతి తన్మాత్రేతి
రాగేతి

**End**

రవిసోమేతి, సూర్యుడు చంద్రుడు మెఱుపు వజ్రాయుధం, మేఘం, బడబాగ్ని సముద్రం గుహలు అరణ్యములచాతను దృఢంగా భావింపబడిన ఆత్మభావములచాతను, యోగి అయా కర్మను నిర్వహిస్తున్నాడు

యాదేవతేతి—

గణపతి, సరస్వతి, హరిహరాదులు మొదలుగా గలిగినటువంటి యే దేవతలు ఆశ్రమందు కలరో వార్లు విఘ్నధ్వంసన వాక్ప్రవర్తనపాలన సంహరణాదికమయిన కార్యము

లను చేతుగో ఆయా కార్యములను సాధింపవలెనని ఇచ్ఛకలవార్లకు ఆసాధనేచ్ఛ యందు సిద్ధులు చెప్పుచున్నారు

ధారణేతి—

ధారణ అనగా పృథివి సంగ్రహలక్షణ అనగా అప్పుపాకులక్షణ(?)అనగా తేజస్సు వ్యూహలక్షణ అనగా వాయువు ప్రతిఘాతలక్షణ అనగా ఆకాశము వీటి పంచభూతెః ఈ పంచభూతములచేతను తమతమయందుఉండే అహంతలచేతను ప్రత్యహంతను దృఢమాత్మత్వంగా అనుసంధానముచేతను యోగికి యిష్టమయిన క్రియలు జరుగుతున్నవి

ఇల తన్మాత్రేతి—

పంచతన్మాత్రలు 5, కర్మేంద్రియాలు 5, జ్ఞానేంద్రియాలు 5, మనస్సు, బుద్ధి, అహంకారం, ప్రకృతి పురు(షుడు ?) ఈ తత్త్వములయందు పూర్వోక్తప్రకారమయిన సాధనకలిగిన పురుషుడు ఆయా తత్త్వసిద్ధులను పొందును

రాగేతి —

రాగనియతి కాలవిద్యాకలామము ? య, ఈశ్వరసదాశివశక్తి శివ యీ తత్త్వములు ధారణకల యోగి ఈ స్వరూపుండవును ప్రసంగవశాత్ ప్రసంగంవల్ల నుంచిన్నీ శుకాది మహర్షుల ప్రతీతిని చెప్పుచున్నాడు

(వి-వి)—

ఆసమగ్రము గ్రంథారంభమున నాలుగు శ్లోకముల విషయము లోపించినట్లున్నది ఒకటి రెండాకులు పోయియుండును—వ్రాతమంచిదిగాదు తప్పులు లేవు—శైథిల్యముగలదు తుది యాకుచాలదునిగిపోయినది ఇది కడుంబ్రాత వ్రాత పుస్తకము గ్రంథపాఠములు కొలదిగాగలవు

ఇది కడుప్రాచీనమయిన శివయోగ గ్రంథము కావచ్చును గ్రంథముపేరుగాని, గ్రంథకర్తపేరుగాని కానరాదు గ్రంథము స్కంధములను పేరితో విభాగింపబడినది మూడవ స్కంధమునకు విమర్శ స్కంధమనిపేరు నాల్గవ స్కంధమునకు విభూతిస్కంధమనిపేరు తృతీయస్కంధారంభశ్లోకము పూర్తిగానిందుదహరించబడినది తక్కిన వాని ప్రతీకములుగలవు తెలుగున నాయాశ్లోకములలోని విషయము సంగ్రహముగాం దెలుపబడినది ప్రతీకములబట్టి శ్లోకములు కొన్ని యార్యావృత్తములుగా గుర్తింపవచ్చును పూర్తిగా నుదహరింపబడిన శ్లోకము వసంతతిలకము కొన్ని మిగిలిన ప్రతీకముల శ్లోకములెల్ల వసంత తిలకములుగా నేరవు

ఈ గ్రంథములోని విషయము యోగశాస్త్రసంబంధిగాదోచును సాంఖ్యాది దర్శనములపేరున్నది గ్రంథవిషయమును గుర్తింప ననుకూలించు భాగములు దావ్యృతములయ్యెగాన, వానిబట్టి యెవరేనియు గ్రంథమిట్టిదని గుర్తింపం జాలవచ్చును,

## No 2173 రహస్యత్రయము

## RAHASYATRAYAMU

Substance palm leaf Size 13¼ × 1⅜ inches Pages 26 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance old Mode of writing, fair almost free from mistakes

Begins on fol 29 *a* of the manuscript described under No 2100

Complete

This appears to be a Telugu rendering of the Tamil work describing the three rahasyas or religious practices viz , Tirumantra Dvayamantra and the Caramaślōka, relating to Viśiṣṭādvaitas

**Beginning**

ముముక్షువెఱుంగవలసిన రహస్యములు మూడు అందు ప్రథమ రహస్యము తిరుమంత్రము తిరుమంత్రము యొక్క శ్లాఘ్యాసహ తగువట్టుగాను ప్రేమ చేతను గుప్తము గాను అనుసంధించవలెను మంత్రమంయున్ను మంత్రప్రతిపాద్యుడయిన వస్తువందున్ను మంత్రప్రదుడయిన ఆచార్యులయందున్ను ప్రేమ అధికముగా కలిగితే కార్యకరమవును సంసారులు తమ్మున్ను ఈశ్వరుని మఱచి ఈశ్వరు కైంకర్యమున్ను లభించకపోతిమని విచారములేక సంసారమనెడి మహాసముద్రమునంబడి నొప్పికడంగా ఈశ్వరుండు తమ కృపచేతను వరుతమ్ము నెఱిగి దరిచేరేటట్టుగాను తానే శిష్యుడునై తానే ఆచార్యుడునై నిలిచి తిరుమంత్రమును బయలుపెట్టి నవధరించరి

**End**

చక్రవర్తి తిరుమకనారు పాపముతోడవచ్చిన చాలుననిరి ఈయన పుణ్యం విడిచి రావలెననెను ఆస్తికుడై యీ యర్థమందు విశ్వాసముగలిగి ఉజ్జీవించుట నాస్తికుడై చెడుటగాక నడుమ నిలుకడలేదని భట్టరుకు ఏంబారు అనతిచ్చినవార్త వ్యవసాయం లేనివానికి యిందన్వయం అజీర్ణమంను భోజనముపలెను విష్ణుచిత్తరుకేట్టినప్పరు అనెడి భంగిని అధికారులు నియతులువార్తె అవి భవర నెడిపాటను అ నాకి అనేపాటాను ఇం మకు అర్థముగా అనుసంధేయం

(వి-వి )—

సమగ్రము వ్రాంతమంచిది తప్పులులేవు శైథిల్యములేదు గ్రంధపాతములు లేవు

తిరుమంత్రము, ద్వయమంత్రము చరమశ్లోకము, నని విశిష్టాద్వైతులను సంధించు మూడు రహస్యములనుగూర్చి వివరణ మిందుగలదు. ఇది ద్రవిడ గ్రంథమునకుఁ దెలుఁగైయుండును

---

## No 2174 రాజయోగామృతసారము.

## RĀJAYŌGĀMṚTASĀRAMU.

Substance, palm leaf Size, 14¼ × 1⅝ inches Pages, 38. Lines, 9 on a page Character, Telugu Condition, much injured Appearance, old Mode of writing, good and free from mistakes

Complete

The discussions of Kapila and Dēvahūti on Sāṅkhya and Yōga systems found in Bhāgavata are described herein in dvipada metre  Tarigonda Vēngamāmba is the authoress

**Beginning**

శ్రీ గణనాథు నాశ్రితపరిపాలు
నాగమసంవేద్యు నాధారనిలయు
ననిశంబుగీర్తించి యతిభక్తిమించి
యనువొందఁదరిగొండ హరినిమహాను
భావునిధన్యుని భవ్యవిగ్రహుని
పావనమూర్తిని పరమకారణుని

*　　　*　　　*

నడుమదివ్యంబైన నాసికాగ్రమున
నడచిక్రమంబుగా నారెంటిమీఁద
జెలువుమీఱిన మేరు శిఖరంబునందు
లలిమీఱ రక్తిక శామాత్రమగుచు
పరుఁడౌచు వెలుఁగు సుబ్రహ్మణ్యగురుని
చరణరేణుచయంబు సారెసారెకును
శిరసావహించి సుస్థిరభక్తిమించి
పరమరహస్యంబు భావమందుంచి
రహిమీఱ సోమేశ్వరస్వామిఁదలఁచి
విహితోక్తినత్యంత విఖ్యాతినలరు
సర్వయోగీంద్రుల సమ్మతిగాఁగ
సుర్విలోకుల రాజయోగసారంబు

**End**

అకలంకుబ్రహ్మమందుఁజేరుదురు
ఇది సోమనాథ విశ్వేశ్వరదేవ
పదవాక్యభవ్య సుబ్రహ్మణ్యయోగి
చరణాంబుజాతషట్చరణాయమాన
పరిపూర్ణనిత్యసద్భావనిమగ్న
మానసాంబుజ వెంగమాంబికారచిత
మైనట్టిరాజయోగామృతసార
మందెన్నఁగాఁద్వితీయప్రకరణము
పొందగాదరికొండ పురధాముఁడయిన
వీరనృసింహుఁడు వెలయఁగైకొనియె
ధారుణినాచంద్ర తారార్కముగను,

గ్రంథాంతమందీ వ్రాఁతకలదు—

"విళంబినామ సంవత్సరం శ్రా. శు. 7 మ రోజు దేవులపల్లి బుచ్చి వ్రాసిన రాజయోగా మృతసారం"

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులు లేవు శైథిల్యముకలదు గ్రంథపాతములు కలవు

శ్రీ భాగవతమున కపిలదేవ హూతిసంవాద రూపమునసున్న సాంఖ్యయోగ విషయము ననుసరించి యీ ద్విపదగ్రంథము రచితమయినది గ్రంథకర్త తరిగొండ వేంగమాంబ

---

## No 2175 రాజయోగామృతసారము

## RĀJAYŌGĀMṚTASĀRAMU

Substance, palm leaf Size, 16 × 1½ inches Pages 68 Lines, 6 and 7 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, very bad and full of mistakes

Begins on fol 21 *a* of the manuscript described under No 2041 Same work as the above

Complete

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిదిగాదు తప్పులుకలవు శైథిల్యముకలదు గ్రంథపాతములు లేవు

పూర్వము చూ

---

## No 2176 రాజయోగామృతసారము.

## RĀJAYŌGĀMṚTASĀRAMU

Substance, Sritala Size, 9¾ × 2¼ inches Pages, 51 Lines 11 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 49 *a* The other works herein are —1-*a* Allada Vijaya-bhūpati Simhavilāsamu, 42-*a* Mohinīdandakamu

Same work as the above

Inco mplete

(వి-వి.)—

అసమగ్రము వ్రాతమంచిదే తప్పులున్నవి శైదిల్య గ్రంధపాతములులేవు పూర్వమునోలె

ఇందిగ్రంథాంతరము లున్నవి 1 ౘ అల్లాడవిజయభూపతి సింహావిలాసము 42 a మోహినీదండ ము

---

## No 2177 రామగీతలు

## RĀMAGĪTALU

Substance, palm leaf Size, 14⅜ × 1¼ inches Pages, 139 Lines 7 or a page Character Telugu Condition injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Same work as that described under R No 726

**Beginning**

సీ క్షీకుపత్రికగంధయుతవత్స
వత్సదానవభుజాబలవిశాల
ఫాలలోచనసురప్రభుకృతసమ్మాన
మానవలోక నిర్మాణదక్ష
దక్షసుతాధి తస్వపదాంభోజ
భోజ హృదంబుజవిహార
హారహీరపటీర హరియశస్సార
సారసహితవంశ జలధిచంద్ర
చంద్రికాహాసభాసిత సర్వలోక
లోకపాలకసన్నుతా స్తోకవిజయ
విజయజయకృతనుతిసోమ విజయరామ
రామకృష్ణపురీధామ రాజసోమ.

గీ ఆవధరింపుము దేవర కంకితముగ
రామగీతలు సంస్కృతాంధ్రప్రకర్ష
భాషణంబుల విటులకుభావశుద్ధి
గలుగరచియింతుబుధులెల్ల గణనసేయ

శా శ్రీవిశ్వాత్మకుబ్రహ్మగోల్చిప్రకృతిన్ చింతించి నారాయణున్
సేవల్ చేసి రమన్ దలంచి శివునిన్ జిత్తంబులోనిల్పి గౌ
రీవామాక్షికి మ్రొక్కి ధాతను విరించిన్ భారతిభామినిన్
భావంబందు నమస్కరించి గజరాడ్వక్త్రున్ బ్రశంసించెదన్

**End**

సీ. శ్రీయత్రికులవార్ధి శీతమయూఖుండు
జనకులగోత్ర విస్తారకుండు
నలకృష్ణవిభునకు నాసర్వమాంబకుఁ
బౌత్రుండు సద్గురు
వేంకటకృష్ణభూవిభునకు వేంగమాం
బకుఁ దనూభవుఁడు వైభవబిడౌజు
డగుకృష్ణభూపాలుఁ డాత్మ నామాంకిత
పురవాసియైన రామునకునంకి
తమ్ముఁగాగ తత్త్వబుద్ధి
నక్షరసువర్ణమయపంక్తి నర్చ చేసి
యీ మహాకృతి సభలలో నెన్నికగని
జగతినాచంద్ర తారార్కమునుఁగఁజెలంగు

*　　*　　*　　*

పాదాంతోదస్త పాదాద్యంతయమకముక్త పద్రగ్భ సీసపద్యలోనకందము—
శ్రీలసిత మేఘనీల
నీలాదేవీసహాయ నిరుపమశీలా
శీలా　　మహేలా
హేలాకళ్యాణపరిగృహీతశ్రీలా!

(వి వి)—

సమగ్రము కడపటిపద్యము, నొకపద్యముమాత్రము కొఱఁత ప్రాఁతతిన్నని దే
తప్పులంతగాలేవు శైథిల్యము గ్రంథపాతములు చాలాఁగలవు
ఇది ఆర్ నె 726 రునవక్షితము

---

## No 2178 రామానుజ రహస్యత్రయము

## RĀMĀNUJARAHASYATRAYAMU

Substance, palm leaf Size, 13¼ × 1⅝ inches Pages, 34 Lines, 6 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 42-*a* The other works herein are —1-*a* Prapanna-paritrānamu, 7-*a* Arthapancakamu, 15 *a* Tatvatrayamu, 29-*a* Rahasya-trayamu

**Complete**

This is a Tamil work on Vaisnavism describing the religious importance of the mantra addressed to Śrī Rāmānuja

## No 2180 లింగధారణ విషయ వివేచనము

## LINGADHĀRANAVISAYAVIVĒCANAMU

Substance palm leaf Size 15 1 inches Pages 5 Lines 4 on a page
Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing fair and free from mistakes

Complete

Begins on fol 1 *a* The other works herein are—4 *a* Akkamahā dēvicaritra, 38 *a* Vaisyagōtrapattika

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాతము లు లేవు

పూర్వము నోలె

ఇందలి గ్రంథాంతరము లివి —

4a అక్క మహాదేవి చరిత్ర (యక్షగానము), 38a వైశ్యగోత్ర పట్టిక

---

## No 2181 లింగైక్య వచనము

## LINGAIKYAVACANAMU

Substance palm leaf Size, 11⅞ × 1½ inches Pages, 9 Lines, 5 on a page
Character, Telugu Condition injured Appearance, old Mode of writing bad
Contains full of mistakes

Incomplete

A Vīrasaiva work describing how a devotee of Siva, who wears a Linga, with the belief that it is Siva himself, becomes one with Siva The name of the author is not known

**Beginning .**

లింగైక్య వచనంబున నేఁ నిష్టుండగు శివశరణు నిలక్షణంబు వివరించిచెప్పెద అస్తి భాతి, ప్రియరూప నామకంబులసిరెుడు అస్తి పంచకంబులని యెఱింగి అస్తి భాతి ప్రియం బులను ఆశాత్రయంబు బ్రహ్మంబైన బ్రహ్మంబును, లింగభ్రాంతి నిష్ఠితంబున క్రమంబున లింగంబని గురుతెఱింగి తక్కిన నామరూప ద్వయంబును జగద్రూపంబని నిర్ణయించి అందు విరాట్టు హిరణ్య గర్భా వ్యాకృతులను సమష్టితన—యంబుల నెఱింగి

**End .**

రంగవల్లి శ్రీ చందనాక్షత ప్రసూనధూప దీపనైవేద్య తాంబూలాదిగాఁగలయష్ట విధార్చన క్రమంబెఱింగి యమనియమాసన ప్రాణాయామ ప్రత్యాహార ధారణ సమాధు లనియెడు నష్టాంగముల నెఱింగి దృగ్దృశ్యంబులను పదార్థ ద్వయంబును దృగ్బ్రహ్మంబు ను దృశ్యంబును మాయగా నెఱింగి బ్రహ్మంబైన విషయంబున మధ్యస్థుఁడైయున్న భక్తుని లింగాంగు

* * * *

(వి-వి)—

అసమగ్రము వ్రాత మంచిదిగా [illegible] గలదు
గ్రంథపాతములు గలవు

శివశరీరుండగు [illegible] లింగము సే వ [illegible]
రణమునఁ దద్దైక్యమందు తెలిసి వివరింపఁబడినది ఇది [illegible] గ్రంథము [illegible]
తెలియఁగరాదు

---

## No 2182 విజ్ఞాన ప్రదీపిక

## VIJÑĀNAPRADĪPIKA

Substance, palm leaf Size, 16½ × 1½ inches Pages, 42 Lines 9 and 10 on a page Character Telugu Condition slightly injured Appearance, old Mode of writing, good but not free from mistakes

Begins on fol 1 *a* The other work herein is —22 *a* Ātmaikya-bōdha

Complete

A work in four āsvasas, on advaita system It describes, the nature of ātma, the doctrine of karma, the knowledge of ātma, the origin of pinda, the nature of the different planes of soul and the different kinds of Yōga The author is Mancalla Cennaviraya, grand son of Kisnayamantri and son of Gopayamantri, belonging to Kausikagōtra

**Beginning**

ఉ శ్రీ వనితాకుచ ద్వితయ సీమనలందినమంచి గంధపుం
డావులు బాహు మధ్యకర తామరసంబుల జోడు మెట్టఁగా
భావజ లీలలందనిసి భావవిశేషంబులఁ బొందియున్న రా
జీవ దళాక్షుఁడా ఘనుఁడు శ్రీయును భక్తులకిచ్చుఁ గావుతన్

* * * *

మ కవితామార్గ మెఱింగినందులకు సత్కారంబు చింతించి యా
స విశేషస్థితి శాస్త్రవాదములు చర్చల్ చేసి తత్త్వార్థముల్
వివిధోపాయములన్ గ్రహింపుకొనుటకై వేదాంత మార్గంబునే
భువిలోఁ దేటతెనుంగు చేసెద జగత్పూజ్యంబుగా వేడుకన్

వ ఈ కృతికి ధీశ్వరుండు

గీ షట్పములఁ జుట్టుకొన్నట్టి భ్రమర నివహ
మనఁగఁ గన్నులఁ గాటుక యందమొంద
నందగోపాలు మదికి నానంద మొసఁగు
భవ్యతరకీర్తి మదనగోపాలమూర్తి

సంస్కృతమునఁగల వేదాంత వార్తికమను నద్వైత వేదాంత ప్రకరణ గ్రంథమున కిది తెలుఁగుఁ సేత వాఁడుక తెలుఁగున నీ గ్రంథము రచింపఁబడినది ఎడనెడ పెక్కు సంస్కృత శ్లోకములు దహరింపఁబడినవి

ఇందలి గ్రంథాంతరములివి —1a, 86a, శుక సప్తతి (వచనము), 41a దిలారాము కథ, 97a కుచేలోపాఖ్యానము, 144a సారంగధర చరిత్ర (ద్విపద), 225a గురుబోధ

---

## No 2219 వేదాంత వార్తికము

## VĒDĀNTAVĀRTIKAMU

Substance, paper Size, 11⅜ × 7⅝ inches Pages, 75 Lines, 18 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair, but not free from mistakes

Begins on fol 65 *b* The other works herein are —1 *a* Rājasēkhara vilāsamu, 49 *a* Sānkhya vicāramu, 103 *a* Nirālambamanjari, 132 *a* Candrahāsavilāsamu

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిది తప్పులున్నవి శైదిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

పూర్వమువోలె

ఇందలి గ్రంథాంతరము లివి —1a రాజశేఖర విలాసము, 49a సాంఖ్య విచారము, 103a నిరాలంబ మంజరి, 132a చంద్రహాస విలాసము

---

## No. 2220 వేదాంత విషయము

## VĒDĀNTAVISAYAMU

Substance, palm leaf Size, 16 × 1¼ inches Pages, 9 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, very bad and full of mistakes

Begins on fol 55 *a* The other works herein are —1 *a* Akhandabrahmānandavirasaivarahsyapadavi, 21 *a* Rājayāgāmrtasāramu, 61 *a* Pātalu

Incomplete

Deals with some of the principles of Advaita

**Beginning**

> కూశ్మాండజం కుంకుమ ॥౧॥
> కాలంకపజ్ఞాన కృపాసముద్రమ్
> విద్యానిధింమండన మిశ్రభం॥౦
> శ్రీశంకరాచార్య గురుం నమామి

శుద్ధాశుద్ధ ద్వైతాద్వైత ఖండాఖండ ప్రకాశాప్రకాశ మయైన పరబ్రహ్మమందు అగ్నియందు ఉష్ణత్వంవలె అభిన్నముగా చిచ్ఛక్తి అని ఒక శక్తికలదు ఈ శక్తికి అతిశయమైన బ్రహ్మమందు శక్తి అడగియున్నపుడు శుద్ధబ్రహ్మము అనబడును ఈలక్షణం కాన్యమైన శక్తికి పరబ్రహ్మంయొక్క సన్నిధానమందు

**End**

ఈ ప్రకారాన దనభాగంబున భూతభూతంబులను చూచుకొనుట ఈ పంచమహా భూతంబులను ఒకటి యొకటి రెండేసి భావించి వొక సగాంశను విభజించి దక్కిన యంశలను నాల్గేసిగా భాగించి స్వాంశను విడిచి తక్కిన నాల్గు భూతాంశనుగూర్చ పంచీకరణంబయ్యె పంచీకృత మహాభూతంబులు పంచ భూతంబులనంబడును ఈ మహా భూతపంచకానకు కారణధర్మాలు కార్యమందు వుండును పంచభూ——

(వి-వి)——

అసమగ్రము వ్రాంత మంచిదిగాదు తప్పులున్నవి జైర్ణ్యము గలదు గ్రంధపాతములు గలవు

అద్వైత వేదాంతమునకు సంబంధించిన విషయములు పంచీకరణాదు లిందుగ గలవు

గ్రంథాంతమున మూండాకులలో పెండ్లి పాటలు (తెలుగు) గలవు ఒక యాకున భైరవ ధ్యాన జపాది విషయక మంత్రములు గలవు

---

## No 2221 వేదాంత విషయము

## VĒDĀNTAVISAYAMU

Substance palm leaf Size, 13⅜ × 1¼ inches Pages, 36 Lines, 5 on a page Character Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

A work on Advaita Vēdānta

**Beginning**

> అఖండం సచ్చిదానంద మవాఙ్మన సగోచరమ్
> ఆత్మాన మఖిలాధార మాశ్రయే భీష్ట సిద్ధయే

రాగమనిన్నీ ద్వేషమనిన్నీ కామమనిన్నీ క్రోధమనిన్నీ **అంతు 16**
గుణాలకు వివరం స్త్రీ విషయమును గురించివచ్చే చిత్తవృత్తికి రాగమనిపేరు తనకు ఒకడు అపకారము చేస్తేను దాన్ని ప్రతిక్రియశాయవలెనని

**End**

ఈ సాక్షి సాక్షాత్కార హీతంగా తలంపు మఱుపులేక ధ్యాన ధ్యేయం లేక తూష్ణీం సుఖస్వరూపం గురువాక్యంవల్ల తానని యెఱింగి నిలిచితే మూలప్రకృతి రహితమైన తన స్వరూపానికి ఆణవంతాను కాదని యెఱిఁగిన మఱపు మూలప్రకృతి అవును ఎఱుఁగుదును ఎఱుఁగను అని యీ రెంటికిన్ని మధ్యస్థఁగావుండేదే నిరతిశయానంద సుఖమని యెఱింగేది

(ఐ-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులు గలవు శైదిల్యము లేదు గ్రంథపాతములు లేవు

అద్వైత వేదాంత విషయమయిన గ్రంథమిది. పేరెఱుఁగరాదు

---

## No 2222 వేదాంత వ్యవహారసార సంగ్రహము
## VĒDĀNTA VYAVAHĀRASĀRA SANGRAHAMU

Substance, palm leaf Size, 16⅞ × 1⅛ inches Pages, 37 Lines, 7 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 46 *a* The other works herein are —1 *a* Śivajnāna manjari, 20 *a* Paratatvarasāyanamu, 65 *a* Ajnānadhvāntacanda bhāskaramu, 89 Upadēsakramamu 130 *a* Astāvakragītāśāstrmu

Comlplete

This is a brief exposition in Telugu of the Brahmasūtras written by Vyāsa, according to Śārīrakamīmāmśabhāsya of Śankara The author is Dattatrēyayōgi He was the religious teacher of Paramānandayati

**Beginning**

శ్లో॥ సర్వభూతాంతర స్థాయ నిత్యముక్త చిదాత్మనే
ప్రత్యక్చైతన్య రూపాయ మహ్యమేవన మోనమః

దత్తాత్రేయయోగి లోకోపకారార్థమై వేదాంత వ్యవహారసార సంగ్రహమనే గ్రంథము తెనుఁగున రచింపుచున్నాఁడు

వేదాంతమనఁగాను శారీరకసూత్ర భాష్యము ఆశారీరకసూత్రభాష్యార్థము సంగ్రహించిన గ్రంథాలన్నిని వేదాంత ప్రకరణాలనంబడును ఆశారీరకసూత్ర భాష్యానకు యే అనుబంధ చతుష్టయము కలదో -దే వేదాంతసార సంగ్రహమనేటి గ్రంథానకు ఆలోచించేటిదే అనుబంధ చతుష్టయంబనంబడును అనుబంధ చతుష్టయంబనంగాను అధికారి విషయసంబంధ ప్రయోజనాలును అధికారి అనగాను సాధన చతుష్టయ సంపన్నుఁడనంబడును సాధన చతుష్టయంబనగాను నిత్యానిత్యవస్తు

వివేకము, ఇహాముత్రార్థ ఫలభోగ విరాగము, శమాదిషట్క సంపత్తి ముముక్షుత్వము ఈ నాల్గు సాధన చతుష్టయం బనంబడును నిత్యానిత్యవస్తు వివేకమంటే —

**End**

స్థూలశరీర ధర్మాలన్ని ని క్షుత్పిపాసాదులు ప్రాణధర్మాలు అనిన్ని కామక్రోధ లోభమోహమదమాత్సర్య భయ కంపధైర్యాదులు అంతఃకరణ ధర్మాలనిన్ని తలంచును ఆత్మధర్మాలుగాను తలంచును ఈ చెప్పబడ్డ స్థూలశరీరాదులున్ను వీటియొక్క ధర్మాదులున్ను ఇవి అనిన్ని ఆత్మయినాగ కల్పితాలే అని తలచును ఈ కల్పితాలన్నింటికిన్ని అధిష్ఠానము అకల్పితమై సచ్చిదానంద స్వరూపమైనవాడను తానని యీడె అనుభవము కల్గి ప్రారబ్ధ కర్మం తీరితేను విదేహ కైవల్యమై సకలమున్ను పోయి అఖండ సచ్చిదానందమై బ్రహ్మమైవుండును

**Colophon**

వేదాంత సార సంగ్రహం సంపూర్ణము

(వి-వి)—

సమగ్రము ప్రాంతచక్కనిది తప్పులులేవు పౌనరుక్త్యము గలదు గ్రంథ పాతములు గలవు

వ్యాసకృతమగు బ్రహ్మసూత్రములకు, శంకరకృతమగు శారీరక మీమాంసా భాష్యము ననుసరించి సంగ్రహ రూపమున వాడుక తెలుగులో రచియింపబడిన సార సంగ్రహ రూపమయిన ప్రకరణ గ్రంథమిది—కర్త దత్తాత్రేయ యోగి ఈయన పరమానంద యతికి గురుడు గాబోలును

---

## No 2223. వేదాంతసారము

### VĒDĀNTASĀRAMU

Substance, paper Size, 8¾ × 6¼ inches Pages, 18 Lines, 29 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 9 *b* The other work herein is —1 *a* Rādhāmādhava-saṃvādamu

Complete

The order of creation, the creation of the human body etc , are described in this The name of the author is not known

**Beginning :**

పరా పరమందు శివం శివమందు శక్తి శక్తియందు నాదం నాదమందు బిందువు బిందువందు సదాశివం సదాశివమందు పరమేశ్వరుడు పరమేశ్వరుడియందు రుద్రుడు, రుద్రునియందు విష్ణువు, విష్ణువుయందు బ్రహ్మ బ్రహ్మయందు ఆత్మ ఆత్మయందు

ఆకాశం, ఆకాశమందు వాయువు, వాయువునందు అగ్ని, అగ్నియందు వుదకము ఉదకమందు పృధివి, పృదివియందు ఓషధులు, ఓషధులయందు అన్నం, అన్నంయందు నరమృగపక్షి స్థావర జంగమాదులుద్భవించును ఉద్భవించిన క్రమాననేమను మనుష్యుండు తన అంగుళాన తొంబై ఆరు అంగుళాల ప్రమాణం ఎన్మిది జానల పొడవు నాల్గు జానలవలయము, ముప్పదిమూడు కోట్ల రోమద్వారాలున్ను, ముప్పై రెండు మూళ్ల పెద్ద ప్రేగులున్ను, తొంబైరెండు సంధులున్ను

**End**

ఇవిగాక కేవలావస్థ శుద్ధావస్థ సకలావస్థ అని మూడు కలవు కేవలావస్థ అనగా మూలాధారానబడి సర్వాంగమున్ను లెక్కకు అణుమాత్రం మొలకుకటిక ఉండేది సకలావస్థ అనగా జాగ్రమందు క్రియతో కూడుకొని వుండేది అంతఃకరణాలు ప్రావుగా గూచేద శుద్ధావస్థ అనగా నేయేం యెఱుగకున్నాగానీ ఆచార్యుని కృపతో ఈ రెంటితోనూ బట్టవిడ్వక ఉండేది శుద్ధావస్థ కమలాలు మూటికి వివరం అనాహత కమలం కార్మికకమలం మాయాకమలం మున్నటిగుణాలు రెండున్ను యెఱుక మరుపు చేసేదిన్ని కామక్రోధాదులతో వుండేదిన్ని అనాహతకమలం పరదనాలయందు ఆసక్తి కలిగి కళాయుక్తుండై నడచెడి మాయా కమలం మున్నటి గుణాలు రెండుసరిగా వుండేది పుణ్యపాపాలు కల్గేది కార్మికకమలం

గ్రంథాంతమందీ వ్రాఁసిగలదు—

"తారణ నామ సం॥ ఆశ్వీజ బ॥౧౧ ఆదివారం ఉదయంవరకు వేదాంతసారం భరితేపూడి వరదయ్య సంపూర్ణంగా వ్రాయడమయినది ఈ ద్రస్తం మాజేటి సర్వేశలింగం ప్రసాది"

సమగ్రము వ్రాఁత అంత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

సృష్టిక్రమము, మానవ దేహసృష్టి అందు ఆధారస్థానముల నిరూపణము, వాని కార్యములు, మొదలగు విషయములిందు వివరింపఁబడినవి వాడుక తెలుఁగు రచనము నీ గ్రంథముగలదు కర్త పేరెఱుఁగరాదు

ఇందలి గ్రంథాంతరము—

1a రాధామాధవ సంవాదము

---

## No. 2224. వైష్ణవ గురుస్తోత్రము

### VAISNAVAGURUSTŌTRAMU

Substance, palm leaf Size, 8½ × 1⅜ inches Pages, 4 Lines, 10 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good, not free from mistakes

Begins on fol 18 *b* The other works herein are —1 *a* Tatva trayasāramu, 20 *a* Padivārtalu, 21 *a* Ananyagatitvādinirūpanamu, 27 *a* Pancasamskāraphalamu, 33 *a* Arthapancakajnānamu, 37 *b* Tirumantrācāryasisyapravartnamu, 46 *a* Sārārthacatustayamu, 47 *a* Nambillagārivārta, 48 *a* Srīvaisnavācāryasūktamulu 49 *a* Vajra sūcyupanisattu, 50 *a* Srivaisnavavaibhavamu, 53 *a* Bhāgavatasampra dāyasārānugunāstadasarthamulu, 71 Tatvatrayamu 83 *a* Visnvadhi kyanirūpanamu

Complete

Describes the deeds, etc , of the Vaisnava teachers

**Beginning**

సీ. కంచిమల్లాపురీఘన మయూరాఖ్యలఁ
దగుపట్టణములఁ బద్మాకరముల
హేమాంబుజంబున నీలోత్పలంబున
గలువ పూవులఁగల్గు గర్భములను
ఆశ్వీజతులయందు హరిధనిష్ఠలయందు
వరుణతారకయందు వరుసకోడ
దరగదాఖడ్గాయు ధాంశలకాసార
భూతమహా యోగిపుంగవులన
నవతరించి ముకుందమాయావిదూర
దేహులగుచును సాత్త్వికధీరులయిన
ఘనులమువ్వుర నెప్పుడేకాగ్రబుద్ధిఁ
దలఁతు నుతియింతు ధ్యానింతుఁ దగభజింతు

**End**

సీ. మేషచైత్రంబున శేషాంశవార్ద్రాఖ్య
తారనుపూధూరిధన్యులైన
ఆసూరి శ్రీ కేశవాచార్యసూను డై
రామానుజ ఖ్యాతిరమణ కెక్కి
రాజపుత్రికి బ్రహ్మరాక్షసి విడిపించి
అలపంచనంబుల నాశ్రయించి
గోపురంబుననుండి కోరి వైష్ణవులకు
చరమరహస్యంబు చాటిచెప్పి
దాశరథిఁ జంపిచోళుమంతంబుమాన్పి
భూప్రదక్షిణ మొనరించి పోరొనర్చి
పరమతస్థుల గెల్చిన భాష్యకారుఁ
దలఁతు నుతియింతు ధ్యానింతుఁ దగభజింతు.

(పి-చి)—

సంగ్రహము. కవి నీస పద్యములున్నవి ప్రాచీన్యము లేదు గ్రంథ పాతములు లేవు

వైష్ణవాచార్యుల తిరునక్షత్రములు వారు పుట్టిన ప్రదేశములు చేసిన పనులు ప్రస్తు తించుట యిందు గలదు

---

## No 2225 వైష్ణవ ప్రశంస

## VAISNAVAPRAŚAMSA

Substance, palm leaf Size, 11 × 1 inches Pages, 9 Lines, 6 on a page Character Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Describes the characteristics of a true Śrivaisnava

**Beginning**

అద్వేషశ్చానుకూలశ్చ దివ్యనామ ధర స్తథా
చక్రాంకో మంత్ర పారిచ వైష్ణవశ్చేతతః పరమ్
శ్రీ వైష్ణవ ప్రపన్నశ్చ ఏకాంతి చ తతః పరమ్
పరమైకాంత విఖ్యాతో దశైతే వైష్ణవాస్మృతాః

అని యీ శ్లోకం ప్రకారం అద్వేషులనిన్నీ అనుకూలులనిన్నీ దివ్యనామధారుల నిన్నీ చక్రాంకితులనిన్నీ మంత్రపారకులనిన్నీ వైష్ణవులనిన్నీ ప్రపన్నులనిన్నీ పరమై కాంతులనిన్నీ దశవిధములయి యున్నారు ఇందుకు ముందల అద్వేషులనగా యెవ్వ రంటేను,—

**End**

అటు గనుక కర్మజ్ఞాన భక్తులు నిత్యసంసారికి అనుష్ఠించేటందుకు కూడదు లోకమందు సంసారము విడిచిపెట్టి కర్మజ్ఞాన భక్తులందు నిష్ఠులై కైవల్యపదమందు పడిన వారికి యెన్నటికిన్ని సద్గతిచేరే మార్గములేదు గనుక నవియన్ని విడిచిపెట్టి శ్రీ మదనంత గరుడ విష్వక్సేనాదులు మొదలయిన నిత్యసూరులాళ్వారు లాచార్యులు మొదలయిన సమస్త శ్రీ వైష్ణవ వర్గముచ్చ స్వాచార్యాజ్ఞా పరతంత్రులై ద్వయాధికార నిష్ఠాయను ష్ఠేయులై నిర్భయ నిర్వికార నిశ్చిత శంకానిస్సంశయ నిర్దోష నిర్భరణ్యాను సంధా నపరులై కర్మజ్ఞాన భక్తినిష్ఠ లనహ వాసభవర్తకులై ఆచార్యవాంగ్మఖోపదేశ పరంపరా ప్రాప్తమై పరమరహస్యమైన తిరుమంత్రద్వయ పరమార్థములందు ధ్యానానుభావపరులై యందున పరమానందంబునొంది భగవద్దివ్యగుణాను భవానంద సాగరమగ్నులై మునింగి కడతేరి విరజదాటేకర్యంతమున్న మంత్ర రత్నానుసంధానం సంతతస్ఫురితాధరం అని అనతిచ్చినట్టు అనుసంధించుకొని శ్రీనకోటి నామాట కాయివామనే ప్రమాణంచేతను చర మాధికారులై సదా పశ్యంతి ననుభవింతురు

(వి ఓ)—

సమగ్రము వ్రాంత మంచిది తెప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు.

శ్రీవైష్ణవుడనగా నెట్టివాడు వాని లక్షణము లెట్టివి పత పడ పడ యాపదవి యెట్టిది అను విషయము లిందు చెప్పబడినవి

గ్రంథాంతమున 5 పుటలలో మీది విషయమునకు ప్రమాణ శ్లోకములును, పన్నిద్దరాళ్వార్ల పేళ్లను వ్రాయబడినవి

---

## No 2226 వైష్ణవ విషయము.

### VAISNAVAVISAYAMU

Substance, palm leaf Size 9⅝ × 1$\frac{5}{16}$ inches Pages, 166 Lines, 8 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and contains mistakes

Incomplete

Deals with certain principles of Tengalai sect of Vaisnavas

**Beginning**

శరణమని పెరియ తిరువడిఘళు పట్టుపట్టితే నమ్మాళ్వారితిరువడిఘళు రెండు విడుపు దివ్యమంగళ విగ్రహాలు దివ్యతిరువడిఘళ అనంతకోటి బ్రహ్మాండాలలోనికి అమృతసారాయానికి నిలుకడ అమృతసారాయము దిగబోతే అప్పటికి తనవు పరమాపురు అకారమందు మన్మథభూతం ఎకారమందు మాధవభూతం, మకారమందు విశోవిషు మహద్భూతం, మూడు భూతములుగన్న ప్రపన్నులకు మూడు గుంటలు విడుపు అవేవన్నను దారేషణ ధనేషణ పుత్రేషణలనే

**End**

ఇది గురుపరంపరా స్వరూపమున్ను ప్రకారమున్ను ప్రధాన్యమున్ను ప్రభావమున్ను యథాత్మ్యమున్ను నిష్ఠనున్ను సంపూర్ణము

* * * *

మఱియు కరంబునంబట్టిన కోలయువామహస్త గతంబయిన కడపగ్గంబును సేనాధూళి సంకులితంబయిన తిరుకుఖమండలంబును బంధనంబు క్రిందపడిన శ్రీపాదంబులుం గలిగి నీకు శేషత్వ స్వరూపంబయిన సారథ్యంబు సేయుచు స్వామిత్వంబు వహించిన నన్నుంబట్టి ధర్మకర్మంబులు 12 సకల ధర్మంబులు రాయవలదన్నచోటు కొందరౌననంగావల

(వి-వి)—

అసమగ్రము. వ్రాంత మంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యము గలదు. గంథపాతములు గలవు

శ్రీవచనభూషణము మొదలగు తెంగల వైష్ణవ సంప్రదాయపు గ్రంథములలోని భాగము లిందుఁ గలవు.

---

## No 2227 శతైకస్థలము

## ŚATAIKASTHALAMU

Substance, palm leaf Size, 16⅜ × 1½ inches Pages, 9 Lines, 5 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

A work on Saiva Vēdānta Particulars regarding the work and the author are not known from this

**Beginning**

శ్రీమహితోత్తుంగ చిరకృపాపాంగ
కామాదిరిపు భంగ ఘనసిద్ధ లింగ
పలనొప్ప నళచక్ర వాళ పర్వతము
వెలుఁగుగా విలసిల్లు నిషనిధు లేడు
కాల వలై యొప్పు కనకాద్రి ముఖ్య
శైలసంఘములు భూజగమగుచు (?)
స్ఫురియింపఁ బరమేష్ఠి పుండరీకాక్ష
సురలాది జీవులచ్చుగఁ దదారామ
పరిచర్యలై యొప్పు భాస్కర శీత
కరులు ముఖ్యంబైన క్రమముల వాడి

**End**

అపీర శైవ క్రియాచార విధులు
వేకూడవలయుఁ దచ్ఛిద్ధియుఁ గలుగు
చేకూడు జ్ఞానమా చిత్క్రియ లాదవు
సగుణలింగం బఁగ సంగతి మెపు
సగుణలింగం బంగ సంగలీనముగ
నెలకొన సిద్ధించు నిర్గుణలింగ
కలితానుభావ మాఘన లింగయోగ
సమరసమునను నివృతి లింగసంగ
మమరు నిష్ప్రీతిలింగ మందభినైక్య

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత మంచిది. తప్పులమయము. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు.

శైవవేదాంత విషయమించుక కలదు అసమగ్రముగా నుండుటచే గ్రంథకర్తను గూర్చి కాని గ్రంథ విషయమును గూర్చి కాని, యింత కెక్కువ తెలియరాదు

---

## No 2228 శరణాగతిద్విపద

## SARAṆĀGATIDVIPADA

Substance, palm leaf Size, 18¾ × 1¼ inches Pages, 7 Lines, 7 on a page Character, Telugu Condition, injured Appearance very old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 1 *a* The other works herein are —5 *a* Kuravañji, 16 *a* Viṣṇubhaktacaritra

Complete

A dvipada work written in praise of Rāmānujācārya The author is not known

**Beginning**

ద్విపద శ్రీ కరగుణధామ శ్రితజనస్తోమ
లోకైకనుత నామ లోకాభిరామ
వైష్ణవాంబుధిసోమ వర్జితకామ
* * * *
నామనోవల్లభ నాప్రాణనాథ
నామందిర నివాస నాగృహపోష
నాపెన్నిధానమ్మ నా మానికమ్మ

**End**

రక్షింపు రక్షింపు రామానుజార్య
రక్షింపు రక్షింపు రక్షక నన్ను
రక్షణ నేయుమా రమ్యయోగీంద్ర

గ్రంథాంతమందీ వ్రాత కలదు—

రుధిరోద్గారి నామ సం॥ ఫల్గుని నెల 19 వ తేది తోళ్ళ వెంకటరాఘవులు తన కొమారుడు రంగశాయి నాయుడికి తన స్వహస్తలిఖితముగా వ్రాసియిచ్చిన శరణాగతి ద్విపద సంపూర్ణం అద్దంకి తిరుమల తిరువేంగళాచార్యుల తిరువడిగళే శరణం

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులున్నవి శైథిల్యము కలదు గ్రంథపాతములు కలవు

విశిష్టాద్వైతమత ప్రవర్తకులగు రామానుజాచార్యుల స్తుతిరూపమగు ద్విపదకృతి యిది కర్తపేరిందు లేదు

ఇందీ గ్రంథాంతరములు కలవు—

5a కురవంజి, 16a విష్ణుభక్తచరిత్ర

## No 2229 శిఖామణి వచనము

## ŚIKHĀMANIVACANAMU

Substance, palm leaf Size, 16 × 1¼ inches Pages, 19 Lines, 5 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, good and free from mistakes

Complete

A prophesy regarding the future events in the Kali age, made by Jagadguru Lingayogindra to the people belonging to Pañcānanam community

**Beginning**

శ్రీమతు సకల సమస్థాది మధ్యాంతంబునం మహామ్మేరు నిర్మాణకర్తలైన మనుమయత్వష్ట శిల్పి విశ్వజ్ఞులైన అయిద్దాయ పంచాణనంవారికి శ్రీమన్మహామేఘ వానుండైన శ్రీ జగద్గురులింగ యోగీంద్రస్వాములువారు అంపించిన శిఖామణి తెలియవలెను కలియుగ ప్రమాణం సామీప్యమైనది

**End**

ఈ శిఖామణి చూచినవారు వ్రాసినవారు చదివినవారు విన్నవారు శ్రీ జగద్గురునికి అర్పితంగా ప్రమధగణారాధన శాయవలెను చేసినవారికి ఆదే సంపత్కారము ఆ చంద్రార్కస్థాయిగా వుందురు ఇదివఅకు వచ్చినపత్రికలు దేవళ్లు అపనమ్మికాదొనని ఈ కారణం అట్లుగె అపనమ్మికైనవారికి చేజేతదుఃఖాలు కలిగి ఉండిన్ని ఈ కారణగురువాక్యం తెలుసుకున్నా వాకే కారణ పురుషులు శ్రీమంగళ మహాశ్రింజేయును.

(వి-వి)—

సమగ్రము వ్రాతమంచిది తప్పులులేవు శైధిల్యములేదు గ్రంధపాతములులేవు

శ్రీ జగద్గురు లింగయోగీంద్రులను వారు పంచాణనంవా (కంసలి, కంచరి, వ్రడంగి, కమ్మరి, కాసె)రికి కలియుగమున భావికాలములన జరగబోవు విషయములివియని వ్రాసిపెట్టిన కాలజ్ఞానమిందలి విషయము దీనికి శిఖామణి వచనమనియుంబేరు

---

## No 2230. శివగీతలటీక

## ŚIVAGITALATĪKA

Substance, palm leaf Size, 14½ × 1⅜ inches Pages, 34 Lines, 6 and 7 on a page Character, Telugu. Condition, good Appearance, old. Mode of writing, fair but full of mistakes

Incomplete

This is a word for word meaning for the Vedantic work known as Śivagita The name of the author is not known

**Beginning**

సూతుఁడుపలికెను

> ఏవముక్త్వా మునిశ్రేష్ఠాగతే తస్మిన్ని జాశ్రమమ్
> అథరామగిరౌ రామః పుణ్యే గోదావరీతటే
> శివలింగం ప్రతిష్ఠాప్య కృత్వా దీక్షాం యథావిధి

మునిశ్రేష్ఠః-మునిశ్రేష్ఠుఁడయిన అగస్త్యుఁడు ఏవం ఈప్రకారంగాను, ఉక్త్వా పలికి, నిజాశ్రమం, తన ఆశ్రమమునుగూర్చి, గతేసతి వెళ్లినవాఁడై యున్నుండగాను, అథ, ఆతరవాతను, రామః రామభద్రుఁడు, రామగిరౌ, రామగిరియందు పుణ్యే పవిత్రమయిన, గోదావరీతటే-గోదావరి తీరమందు, యథావిధి, శాస్త్రము దప్పకున్నట్టుగాను, దీక్షాం-విరజాదీక్షను, కృత్వా-చేసి శివలింగం-శివలింగమును, ప్రతిష్ఠాప్య, ప్రతిష్ఠ చేసి

> భూతిభూషిత సర్వాంగో రుద్రాక్షాభరణైర్యుతః
> అభిషేచ్యజలైః పుష్పైర్గౌతమీ సంభుసంభవైః

**End**

> అహమేకో జగన్మృత్యుర్మృత్యోరపి మహీపతే
> గ్రసేహమేవ సకలం జగదేతచ్చరాచరం

ఏకః, ఒకడైనటువంటి అహం, నేను, జగత్, జగత్తులకు, మృత్యుః, మృత్యువును, మృత్యోరపి మృత్యువుకున్నూ మృత్యు, మృత్యువును, హేమహీపతే ఓ రాజా, అహమేవ, నేనయ్యే, చరాచరం, జంగమస్థావరాత్మకమైన, సకలం, సమస్తమున్నైన, ఏతత్, ఈ జగత్తును, గ్రసే, హరించుచున్నాఁడను.

> మమవక్త్రే హతాస్సర్వే రాక్షసాయుద్ధదుర్మదాః
> నిమిత్తమాత్రం త్వంభూయాః కీర్తిమాప్స్యసిసంగరే

యుద్ధదుర్మదాః, యుద్ధమందు మదించినటువంటి, సర్వే,

(వి-వి)—

ఈసమగ్రము నాలుగవ యధ్యాయమున కొంత మాత్రముగలదు వ్రాఁత తిన్ననిది తప్పులు చాలఁగలవు శైథిల్యము లేదు. గ్రంథపాతములులేవు

శివగీతలనఁబడు వేదాంత గ్రంథమునకిది ప్రతిపదటీక, కర్తపే రెంటుఁగారాదు.

గ్రంథాంతమున, 6 ఆకులలో శైవగేయములు గలవు పరమ నివాతదీపము భంగి తన్మయము శివయోగసుఖమగ్నుఁడేయోగి, పండితారాధ్యుని విలాపము (బసవ మృతివిని, బసవ పురాణమునగలది) తళుకు తళుక్కున తారకములగతి, తొలకరి మెఱుపులపోలుపుగనూ, ఇత్యాదులుగలవు

11 ఆకులలో వ్యాఖ్యశ్లోకములు పద్యములుగలవు.

## No 2231 శివగీతాటీక

## ŚIVAGĪTĀTĪKA

Substance, palm leaf Size, 17½ × 1¼ inches Pages, 248 Lines, 6 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but full of mistakes.

Complete

A word for word meaning for Śivagīta a work on Saivavēdānta

**Beginning**

సూత ఉవాచ

అథాపరం ప్రవక్ష్యామి శుద్ధకైవల్యముక్తిదం
అనుగ్రహాన్మహేశస్య భవదుఃఖౌఘ భేషజమ్

టీక-సూతః, సూతుడు, ఉవాచ, పలికెను, అథ, ఆతరువాతను, మహేశస్య, మహాదేవునియొక్క, అనుగ్రహాత్ అనుగ్రహంవల్లను, భవ, పాపమందుల, దుఃఖ, దుఃఖంయొక్క, ఓఘ, సమూహానకు, భేషజం, ఔషధమయిన, శుద్ధం, స్వచ్ఛమయిన, కైవల్యం, సాయుజ్యరూపమయిన, ముక్తిదం, మోక్షమును ఇచ్చేశాస్త్రమును ప్రవక్ష్యామి, చెప్పేను

నకర్మణామనుష్ఠానాన్నదానైస్తపసాపివా ।
కైవల్యం లభతే మర్త్యః కింతుజ్ఞానేన కేవలం ॥

**End**

ఇత్యుక్త్వా ప్రయయుస్సర్వే సాయంసంధ్యాముపాసితుం
స్తువంతస్సూత పుత్రం తే సంతుష్టా గోమతీతటం

ఈక్రమాన పలికి ఋషీశ్వర్లు సంతోషించినవారై కుంచూన్నూ, స్తోత్రంచేస్తున్న సాయంకాల సంధ్యానిమిత్తము గోమతీ తటానకువెళ్లిరి

**Colophon**

ఓంతత్సదితి శ్రీమత్పాద్మే మహాపురాణే పూర్వఖండే పంచాశత్సహస్రికాయాం సంహితాయాం శ్రీమచ్ఛివగీతా సూపనిషత్సు బ్రహ్మవిద్యాయాం యోగశాస్త్రే శ్రీశివ రాఘవ సంవాదే మోక్షాధికార నిరూపణంనామ షోడశోధ్యాయః

గ్రంథాంతమం దిట్లుగలదు

శ్రీబాలాత్రిపురసుందరీభవానీ సమేత శ్రీరామ రామేశ్వరార్పణమస్తు

ప్రమాదినామ సంవత్సర చైత్ర శు ౭ స్థిరవారం రాత్రివరకు దెందులూరు కనకయ్య వ్రాసిన ప్రతిచూచి మాజేటి సర్వేశలింగం దస్తూరని వ్రాసిన శివగీతలు టీకామూలం (వి-వి )—

సమగ్రము వ్రాతమంచిది తప్పులమయము శైథిల్యము గ్రంథపాతములు లేవు.

శివగీతలను శైవవేదాంత గ్రంథమునకు ప్రతిపద టీక యిది తప్పులమయము

## No 2232. శివజ్ఞాన మంజరి

## SIVAJÑĀNAMAÑJARI

Substance, palm leaf Size, 16⅞ × 1⅜ inches Pages, 37 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 37 *a* The other works herein are —20 *a* Paratatva-rasāyanamu, 46 *a* Vēdāntavyavahāra Sārasangrahamu, 65 *a* Ajñāna-dhvāntacandabhāskaramu, 89 *a* Upadēsakramamu, 130 *a* Astāvakragitāsāstramu

Complete

Topics on Saiva, Yōga and Vedanta are dealt with in this Paramānandayati disciple of Dattātrēyayati is the author

**Beginning**

ద్విపద శ్రీగురువరమూర్తి వర్తి
భోగమోక్షస్ఫూర్తి మారిసత్కీర్తి
నతిరమ్యగుణహారు నబ్ధిగంభీరు
* * * *

నిరుపమవిజ్ఞాన నిపుణాంతరంగు
బరయోగి జనమనోవనజ సారంగు
నాపాలిదేవుని నాగురునాదు
నాపాలిపెన్నిధి నన్నేలువేల్పు
నొనరదత్తాత్రేయ యోగిపుంగవుని
మనసున వాకున మఱి కాయమునను
భావించి నుతియించి భక్తివిమించి
సేవించి పూజించి చి
అతిముదంబునఁ బరమానందతీర్థ
యతినామధేయుండ నిం? వుదలిర్ప
మహిత శివజ్ఞానమంజరి యనఁగ
మహిలోనఁ బ్రాజ్ఞసమ్మతిగాఁగఁబూని
రచియించెదను లోకరక్షణార్థముగ
బ్రచురంబుగా నాంధ్రభాషమునాని
సిద్ధానుభూతి సంసిద్ధివహించు
సిద్ధులు లోకప్రసిద్ధులునెమ్మి
మున్ను చేసిన యట్టి ముఖ్యశాస్త్రంబు

లన్ని యుఁజూచినే నందుల యర్థ
భావమెల్లను దేట పఱచెదఁ బ్రౌఢి
* * *

**End**

నిర్మలుండను నేను నిత్యుండ నేను
నిర్గుణుడను నేను నిత్యతృప్తుడను
దీప్తమై దివ్యమై తిన్ననైనట్టి
జ్ఞప్తికళామాత్ర సంజ్ఞుండ నేను
పరిపూర్ణుడను నేను బ్రహ్మంబ నేను
పరమ చిదాకాశ భరితుండ నేను
ఆత్మానుభూతి లెస్సలరె నా కెలిమి
ఆత్మవిశ్రాంతి నేనందితిఁ బ్రీతి
ధన్యుండనైతి మీదయవల్ల నిపుడు
మాన్యుండనైతిని మహనీయవిభవ
జయజయగురులింగ జయకృపాపాంగ
జయకలుషవిభంగ సరసప్రసంగ
జయభక్త పరిపోషసన్నుతవేష
* * * *
గురుఁడు చెప్పిన యట్టి గుఱియందతగలి
నిరతిశయానంద నిత్యుఁడైయుండె
ననుపమీఱంగ దత్తాత్రేయగురుని
యనుఁగుశిష్యునిఁ బరమానందతీర్థ
లానరించె నీకృతి నుత్సాహలీల
వినినంత నపరోక్షవిజ్ఞానమొదవు
మఱియు శివజ్ఞానమంజరియనఁగ
కరమొప్పు జగతి విఖ్యాతముగాఁగ
పరమయోగీంద్రులు భళియనుచుఁ బొగడ
ధరలోన నాచంద్ర తారార్కముగను

గ్రంథాంతమందీ క్రింది వ్రాఁత గలదు.

శ్రీమదఖండ సచ్చిదానంద నిత్యపరిపూర్ణ శ్రీ నృసింహసద్గురు బ్రహ్మణే నమః

(వి-వి)—

సమగ్రము వ్రాఁతచక్కనిది. తప్పులంతగాలేవు. శైథిల్యము చాలఁగలదు గ్రంథపాతములు చాలఁగలవు.

శివయోగ వేదాంతవిషయము లిందుఁ బ్రతిపాదింపఁబడినవి. దత్తాత్రేయ యోగిశిష్యుండగు పరమానందయతి దీనికిఁ గర్త.

## No. 2233 శివజ్ఞాన మంజరి.

## ŚIVAJNĀNAMANJARI

Substance, palm leaf Size, 12¼ × 1½ inches Pages, 28 Lines 9 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, not good and not free from mistakes

Begins on fol 1 *a* The other work herein is —15 *a* Muktikāntā-kalyānamu (Yakṣagāna)

Same work as the above

Complete

(వి-వి)—

సమగ్రము వ్రాఁత మంచిది కాదు తప్పులున్నవి శైథిల్యము కలదు గ్రంథపాతములు లేవు

పూర్వమువలె

ఇందలి గ్రంథాంతరము 15a ముక్తికాంతా కళ్యాణము (యక్షగానము).

---

## No. 2234 శివభక్తిదీపిక.

## ŚIVABHAKTIDĪPIKA.

Substance, palm leaf Size, 7¼ × 1½ inches Pages, 31 Lines, 6 on a page, Character, Telugu Condition, injured Appearance, old Mode of writing fair, free from mistakes

Complete

Written in praise of Śiva, by Rangana who regained his sight by the grace of Mallikārjuna (Śiva) worshipped at Śrisaila.

**Beginning**

క. శ్రీ పార్వతీశుఁ జూడక
పాపాత్ముఁడనగుచుఁ బోవఁ బథమునఁ జక్షుల్
దీపించు దృష్టిఁ దొలఁగిన
శ్రీపతినడుగంగఁ జెప్ప శివుఁడే కర్త నీఁ (కర్త శివుఁడని చెప్పెన్)

రగడ

శ్రీశైలవల్లభుని శిఖరంబు పొడగంటిఁ
గాశీపురాధీశు గౌరీశుఁ బొడగంటి
సర్వలోకేశ్వరుని సార్వేశుఁ బొడగంటి
సర్వసంరక్షకుని సర్వంబు పొడగంటి
పరమాత్ము నీశానుఁ బరమేశుఁ బొడగంటి
పరమయోగీంద్ర హృత్పద్మనిలయుని గంటి

చంద్రార్క శతకోటి సంకాశుఁ బొడగంటి
చంద్రార్క శశి నేత్రు శంకరునిఁ బొడగంటి

**End**

శంకరుని కృపవడయ సమయమిది యనికంటి
నింక శ్రీగిరిఁజేరనేఁగందు ననికంటి
నింకఁగృతి చెప్ప నాకేమి భరమని కంటి
వడిఁగృతుల్ నాయొత్తువచ్చునని పొడగంటి
మృడుఁ డింక నాకృతుల్ మెచ్చునని పొడగంటి
తనర శిరంగకవిదాత యని పొడగంటి
భువిలోపలఁ బ్రసిద్ధ పుణ్యుఁడననగాఁ గంటి
శివభక్తి దిపికావం (?) దార్య్యమనికంటి
శ్రీగిరీశుకు సమర్పింతునని పొడగంటి
శ్రీగిరీశ్వరుని కృపచెన్నలరునగికంటి

గ్రంథాంతమం దీ వ్రాఁతగలదు— "ప్రవాళం వీరసంగయ్య వ్రాసిన నయన రగళ"

(వి వి)—

సమగ్రము వ్రాఁతమంచిదిగాదు తప్పులున్నవి శైథిల్యముగలదు గ్రంథపాతములు కొలఁదిగాఁగలవు

నయన రగడయని నామాంతరముగల యీ ప్రాచీనగ్రంథము శివదర్శనము చేయక త్రోవదాటుటచే కనులుపోయినవాఁడు రంగనయనునాతఁడు విష్ణువుచే (అహోబలనృసింహునిచే) నిబోధితుఁడై శ్రీశైల స్వామియయిన మల్లికార్జునదేవుని మరలివచ్చి దర్శించి తదనుగ్రహమున కనులుగలిగి క్షేమముంది రచించిన శివపారమ్య ప్రతిపాదన పూర్వక స్తుతి ప్రశంసా గ్రంథముగా గుర్తింపనగుచున్నది

---

## No 2235 శివభక్తిదీపిక

## ŚIVABHAKTIDĪPIKA.

Substance, palm leaf Size, 11½ × 1½ inches Pages, 15 Lines, 4 and 5 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as described under No 2234

(వి-వి)—

ఆసమగ్రము వ్రాఁత తిన్ననిదిగాని తప్పులు చాలఁగలవు. శైథిల్యములేదు. గ్రంథపాతములు లేవు

పూర్వవర్ణితమే కాని పాఠభేదములుఁగలవు
గ్రంథాంతమందీ వ్రాఁతముఖ్యమయినది గలదు —

"వైష్ణవ చక్రపాణి రంగనాథుఁడు శైవదీక్షాధరుఁడైన తర్వాతను చేసిన నయన -గళ"

---

## No 2236 శివయోగసారము

## ŚIVAYŌGASĀRAMU

Substance, palm leaf Size, 16½ × 1½ inches Pages, 149 Lines, 8 or 9 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, not good and not free from mistakes

Incomplete

This appears to be the Telugu version of the same work in Sanskrit, explaining some of the principles of Śaiva religion The work is in two parts The first part contains eight āśvāsas and the second part contains four The author is Kolani Ganapatidēva, son of Mūlanāmātya He was a disciple of Cennasadāśivayōgi

**Beginning**

క. శ్రీ గురులింగ సదాశివ
యోగీంద్రకులాబ్ధి చంద్రయోగి వినుతశై
వాగమసారార్థజ్ఞా
నాగారయిడూరి సూకనారాధ్యవరా!

ఆ. శైవయోగశాస్త్రసారసముచ్చయ
ప్రకరణముల యర్థభావమెల్లఁ
దెనుఁగుఁ గవితఁ దేట తెలివిగనే భవ
దాజ్ఞవిన్నవింతు నవధరింపు

చ. గణపతి దేవనామమునఁ గల్గినయీ శివయోగసారముం
బ్రణుత మహాప్రబంధమునఁ బల్కితి నీ కృతియఁ బూర్వభాగముం
ద్రిణయనభక్తు తౌనఁగదింతు సదాశివయోగినాథ ధీ
మణియనరాఢి కెక్కు గరిమంబున నుత్తరభాగమేర్పడన్

శా. విశ్వేశస్థిరభక్తి వర్ధిలఁగ నుర్విన్ బూర్వభాగాష్టసం
ఖ్యాశ్వాసంబులఁ గర్మయజ్ఞముఁ దపోయజ్ఞ ప్రకారంబు స
ద్విశ్వైశ్వర్య ప్రదమై తనర్చు జపయజ్ఞాచారముం గూడఁగా
విశ్వస్తుత్యగతిం ప్రబంధమమరన్ విఖ్యాతప్రసాద్యమై

క ఈ యుత్తరభాగంబున
నాయతిరచియింతు నాలుగాశ్వాసములన్
బాయక ధ్యాన జ్ఞాన స
మాయజ్ఞద్వయము యతిజనానందముగాన్

క శివయోగమిందు నెంతయు
నవిరళమై వెలయునందు కనుకూలముగాఁ
బ్రవిమలమతినాత్మస్థిత
శివలింగము నాత్మఁగొల్తుఁ జిన్మయలీలన్

**End**

క అని యిట్లు మీక్కృప జనిం
చిన మతిని రచించినాఁడ శివయోగజ్ఞా
నవిధానంబుగఁ గృతిగా
కొనమిది శ్రీసూకనార్య గురుగుణధుర్యా

మాలిని

సదభినుత సువేషాసాధితారక్తి యోషా
చిదమృత పరితోషా క్షీణదుర్మోహదోషా
విదితఘనమనీషా విస్ఫురత్సత్యభాషా
విదళితభవదోషా వీరశైవైకభూషా ।

**Colophon**

ఇది శ్రీ గురుచెన్నసదాశివయోగీంద్ర పాదారవింద మధుకరాయమాణ నిరంతర శివభక్తి సమాధాన కొలనియాది మూలనా మాత్యపుత్త్రకవి జనమిత్ర అన్యస్తుతి పరాఙ్ముఖ శివస్తుతిసుముఖ సరసకవిత్వ విరచిత ప్రభావ గణపతిదేవప్రణీతంబైన శివయోగసారంబునందుత్తర భాగంబు సర్వమును జతుర్థాశ్వాసము

(వి-వి)—

ఉత్తరభాగము నాలుగాశ్వాసములు సమగ్రముగాఁ గలవు ప్రాఁతమంచిదికాని తప్పులు గలవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

శైవమత సంప్రదాయ విషయము లిందు వివరింపఁబడినవి ఇది సంస్కృత గ్రంథమునకుఁ దెలుఁగైయుండును ఇది పూర్వభాగమని ఉత్తరభాగమని రెండు భాగములు గలది పూర్వభాగమున అశ్వాసములు ఎనిమిది ఉత్తరభాగమున అశ్వాసములు నాలుగు గ్రంథకర్త కొలని- గణపతి దేవుఁడు- మూలనామాత్యుని కుమారుఁడు చెన్న సదాశివయోగీంద్రుని శిష్యుఁడు- శ్రీగురులింగ సదాశివయోగి వంశుఁడగు సిద్ధూరి సూకనారాధ్యుని కిది యంకితము సేయబడినది ఈ లైబ్రరిలోని ప్రతులలో కృత్యవతరణిక లేదు కాని, యితరత్ర ప్రకటితమగు దీని కృత్యవతరణికవలన కాకతీయులనాటి చరిత్రాంశము లనేకము తెలియగనగును.

## No 2237 శివయోగసారము

## ŚIVAYŌGASĀRAMU

Substance, palm leaf Size, 14½ × 1⅜ inches Pages, 269 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above

For particulars see the manuscripts under No 2236

**Beginning**

తుల్యమహా—

జ్ఞానమార్గంబయి శివలోకానందమగు పూర్వజాలు నప్పలుప్పులకు

గీ తగుశివజ్ఞాన విద్యా ప్రదానమహిమ
తద్విలిఖిత మహీయపుస్తక విశేష
మతులితంబగు ఫలము సువ్రతచరిత్ర
యద్భుతాస్పదమిది తెలియింగవినుము

గీ భూమి నెవఁడు శివజ్ఞాన పుస్తకంబు
వ్రాసి భక్తున కిచ్చుఁదదక్షర సంఖ్య
యారు సహస్రంబు లిరువది యొక తరముల
తోడ స్వర్గస్థుఁడై శివుఁగూడుఁ బిదప

వ మఱియు శివజ్ఞాన పుస్తకంబు వ్రాయుటకై యనేకఖ్యంబులు శివభక్తులకు నివేదించినఁ దత్ఫలంబు లెన్ని ప్రథమాశ్వాసాంతమున

క సతతత్మోనాయక వం
దిత పాదాంభోజ బుధవిధేయ సమగ్రో
న్నత తేజవీరశైవ
స్థితశీలాయమిత గుణవిశేషసమాజా!

మాలిని

ప్రకట సకల యోగీంద్ర ప్రభావానురాగీ
వికచహృదయ పద్మావేశ శైలాస పద్మా
వికిరనిఖిలదోషా వేద తత్త్వార్థభాషా
సుకృతమయ సుశీలాసూరి భావానుకూలా!

**Colophon**

ఇది శ్రీగురు చెన్న సదాశివ యోగీంద్ర పదారవింద మధు కరాయమాణ నిరంతర శివ భక్తి సమాధాన కొలనియాదిమూల నామాత్య పుత్ర అన్యస్తుతి పరాఙ్ముఖ శివ స్తుతి సుముఖ కవిజనమిత్ర సరసకవిత్వ విరచిత ప్రభావ గణపతిదేవ ప్రణీతంబైన శివ

యోగ సారంబునందు పూర్వ భాగంబున నభీష్టదేవతా ప్రార్థనంబును, సుకవిస్తో-
త్రంబును కవీశ్వరవంశావతారంబును కృతిపతియగు శ్రీ గురువంశ పరంపరయును,
కృతి ప్రారంభంబును, కైలాస వర్ణనంబును పరమేశ్వరు కొలువు చాతుర్యంబును, సం-
సార మోక్షోపాయానుష్ఠేయంబును, శివభక్తి పుణ్య చరిత్రంబును మహాప్రమేయంబునం
కుమార కుంభసంభవ సంవాదంబును బ్రహ్మాండ పిండాండ లక్షణంబులును జీవలక్షణంబు-
ను వర్ణాశ్రమ ధర్మంబులును, కన్యాదాన ప్రశంసయు అతిథి పూజా విశేషంబులును
పాత్రాపాత్రదానఫలంబులును నధర్మభేదంబులు దత్ఫలంబులు నుత్తమ ధర్మ నిరూపణం-
బులు నున్నది ప్రథమాశ్వాసము

ద్వితీయాశ్వాసాదిని

క. శ్రీరమ్యయశోనిలయ స
దారాధిత నీలకంఠ యోగానువిహితా
చార నిరంతర శివయో
గారూఢమనస్క సూక నారాధ్యవరా!

**End**

ఉ. నీరజ గర్భుఁడీగతిఁ జనించి త్రిలోకములున్ సృజింపఁగా
గోరిసహాయ సంపదకొకొండును లేమి నశక్తుఁడై మదిన్
భారకుఁడైతగంబడురు ఋష్ములనుద్భవిలంగఁజేయుచున్
వారలతోడ నాకడకువచ్చి ప్రణా

(వి-వి.)—

అసమగ్రము ఆవతరణిక లేదు గ్రంథారంభ భాగమున లేదు తృతీయాశ్వా-
సమున కడపటి పట్టు లేదు వ్రాఁత తిన్ననిది తప్పులు గలవు శైథిల్యము లేదు
గ్రంథపాతము లక్కడక్కడఁగలవు —

దీనిగూర్చి వివరణము నె 2236 రున జూచునది

---

## No 2238 శివయోగసారము

## ŚIVAYŌGASĀRAMU

**Substance**, paper **Size**, 13¼ × inches **Pages**, 21 **Lines**, 22 on a page **Character**, Telugu **Condition**, slightly injured **Appearance**, old **Mode of writing**, fair but contains full of mistakes

Begins on fol 108-*a* The other works herein are —1-*a*, Krsnavēṣakatha, 12 *a* Āndhradipika, 23 *a*, Dēsipadanighantuvu, 48-*a* Vaidya-nighantuvu, 120-*a* Caudappasatakamu, 129 *a* Vēmanapadyamulu and 141-*a* Vijayavilāsamu

Incomplete

Same work as the above.

(వి-వి)—

అసమగ్రము ఉత్తర భాగమున చతుర్థాశ్వాసమున తొలి 154 పద్యములు లేవు వ్రాతతిన్ననిది తప్పులు చాలఁగలవు

పూర్వము వోల

ఇందే యితర గ్రంథములుగలవు —కృష్ణశతకము 1a, ఆంధ్ర దీపిక 12a, దేశపది నిఘంటువు 23a, వైద్యనిఘంటువు 48a, చౌడప్ప శతకము 120a, వేమన పద్యములు 129a, విజయవిలాసము 141a

---

## No 2239 శివయోగసారము

### ŚIVAYŌGASĀRAMU

Substance, paper Size, $9_8$ × $7\frac{3}{8}$ inches Pages, 56 Lines, 19 on a page Character, Telugu Condition, injured Mode of writing, good but contains full of mistakes

Begins on fol 327 *a* The other works herein are —1*b* Venkatācalamāhātmyamu (Varāhapurānamu), 157 *b* Venkatācalamahatmyamu (Bhavisyōttarapurānamu), 238 *b* Vīranārāyanasatakamu

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము ఉత్తర భాగమునఁ జతుర్థాశ్వాసము మాత్రముగలదు వ్రాత తిన్ననిది తప్పులు చాలఁగలవు

పూర్వము వోల

ఇందలి గ్రంథాంతరములివి

వేంకటాచల మాహాత్మ్యము (వరాహపురాణము) 1b, వేంకటాచల మాహాత్మ్యము (భవిష్యోత్తర పురాణము) 157b, వీరనారాయణ శతకము 238b

---

## No 2240 శివయోగసారము

### ŚIVAYŌGASĀRAMU

Substance, palm leaf Size, $16\frac{1}{4}$ × $1\frac{3}{8}$ inches Pages, 253 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, fair not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి )—

అసమగ్రము ఉత్తరభాగము మాత్రమే కలదు చతుర్థాశ్వాసారంభమున తొ మ్మిది పద్యములు లేవు వ్రాత భిన్నమిది తప్పులు చాలగలవు

పూర్వము వోలె

గ్రంథాంతమందీ వ్రాతగలదు—

“ భావనామ సంవత్సర చైత్ర శు 3 గురువారంపర్యు శివయోగసారం ప్రతి నన్న క్రమానచాగంటి గొర్రాజు సంపూర్ణంగా వ్రాసెను ”

---

## No 2241 శుకాష్టకటీక

## SUKĀSTAKATĪKA

**Substance, palm leaf Size 17½ × 1¼ inches Pages, 8 Lines, 5 and 6 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair, free from mistakes**

Begins on fol 1 *a* The other work herein is —5 *a* Mahāvākyavivēkatīka

Complete

This is a Telugu rendering of Śukāstaka a portion in Sri Bhāgavata

**Beginning**

భేదాభేదౌ సపదిగళితౌ పుణ్యపాపే విశీర్ణే
మాయామోహౌ క్షయమధిగతౌ నష్టసందేహవృత్తిః
శబ్దాతీతం త్రిగుణరహితం ప్రాప్య తత్త్వావబోధం
నిస్త్రైగుణ్యే పథివిచరతాం కోవిధిః కోనిషేధః

సపది = ఇప్పుడు “ భేదాభేదౌ = జీవ బ్రహ్మలకు రెంటికిన్ని, భేదజ్ఞానము = అభేద జ్ఞానము రెండున్ను, గళితౌ, విడినవి = పుణ్యపాపే, పుణ్యపాపములు, విశీర్ణే జీర్ణములయినవి మాయామోహౌ = ఈశ్వరోపాధికమయిన మాయాన్ను జీవోపాధికమయిన అవిద్యాన్ను నష్టసందేహవృత్తిః = నష్టమైన సందేహ వృత్తులు కలిగినవై, క్షయం = నాశమును, అధిగతే = పొందినది శబ్దాతీతం = వాగతీతమయినటువంటి, త్రిగుణరహితం = గుణత్రయరహితమయినటువంటి, తత్త్వావబోధం = బ్రహ్మానుభవమును = ప్రాప్యపొంది, నిస్త్రైగుణ్యే = గుణత్రయాతీతమయినటువంటి, పథి మార్గమందు, విచరతాం = సంచరించేవార్లకు, కోవిధిః = ఏమి విధి, కోనిషేధః = ఏమి నిషేధము

**End**

సత్యం సత్యం పరమమమృతం శాంతి కళ్యాణ హేతుం
మాయారణ్యే దహనమమలం శాంతి నిర్వాణదీపమ్

తేజో రాశిం నిగమసదనం వ్యాసపుత్రాష్టకం యః
ప్రాతఃకాలే పఠతి వచసా యాతి నిర్వాణ మార్గం

పరమం = ఉత్కృష్టమైనటువంటిన్నీ, అమృతం = మోక్షసాధనమైనటువంటిన్నీ, శాంతి కళ్యాణహేతుం = శాంతిఅనేటిశుభానకు కారణమైనటువంటిన్ని, మాయారణ్య = మాయా ప్రపంచం అనే అరణ్యమందు, దహనం = అగ్నిహోత్రమైనటువంటిన్నీ, అమలం = నిర్మలమైనటువంటిన్నీ, శాంతి నిర్వాణదీపం = మోక్ష లక్ష్మీ ప్రకాశమైనటువంటిన్ని = తేజో రాశిం = తేజఃపుంజమైనటువంటిన్నీ, నిగమ సదనం = వేదాలకు గృహమైనటువంటిన్ని, వ్యాసపుత్రాష్టకం = శుకాష్టకమును, యః = ఎవడు, ప్రాతఃకాలే = ప్రాతఃకాలమందు, వచసా = వాక్కుచేతను, పఠతి = పఠిస్తున్నాడో, సః = వాడు, నిర్వాణ మార్గం = కైవల్యమును, యాతి = పొందుచున్నాడు, సత్యం = సత్యము, శ్రీ సచ్చిదానందగురుమూర్తయేనమః —

**Colophon**

శ్రీదశమే-దశమస్కంధమందు,-షడ్వింశే-ఇరువైఆరో అధ్యాయమందు, దశమ. సర్గాదులలో సర్గ-విసర్గ-స్థాన-పోషణ-ఊతి-మన్వంతర-ఈశాన-కథ-నిరోధముక్తి-ఈ తొమ్మిదింటికంటె పదోది అయి ఆశ్రయమైనటువంటి-పరబ్రహ్మస్వరూపమైనటువంటి-హరిః-స్వజ్ఞానద్వారా బంధాన్ని హరించేసేటువంటి-షడ్వింశ,-ఇరవైఆరోవాడైన ప్రత్యగాత్మ వ్యక్తః స్ఫుటంగా వివేచనశాయబడ్డది-సః-ఆ ప్రత్యగాత్మ-ఖనశ్చ తిరిగిన్నీ-పంచవిశత్వాత్-ఇరువై అయిదోవాడైనందువల్ల నంటిన్ని-చతుర్వింశతితః - ఇరువైనాలుగింటికంటెను పృథక్-, వేరైనవాడు

గ్రంథాంతమందీ వ్రాసేగలదు

పార్థివసం ఫాల్గునశు ౮ శుక్రవారాన కస్తూరి గవతన్న స్వంతమునకు శుకాష్టకం శ్రీరామార్పణంగా వ్రాసుకొనైను."

(వి-వి)—

సమగ్రము వ్రాసేమంచిది తప్పులులేవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

శ్రీ భాగవతమందలి శుకాష్టకమను వేదాంత విషయ శ్లోకములకిది తెలుగుటీక.

---

## No 2242 శైవ ప్రభావము.

## ŚAIVAPRABHĀVAMU

Substance, palm leaf Size, $10\frac{1}{4} \times 1\frac{1}{4}$ inches Pages, 60 Lines, 5 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, not good but full of mistakes.

**Incomplete**

A collection of verses by different authors on the wearing of Śiva Linga and the greatness of Śiva

**Beginning**

ఇది పురాణ ప్రమాణం   స్కాందే శంకర సంహితాయామ్

శ్లో॥ యోహస్త మత్స్యే నిజలింగమిష్టం
విన్యస్య తల్లీనమనః ప్రభావః
బాహ్యక్రియా సంకుల నిస్పృహాత్మా
త్సం పూజయత్యంగ * సవీరశైవః

తదేవ హస్తాంబుజ పీరమద్యే
నిధాయలింగం పరమాత్మచిహ్నమ్
సమర్చయెదేకధియోపచారై
స్సమస్త బాహ్యాంతర భేదభిన్నైః

* * * *

క నారాయణానువాకం
బారూఢిగ జంత్రసూర్యాలాది
చారుతర శంభులింగము
దారుధరింపుడరు హస్తతలమున ననియెన్

చ వలనగ హస్తమందు భగవంతుని నీశుని ఫాలనేత్రునిన్
నిలిపిసమస్తవేద్య శివనిత్య మహాత్మ్యయు తల్లిదండ్రులన్
బులుపుగ సేవెయించుడమ బుద్ధి నెరుంగుచుఁ బూజ సేయఁగా
వలయు మహాత్ములై తనరువారికినంచును బల్కె బుక్కొగిన్

సీ పిడుకలగంపయుఁ బెనుగడ్డిమోపును
మైలకోకలమూట మాలకాకి
నల్లలకావళ్లు పెల్లుప్పు విధవలు
నొంటి బ్రాహ్మణుఁడు చౌడుప్పు బండి
యిద్దరు శూద్రులు యినుమంగలంబులు
ముగ్గురు కోమట్లు మూఁగవాండ్రు
నలుగురు రాజులు నాతులు తొమ్మండ్రు
షంగులు నంధులు పరగజనులు
నెదుట నగపడ్డ పయనంబు నెవ్వఁడరుగు
వానికార్యంబువిఫలంబు వసుధలోన
అనుచుఁ జెప్పంగవిందుము ఆగమమున
పర్వతాధీశమల్లేశ పార్వతీశ

సీ॥ సూర్యోదయము వేళఁ జూచి యుత్తరదిక్కు
 చనిన కార్యంబెల్ల సఫలమగును
పొలుపు మధ్యాహ్నన పూర్వపు గగనంబు
 యెగిన నరుఁడు సత్కీర్తినొంద
భానుఁడు గ్రుంకునప్పటివేళఁ జూచియు
 దక్షిణావేగిన ధనము గల్గి
నడియర్ధరాత్రంబు నడచి పశ్చిమ దిక్కు
 పోయిన కార్యంబు పొంకమగును
గాన పంచాంగ శుద్ధియుఁగల్గకున్న
 తిథివార నక్షత్రయోగ కరణములు చూకున్న
చంద్రతారాబలంబులు చాలకున్న
 యెగవలయును వజ్రయోగంబు మహిమ

(వి-వి)—

అసమగ్రము వ్రాఁత మంచిదిగాదు తప్పులు చాలఁగలవు శైథిల్యము గ్రంథపాతములు లేవు

శివలింగధారణము, తన్మాహాత్మ్యము, శివపారమ్య ప్రతిపాదనము, మొదలగు విషయము లిందు సేకరింపఁబడినవి తొలుతఁగొన్ని శ్లోకములు గలవు పెక్కు పద్యములు గలవు ఇది యొక్కరి రచనముగాదు

---

## No 2243 శైవాచార సంగ్రహము

## ŚAIVĀCĀRA SANGRAHAMU

Substance, paper Size, 12½ × 8 inches Pages, 74 Lines, 20 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, good but not free from mistakes

Begins on fol 120 *a* The other works herein are —1 *a* Kātamarāju caritra, 48 Erragaddapāṭi pōtlāta, 113 *b* Tottu Śabjōdāharanamu, 114 *b* Kātamarajukatha, 167-*a* Simhala dvipamu Kaifiyat, 191-*a* Vēmāreddi caritra, 203 *a* Vēmanapadyasūci 217-*a* Vemanapadyamulu

Complete

Describes the procedure for the worship of Śiva as laid down in Sanskrit Śaivāgamas The author is Kuntamukkala Tirumalanātha, son of Ahōbalamantri The work is dedicated to Pillalamarri Gannanāmātya

**Beginning**

శా శ్రీరమ్యాబ్జదళాక్షి ముఖ్య సురసంసేవ్యుండు కృష్ణానదీ
తిరస్థేముండు మల్లికార్జున మహాదేవుండు శ్రీశైలరా
డారాముండు శివామనోహరుండు నిత్యానంద విద్రావుండిం
పారన్విస్సయగన్నధీ మణికభీష్టార్థంబులిచ్చుం దయన్

* * * *

ఏ ... ని యిష్టదేవతా ప్రార్థనంబుచేసి పురాతనార్య (ద్యతన ?) నూతన సుకవి సంకీర్తనంబాచరించి సకలలోకహితార్థంబుగా నొక్క ప్రబంధంబు నిర్మింపవలయు నని తలంచినంత

సీ అఖిల జగత్కర్తయగు నుమాభర్తకు
శ్రీ నగాధిపునకు సిద్ధలింగ
తనునకు మల్లికార్జున మహాదేవున
కపరావతారమై యఖిల ( శైలఁ
జెలఁగి వారాణసీ సిద్ధభిక్షావృత్తి
యతినాథు నాత్మజుండై ధరిత్రి
వీరశైవాచారవిభవంబు విశదంబు
గాఁ బ్రతిష్ఠించి యక్కజముగాఁగ
సకల ధర్మంబులను సప్తసంతతులను
భూతదయయందు నాశ్రిత పోషణమున
బ్రఖ్యాతి కెక్కిన గేమయ ప్రభునిసుతుఁడు
వీరభద్రుండు పెంపొందు విమలకీర్తి

* * * *

క ఈ వీరభద్రునకు సు ? (హి ?) తుఁ
డై వెలసినయట్టి పుణ్యుఁడనవరతంబున్
శైవార్చన సంపన్నుఁడు
భావినుతుఁడు గన్నమంత్రిపుంగవుఁడొప్పున్

శా భారద్వాజ పవిత్రగోత్రుఁడు జగత్ప్రఖ్యాతుఁడుద్యద్యశః
ప్రారంభుండగు గన్నసైన్యపతికిన్ బౌత్రుండు శ్రీయాజ్ఞవ
ల్క్యారూఢాన్వయ దీపకుండయిన విస్సామాత్య పుత్త్రుండువి
ద్యా రాజీవభవుండు గన్నయ మహోదారుండు ధీరుండిలన్

ఉ పిత్త్య యశోవిశాలుఁడును నీతి విశారదుఁడద్రి ధీరుఁడా
దిత్యసమాన తేజుఁడు సుధీనుతుఁడున్నత ధర్మశీలుఁడున్
సత్యవివేక భూరిగుణ సాంద్రుఁడు పిల్లల మర్రిగన్ననా
మాత్యుఁడు చెప్పనొప్పు మహిమన్విలసిల్లుచు నెల్లదిక్కులన్

వ ఆ మంత్రిశేఖరుండొక్కనాఁడు వివిధ శైవాగమ పురాణేతిహాస కథా వినో
దంబులఁ బ్రొద్దుపుచ్చుచుఁ బ్రమోదంబున

క అనుపమచరితుఁబరాశర
మునిగోత్రజు నన్నగుంటిముక్కలనిలయున్
ఘనుని నహోబలమంత్రిం
ద్రుని నందనుఁ దిమ్మనార్యు (దిమ్మలార్యుఁ)నుతిగాంచిర్యున్

క రప్పించి సమ్మదముమదిఁ
జిప్పిల ధనకనక రత్న చేలములఁ బ్రియం
బొప్పార నొసఁగి నాతో
నప్పుడు గంభీరభణితి నతఁ డిట్లనియెన్

ఉ నీవు మహానుభావుఁడవు నిర్మల బుద్ధి జగద్ధితంబుగా
శైవపురాణ సంహితల సారము సర్వము సంగ్రహించి ధా
త్రీవిదితంబుగాఁగ నొనరింపుము పెంపున నాకు సంకితం
బై విలసిల్ల నొక్కకృతి నార్యులకెల్లను సమ్మతంబుగాన్

వ అది శైవాచార సంగ్రహంబను పేరఁ బ్రసిద్ధంబుగా వెలయవలయునని బహు
మాన పూర్వకంబుగాఁ గర్పూర సహితంబుగాఁ దాంబూలం బొసంగిన నంగీకరించి,

* * * *

క వీరాంబానందనునకు
ధీరునకు వివేకనిధికి ధీమంతునకున్
సారోదారకళానిధి
కారూఢ శివార్చనామహోత్సుకునకున్

క అహిమకర విపులతేజున
కహికంకణసక్త మానసాంభోజునకున్
మహనీయధృతికి సుమతికి
మహిమోపేంద్రునకు గన్నమంత్రీంద్రునకున్

వ అనుపమజ్ఞానాభివృద్ధియు నభిమతార్థ సిద్ధియుఁగా నారొనర్పంబూనిన
శైవాచార సంగ్రహంబను కృతికిఁ బ్రస్తావంబెట్టిదనిన,

**End**

క. హరదీక్ష వడయునంతటు
సిరవగు సద్గురువు శిష్యుఁడెంతయు మహిమన్
బరతత్త్వ మయతఁదాల్చును
గురునుపదేశ క్రమంబు గొనకొనమాత్రన్

* * * *

## No 2247 శ్రీరామస్తవరాజము

### SRĪ RĀMASTAVARĀJAMU

Substance, palm leaf Size, $16\frac{1}{4} \times 1\frac{3}{8}$ inches Pages, 70 Lines, 9 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Same work as the above

(వి-వి)—
సమగ్రము వ్రాతమంచిదే తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు పూర్వమువలె

---

## No 2248. శ్రీ వైష్ణవవైభవము

### SRĪ VAISNAVAVAIBHAVAMU

Substance, palm leaf Size, $8\frac{1}{2} \times 1\frac{3}{8}$ inches Pages, 7 Lines, 10 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair, and free from mistakes

Begins on fol 50 of the manuscript described under No 2103

Complete

It describes the greatness of Vaiṣṇavas (devotees of Viṣnu) and explains that devotion to Vaisnavas is more fruitful than devotion to Viṣnu himself

**Beginning**

ఆస్ఫోటయంతి పితరః ప్రనృత్యన్తి పితామహాః
వైష్ణవో నః కులే జాతస్స న స్సంతారయిష్యతి

అని స్మృతి వాక్యముగలదుగాన భగవచ్ఛేతనుడు శ్రీవైష్ణవ గర్భానకు-రాగాను వారి ఉభయవంశముల పితృపితామహులున్నూ తమకు తక్కిన లోకములనుండుటమాని పరమపదము గలిగెనని మహా సంతోషముపడుచున్నూ చేతుల చప్పట్లుగొట్టుచున్నూ ఆడుచున్నూ పాడుచున్నూ సంతోషమునందుందురు

**End**

ఇటువంటి శ్రియఃపతి బ్రహ్మరుద్రాది సేవితుడు ఇట్టి శ్రీహరిభక్తికి నేను అర్హుడనా యని మనుష్యదేహి ఊరకుండదగదు

నవ స్తైస్తు నృసింహాయ యస్యమాయామహార్ణవే
ఉన్మజ్జంతి నిమజ్జంతి బ్రహ్మాదిక్షుద్రజంతవః
అన్నట్టున్నూ ¶ యద్వ్యాక్రోశమం-వధి యథామతివాశ్యశక్త్
స్తాన్స్యేవ మేవఖిలు తేపి సదాస్తువంతః

వేదాశ్చతుర్ముఖముఖాశ్చ మహార్ణవాంతః
కోమజ్జతోరణు కుంచలరారాశ్విశేషః

(వి-వి)—

సమగ్రము వ్రాంతే చక్క కిది తప్పులు లేవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

శ్రీ వైష్ణవుల మాహాత్మ్యమిందుచెప్పఁబడినది విష్ణుభక్తికంటె వైష్ణవభక్తి ఫలదాయకమని చెప్పఁబడినది

---

## No 2249 శ్రీ వైష్ణవాచార్య తిరునక్షత్రములు.

## ŚRĪ VAISNAVĀCĀRYA TIRUNAKSATRAMULU

**Substance,** palm leaf **Size,** $10\frac{3}{4} \times 1\frac{1}{4}$ inches **Pages,** 16 **Lines,** 5 on a page. **Character,** Telugu **Condition,** injured **Appearance,** old **Mode of writing,** fair but not free from mistakes

Begins on fol 1-*a* The other work herein is —9 *a* Yatirāja Stuti Incomplete

Contains the names of Śrīvaisnava teachers and the dates, etc , of their birth

**Beginning**

శ్రీ శఠారాంకుశకులాంబుధి పూర్ణచంద్రం
యతిరాజమానసపదసారస సారభృంగమ్
కందర్పదర్పరిపుఖండన శౌరియుక్తం
మణవాళదేశిక మహం ప్రణమామి నిత్యం

పెరుమాళుకు తిరునామం శ్రీధరులు తనయశ్రీధరాయగురవే శిష్యులు పెరియపిరాట్టియారు శ్రీ భూమీపిరాట్టియందు నాచ్చియారులు శ్రీభూమీనీళలు పెరియపిరాట్టియారుకు పెరుమాళ్లు శ్రీ విష్ణులోకమందు ప్రసాదించిరి శిష్యులు సేనముదలియారు

**End**

ప్రబంధాలు నాలాయిరమున్ను నమ్మాళ్వారు ప్రసాదించిరి ఉయ్యకొండారుకు ఆచార్యులు నాథమునులు, తిరునామం పుండరీకాక్షులు తిరునక్షత్రం మేషమాసం శ్రవణనక్షత్రం. వీరికి శిష్యులు మణక్కాల్ నంబిగారు తిరువల్లిక్కేణి పెరుమాళుయార్ చెట్టి పాశిచ్చెం లంకారర్ శ్రీపుండరీకదాసర్ మలఘు పెరుమాళ్ కొమార్తెలు ఇద్దఱు నాలాయిరమున్ను నాథమునులు

(వి-వి)—

అసమగ్రము వ్రాఁతమంచిది. తప్పులు లేవు. శైథిల్యముకలదు. గ్రంథపాతములు లేవు

శ్రీ వైష్ణవాచార్యుల యవతార తిథివార నక్షత్రములువారి గురుశిష్యులపేర్లు ఇందుఁ గలవు

ఇందలి గ్రంథాంతరము— 9a యతిరాజస్తుతి

---

## No 2250. షట్చక్రనిర్ణయము

## SATCAKRANIRNAYAMU

Substance, paper Size, 12¼ × 7½ inches Pages, 2 Lines, 21 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but full of mistakes

Begins on fol 57 of the ms described under No 1588

Complete

The six planes of a soul, viz —Mūladhāra, Svādhisthāna, Manipūraka, Anāhata, Visuddha and Ājna, and their respective deities are described in this The author is not known

**Beginning**

సీ ఆధారచక్రంబునందు భక్త్యంగంబు
వసుధాంశచతుర్దళవారిజంబు
పీతవర్ణముక్రియ పేరుగల్గినశక్తి
ధాతపూజారియై తనరునవటు
నల్గకారంబులు నమరుబీజంబులై
కరమును జిత్తము పరగెనందు
నాసంబుముఖకు నౌవాసన ద్రవ్యంబు
కదపదార్థంబుగాఁ బక్షశుద్ధి
యొనరనైష్ఠిక షడ్భక్తియు క్రమాగను
తిలవర్తిల్లు నాచారలింగమునకు
గోరియర్పించి శేషంబుగొన్నయట్టి
భక్తిలింగంబు నిరతంబుఁ బ్రస్తుతింతు

**End**

సీ సలలిత ఆజ్ఞాయచక్రకర్తంబరయ
ద్విదళపద్మము కాంతితేజరిల్లు
ప్రణవాంశమగు దానఁ బ్రకటింపశక్యమే
అందుల రెండు బీజాక్షరములు
అందుఁ గాయకయుందు నమ్మహాచిచ్ఛక్తి
పూజారిపరశివుఁడు రాజితముగ
నిర్ణయింపగఁ బీతవర్ణమచ్చోటను
హృదయంబు ముఖపద్మమది దలంప

పరిణయంబను ద్రవ్య మీథావహ స్త
మునను జేకూర్చి మహాలింగమునకుఁ బ్రీతి
యనవు సమరసభక్తి చేనలరిలింగ
ఐక్యస్థలపర్తులగువారి నభినుతింతు

**Colophon**

క షడుస్థలంగర్తుల వినుతులు
కడు వేడుకఁ జేసి భక్తిగా నిచవారిక
మృడుఁడు నిరంతరం గదల
దడయక యిహపరములను దాక్షిణ్య గుగా

(వి-వి)—

సమగ్రము వ్రాఁతతిన్ననిది తప్పులు చాలఁగలవు శైథిల్యము లేదు గ్రంథ
పాతములు లేవు

మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూర, అనాహత, విశుద్ధ, ఆజ్ఞాహ్వయములుగల
షట్చక్రములను స్వరూపాధిష్ఠాన దేవతావర్ణ బీజాక్షరాది నిరూపణము లిందు కన్నయము
లలోఁ జేయఁబడినది కర్త పేరెఱుఁగరాదు

ఈ గ్రంథమునకుఁ బూర్వమునను ఇంతనను బ్రక్షిప్తవిషయములు పెక్కులు
గలవు

ఇందలి గ్రంథాంతరములకు నెం 1588 రు జూచునది

---

## No 2251 షట్చక్రనిర్ణయము
## SATCAKRANIRNAYAMU

Substance, palm leaf Size, $12\frac{1}{2} \times 1\frac{1}{4}$ inches Pages, 5 Lines, 5 on a page
Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good but not free from mistakes

Begins on fol 2 *a* The other works herein are —1-*a* Brahmabila-pancaratnamulu 4 *b* Prāstāvikaslōkamulu

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాఁత తిన్ననిది తప్పులుగలవు శైథిల్యము లేదు గ్రంథపాత
ములు లేవు

పూర్వమువలె

ఇందలి గ్రంథాంతరములు, 1a, బ్రహ్మబిల పంచరత్నములు, 4b ప్రాస్తావిక
శ్లోకములు

## No 2252 షట్స్థల జ్ఞానము

## SATSTHĀLA JNĀNAMU

Substance, palm leaf Size, 11⅞ × 1¼ inches Pages, 32 Lines, 6 and 7 on a page Character, Telugu Condition, good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Deals with what are known as Saṭsthalas in the Śaiva system

**Beginning**

శ్రీమన్మహాదేవు డెటువంటి వాడంటేను, షోడశకళలుగల పరిపూర్ణమయిన జ్యోతిస్స్వరూపుడు ఆరుముఖాలుగలవాడు, ఆరుముఖాలు యేవంటేను, సద్యోజాతముఖం వామదేవముఖం, అఘోరముఖం, తత్పురుషముఖం, ఈశాన్యముఖం ఊర్ధ్వముఖంఅనేవి ఆరుముఖాలు ఆరుముఖాలవల్లను యేమిపుట్టినయ్యాఅంటేను బ్రహ్మాండచరాచరాలు పుట్టెను ఏలాగ పుట్టినయ్యా అంటేను సద్యోజాతముఖంవల్లను పృధివిపుట్టెను వామదేవముఖంవల్లను ఉదకంపుట్టెను అఘోరముఖంవల్లను అగ్నిపుట్టెను

**End**

ఆత్మనిగ్రహం ఊర్ధ్వముఖం ఆగ్నేయవక్త్రం మహాలింగం మాణిక్యవర్ణం రెండు దళాలు రెండు అక్షరాలు ఊర్ధ్వభేరి తనకుదానే ఓంకారం రెండు నేత్రాలు అజపగాయత్రిచిదానందం భక్తిమనోవాయు సద్భావహస్తం చిచ్ఛక్తి, చిచ్ఛక్తిన్ని మనోవాయువున్ను జాగ్రత్స్వప్నసుషుప్తులయందు మేళవింపుచుండగాను ఆరుయుగాలుకుంగి ఆరుపరువులయొక్క ఐక్యస్థలం సంపూర్ణం

గ్రంథాంతమున దీవ్రాతగలదు —

“ జయనామ సం॥ జ్యేష్ఠ బ॥ 10॥ డె॥ సర్కికందిరి సర్వేశలింగం అనేవాడు స్వహస్తలిఖితంగా వ్రాసుకున్న షట్స్థలావధాన సూత్రం దేహతత్త్వము సంపూర్ణం ” (వి-వి)—

సమగ్రము—వ్రాత యొకమాదిరిగానున్నది తప్పులుగలవు శైథిల్యములేదు గ్రంథపాతములు లేవు

శైవవేదాంతమునం జెప్పంబడు షట్స్థలముల వివరణమిందుంగలదు కర్తపేరు లేదు

---

## No 2253 సకలోపనిషత్సారము

## SAKALŌPANISATSĀRAMU

Substance, palm leaf Size, 15⅛ × 1¼ inches Pages, 18 Lines, 6 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes,

Complete

The order of creation according to the Advaitic interpretation of the Upanisads, is explained in this

**Beginning**

ఈసుషుమ్నానాడి మూలాధారంనుంచి కపాల పర్యంతం ఉన్నదని చెప్పబడుటవల్లను దాఅందుకు యోగశాస్త్రమందు చెప్పిన ప్రమాణము గహ్యస్వప్రకాశశక్తి: కథ్యతే ' ఇది మంత్రశాస్త్రప్రకారము భూవాది బ్రహ్మరంధ్రాంతం ప్రసారితా రశ్మిణియా మూలవం నుకారిణాం ఆ లబ్ధ్వా తిం పకుమి విత సమానసం ప్రియసం జాతిమాయాం మూలవిద్యాం ధ్యాత్వా—ఈ ప్రకారం పచ్చికగడ్డి తీగవలెను, కర్గిన బంగారం తీగవలెను కోటిసూర్య ప్రకాశంగా చూ వుండును ఇదే బ్రహ్మనాడి మూలవిద్యానున్ను సకలమైన లోకాలకు ఆధారమున్ను త్రిమూర్తి స్వరూపమున్ను ఈ సుషుమ్నానాడి సూర్యమండల పర్యంతంవచ్చి అక్కడ విచియుండును ఈ నాడికొనను సూక్ష్మమైన రంధ్రము కలదు ఈ బ్రహ్మరంధ్ర ము దేహమంతా వ్యాపించి వుండును

**End**

ఇక పంచభూతములకు విభజన పృథివికి గంధం అది నాశికంవల్ల తెలియబడును ఉదకంవల్ల రసం అది జిహ్వాయందు తెలియబడును అగ్నివలన రూపం వాయువు వలన చర్మం, ఆకాశంవల్లను శబ్దం ఈ భేదగుణాలకు వివరం పృథివికి నరములు, తోలు అస్థులు, గోళ్లు రోమాలు, మాంసం, ఈ అయిదు గుణాలున్ను పృథివీ అంశలు, రక్తం, శుక్లం, మూత్రం చొల్లు, చమట ఈ అయిదున్ను ఉదకాంశలు, అగ్నికి ఆకలి, దప్పి, నిద్ర, అలసట, సంగమం ఈ అయిదున్ను అగ్ని యంశలు, వాయువుకు, ఉరుకుట, చాచుట, వణకుట, ముడుచుట, నిగ్గుట ఈ అయిదున్ను వాయువ అంశలు, ఆకాశానకు కామ, క్రోధ, లోభ, మోహ లజ్జలు ఈ అయిదున్ను ఆకాశాంశలు, ఈయిరువై అయిదున్ను ఉపరి గుణాలు అయెను ఇకనుతత్వానకు వివరం, పృథివ్యాపస్తేజోవాయ్వా కాశాలు అయిదున్ను భూతపంచకం త్వక్చక్షుశ్శ్రోత్ర జిహ్వాఘ్రాణాలు అయిదున్ను జ్ఞానేంద్రియాలు, వాక్పాణిపాదపాయూపస్థలు అయిదున్ను కర్మేంద్రియాలు, శబ్ద స్పర్శ రూప రస గంధాలు, అయిదున్ను జ్ఞానేంద్రియ విషయాలు జ్ఞాతృ మనో బుద్ధిచిత్తా హంకారాలు, అయిదున్ను అంతఃకరణ పంచకం ఈ యిరువై అయిదున్ను తత్వాలు అయెను ఇరువై ఆరోవాడు గురుడు ఈ మహాపురుషులు నిశ్చయించినటువంటి ఆత్మనిఘంటు యెవరు వ్రాసిచూచి చదివి పరిశోధించి గురుముఖాంతరాన భక్తిజ్ఞాన క్రియానుభావులైనవార్లకు జనన మరణ రాహిత్యులై బంధమోహాతీతులై జీవన్ముక్తిన్ని విదేహముక్తిన్ని బ్రహ్మస్వరూపులై శాశ్వతులవుదురు

**Colophon**

ఇది సకలోపనిషత్సార ఆత్మపంచభూత పరతత్త్వ నిఘంటు సంపూర్ణం గ్రంథాంతమందీ వ్రాంతగలదు.

వ్యయనామ సం॥ ఫాల్గున బ॥ 7 సోమవారం వరకు మాదేటి సర్వేశలింగము గారికి మస్తూరు భగి శ్రీ బూరుగుపల్లి చెన్న మల్లికార్జునలింగారి శిష్యులు సూలి వీరేశ అనేవాడు సకలోపనిషత్సార ఆత్మకంపభూత పరతత్త్వ నిఘంటు సంపూర్ణంగా శ్రీ సాంబశివార్పణంగా మా ప్రతిచూచి వ్రాసియిచ్చెను

(ఇ-వి)—

సమగ్రము వ్రాతతిన్నది తప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాతకులు లేవు

ఉపనిషదర్థానుగుణముగా పంచీకరణ విషయమిందు వర్ణింపబడినది వాడుక తెలుగున నీరచనము గలదు

---

## No 2254 సప్తప్రకరణము.

## SAPTAPRAKARANAMU

Substance palm leaf Size, $7\frac{1}{8} \times 1\frac{1}{4}$ inches Pages, 216 Lines, 5 and 6 on a page Character Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 51 *a* The other work herein is —1 *a* Svaraśāstra-manjari

Complete

A work on Advaita Vēdānta in seven chapters The name of the author is not known

**Beginning**

శ్లో॥ ॥ బ్రహ్మానందం పరమమమృతం కేవలం జ్ఞానమూర్తిం
విశ్వాతీతం గగనసదృశం తత్త్వమస్యాది లక్ష్యం
ఏకంనిత్యం అమలమచలం సర్వధీసాక్షిభూతం
భావాతీతం త్రిగుణరహితం సద్గురుం తం నమామి

వ ఏ రాగద్వేషాలయొక్క త్రివిధ కారణమున్ను త్రివిధకర్మమున్ను శాయబడుతున్నదో ఆరాగద్వేషునియొక్క స్వరూపము నిర్ణయము చేస్తున్నాము రాగద్వేషమనగా యేమంటేను, రాగమనిన్నీ ద్వేషమనిన్నీ కామమనిన్నీ క్రోధమనిన్నీ లోభమనిన్నీ మోహమనిన్నీ మదమనిన్నీ మత్సరమనిన్నీ యీర్ష్యయనిన్నీ అసహ్యమనిన్నీ డంభమనిన్నీ తల్పమనిన్నీ అహంకారమనిన్నీ ఇచ్ఛ అనిన్నీ శ్రద్ధ అనిన్నీ భక్తి అనిన్నీ అంతు 16 విధాలు ఇందుకు వివరం

**End**

ఈ ప్రపంచం అజ్ఞానంవల్ల తోచెననిన్నీ జ్ఞానంవల్ల ఏమీలేక పోయెననిన్నీ యోగంవల్ల తన్నుతాను యెఱుగవచ్చుననిన్నీ ప్రకాశమై కన్నాననిన్నీ జ్ఞానంవల్లను తన్నుతా

గాబుగవలెననిన్నీ ఇప్పుడున్నూ తెలుసుకొన్నారమనిన్నీ ఇది మొదలయిన సకల సంకల్ప భ్రాంతులున్నూ ఎండమావులయందు నీళ్లు కాలత్రయాలయందున్న యేలాగున లేదో గవ్వలయందున వెండి యేలాగున కాలత్రయాలయందున్న లేదో ఆలాగున అధిష్ఠానాజ్ఞానమనే మూలప్రకృతి మొదలయిన సకల భ్రాంతులున్నూ నిజానందబోధ స్వరూపమై దూషిత భూషితుడయిన తనయందు శశవిషాణ వంధ్యాపుత్రి గగనారవిందమిథ్యాపురుషునివలెనే కాలత్రయాలయందున్న తనకు లేదు సిద్ధం ఇందుకు సమ్మతివచనం

చిచ్ఛూన్యం చ మహాశూన్యం సత్యాసత్యం న విద్యతే
స్వభావ భావితం ప్రోక్తం శాస్త్రిసమ్మతి పూర్వకం
లీయతే న చ లీయంతే శతకస్యాపి వర్తతే
నవిసర్వం మనస్సర్వం ఆత్మైవ కేవలం పరం

ఇట్లని దత్తాత్రేయస్వాములవారు అవధూత గీతలో చెప్పియున్నారు గనుక ఇదే ప్రమాణ సిద్ధం

అవ్యక్తోయ మచింత్యోయ మవికార్యోయ ముచ్యతే

**Colophon**

ఇది నిజానందబోధ ప్రకరణం సమాప్తము

గ్రంథాంతమందీ వ్రాతగలదు

విరోధినామ సంవత్సర మార్గశిర శుద్ధ 7 గురువారం వరకు ఈ సప్త ప్రకరణం వేలయ్యగారి ప్రతి ప్రకారం పుదిశేరిలో మాజేటి సర్వేశలింగం వ్రాసెను

(వి-వి )—

సమగ్రము వ్రాత తిన్ననిదే కాని తప్పులు చాలగలవు శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

1 రాగద్వేష ప్రకరణము, 2 సాధన చతుష్టయ ప్రకరణము, 3 స్థూలప్రకరణము, 4 సూక్ష్మ ప్రకరణము, 5 కారణ ప్రకరణము, 6 మహా కారణ ప్రకరణమ్ము, 7 నిజానంద బోధ ప్రకరణము నని యేడు ప్రకరణములుగలది గాన దీనికి సప్త ప్రకరణమని పేరయ్యెను ఇది అద్వైత వేదాంత విషయకమగు గ్రంథము ఇందెడనెడ పెక్కు సంస్కృత శ్లోకములుదహరింపబడినవి గ్రంథకర్త పేరెఱుగరాదు

---

## No 2255 సర్వార్థసారము

## SARVĀRTHASĀRAMU

Substance, palm leaf Size, 14 × 1¼ inches Pages, 93 Lines, 6 on a page Character, Telugu Condition, injured Appearance, old. Mode of writing, fair but not free from mistakes.

Complete

A work on Advaita Vendānta written in prose and poetry Vēnkaṭapati is the author He was the son of Candubhaṭṭa and the grand son of Mahādevabhatta Muktiśvarabhatta

**Beginning**

వ మఱియు మాయాధిష్ఠాన చైతన్యంబును మాయా ప్రతిఫలిత చైతన్యంబును మాయయను మాఁదును గూడి యీశ్వరుండనబడు నాయీశ్వరుండు వశీకృతమా యుండుగాన దానకర్తయగుచు ననేక బ్రహ్మాండంబులు సృజియింపుచు సర్వజ్ఞత్వాది గుణ విశిష్టుండై స్వస్వరూప విస్మృతిఁబొరయక జగద్వ్యాపకుండై అంతర్యామి హిరణ్య గర్భ విరాట్టులను నామంబులవెలయు నట్లింతేని సమష్టి శరీరాభిమానంబుగలవాఁడై అంతర్యామియనంబడియె సమిష్టిలింగశరీరాభిమానియై హిరణ్యగర్భుండనిన్ని సూత్రాత్మయనిన్ని నామద్వయంబుగలవాఁడయ్యె సమష్టి స్థూలశరీరాభిమాన యుక్తుండై విరాటును నామంబున వ్యవహరింపఁబడియె నిట్లు సమష్టి సుషుప్త్యభిమానో పాధివాన నీశ్వర చైతన్యంబునకు నంతర్యామి నామంబను సమష్టి

ఇంద్ర వజ్రం

స్ఫురద్గుణాలంకృత బోధమూర్తి
నిరస్త సంసార కనిష్ఠరార్తి
సురమ్యమూర్తి శుభమార్గవర్తి
శరణ్య పంచేశ్వర భావవర్తి

మాలిని

నిరుపమశుభలీలా నిర్మలానందచేలా
నిరత సహజలోలా నిత్య సత్యాలవాలా
పరిసగుణనికాయా సచ్చిదానందకాయా
వరబుధ తతిగేయా పంచిమానీంద్ర రాయా

**Colophon**

ఇది శ్రీమద్గురు చరణకమల మరందాస్వాదతుందిలేందిందిరాయమాన మానస శ్రీ మదాపస్తంబ సూత్ర శ్రీవత్సగోత్ర పవిత్ర మహాదేవ భట్టముక్తీశ్వర భట్టపౌత్త్రి చందు భట్టసుపుత్త్రి సుజనవిధేయ చిన వేంకటపతి నామధేయ ప్రణీతంబైన సర్వార్థ సారంబను వేదాంత గ్రంథంబునందు అమనస్కంబన్నది సర్వంబును ద్వితీయా శ్వాసము

(వి-వి)—

సమగ్రము కాని కృత్యవతరణికయు, గ్రంథారంభమునఁ గొంతభాగమును లేదు మూఁడాశ్వాసముల గ్రంథమయినను, ప్రథమ ద్వితీయాశ్వాసముల విభాగములు,

ఆశ్వాసాంత పద్యగద్యాదికములు ఆశ్వాసారంభ పద్యములు గానరావు ఒకవేళ ఇక్కడగల గ్రంథభాగము తృతీయాశ్వాసమాత్రమే యేమోకాని చెప్పవలెను వైశిష్ట్యము చాలcగలదు గ్రంథపాతములు చాలcగలవు

ప్రశస్త రచనముగల యీ యద్వైత వేదాంత గ్రంథము ప్రాచీన కృతిగాc దోcచుచున్నది ఇది సంస్కృత గ్రంథమునకుc దెలుcగుసేత కాcదగును ఇందు ఈశ్వర తత్త్వవివేకప్రకరణము, చిదాత్మతత్త్వ వివేకప్రకరణము కేవలాత్మ తత్త్వ వివేక ప్రకరణము సాధనచతుష్టయ ప్రకరణము, సాధనోపాయతత్త్వ ప్రకరణము, జీవన్ముక్తి ప్రకరణము జగద్భ్రాంతినివృత్తి ప్రకరణము, సంకల్ప ప్రకరణములని కొన్ని ప్రకరణముల పేళ్లు గ్రంథము పద్యగద్యాత్మకము రచనము మేలయినది గ్రంథకర్త వేంకటపతి కవి ఆపస్తంబసూత్రుcడు శ్రీవత్సగోత్రుcడు మహాదేవభట్టుముక్తీశ్వర భట్ట పౌత్రుcడు, చందుభట్టుపుత్త్రుcడు కృతిపతి పంచిహానీంద్రుcడని కలదు అవతరణికాదులు లేవుగాన, ఇంతకంటె విశేషము తెలియcగరాదు

---

## No 2256 సర్వేశ్వర మాహాత్మ్యము

### SARVĒŚVARA MĀHĀTMYAMU

Substance, paper Size, 8¾ × 6 inches Pages, 109 Lines, 16 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but full of mistakes

Begins on fol 145-*a* The other work herein is —1 *a* Vēdānta-rasāyanamu

Complete in four āsvāsās

A work on Christianity describing the story of Tōbhya The work is also known as Tōbhyacaritra the author is Pingali Yellanārya, son of Nāgayāmātya and a disciple of Śārabhanārādhya He wrote this at the instance of Tumma Rāyapareddy

శా॥ శ్రీ చైతన్యకళా నిరూఢి ఘనతం జెన్నొంది జగత్పూర్ణమై
ప్రాచీనద్వయ తత్త్వ మేకమనcగా భాసిల్లు సర్వేశ్వరుం
డీచందంబున శిష్య రక్షణకునై యేతెంచెనా నమ్మ (న్య?) దీ
యాచార్యుండగు నివ్వటూరి శరభాంకారాధ్యునిం గొల్చెదన్॥

ఉ॥ ఒక్కనిభంబనేకకలశోదక బింబితమైనరీతిc బెం
పెక్కcజరాచరాత్మల వహింపుచుc గొంచెము కంటెcగొంచెమై
యెక్కువకంటె నెక్కువగు నీశ్వరుc శరణంబు వేcడుచున్
గ్రుక్కెడ మాటిమాటికిని మ ద పెంపొర్వ నభీష్ట సిద్ధికిన్॥

సీ॥ భక్తి మైలేశక ప్రగఘోషము సలిపి
మాయదేవాహ్వయు మహిమ పొగడి
చెలఁగి యథావాక్యముల యన్నమయగారి
భజియించి ప్రేమెక్కుడి పాలకురికి
సోమన్నగారిఁ బ్రస్తుతిచేసి ప్రియమంది
శివదేవముఖ నవకవుల నెంచి
గణపతి దేవుని ప్రణతసన్నుతిచేసి
వేమనఁ గీర్తించి విమలమతిని
వ్యాస వాల్మీక కాళిదాసాది ఘనుల
నన్నపార్యునిఁ దిక్కనయజ్వ నెఱ్ఱ
ప్రెగడ ధూర్జటిఁ బోతన భీమకవిని
జెలఁగి శ్రీనాథముఖ కవిశ్రేణిఁదలఁచి॥

* * * *

వ అని యొద్దేసియు నొక్క పుణ్యేతిహాసం బాంధ్రభాష రచియించు తలంపు ననుండు నవసరంబున

చ॥ తనరవిదర్భ సీమకవతం సమనఁదగు కొండవీటికిం
ప్రమని దెసరాజ్యలక్ష్మికిని యాథనివాసమనంగ భక్తవా
డను పురమొప్పు నుర్వరకు హారమణి స్థితిఁ బొల్చి సజ్జనుల్
ధనకనకాంబరాముల సదావిభవొన్నతిఁ జెంది వర్ధిలన్॥

వ అప్పట్టణంబున కవీశ్వరుండు

సీ॥
ఘనతఁజెన్నొందు జగనొబ్బగండబిరుద
భూషణుఁడు తుమ్మ (?) మ్మవంశాబ్ధి పూర్ణచంద్రుఁ
డలఘు చరితుఁడ నంతాధి పాత్మజుండు
రమ్యరుచి కీర్తి రాయపరె (?) డ్డి మాళి (రాజ ?)

తే॥ అనుఁగుఁదమ్ముఁడు పాపన్న వినయగరిమ
నాత్మ ధర్మ ప్రవర్తన కనుకరింపఁ
బరగ ధరమంత్రి పొత్తూరి పాపనార్యుఁ
డెలమి విద్యా ప్రసంగముల్సలుపు నపుడు॥

మ॥ నను శ్రీమద్గురు చిత్కటాక్షణ మహాసంధాను సంధానపా
వన కారుణ్య కటాక్షలబ్ధ వరగీర్వాణాంధ్ర భాషాకవి
త్వనిరోష్ఠక్రమ చిత్రలక్షణ చమత్కార ప్రబంధా ధిక
ల్పనునిం బింగళియెల్ల నార్యమణిఁ బిల్వంబంచి పల్కెం గృపన్॥

చ॥ ప్రణుతయశోవిశాలుఁడవు భాసురశబ్ద నిగుంభనాదిల
క్షణములఁ జిత్రవైఖరుల సర్వనృపాల సభాంతరంబులన్
గణుతికి నెక్కె నీ కవిత కర్ణరసాయనమౌచు నిప్పురి
గ(ణ ?) ణికవితానమందు నతిగౌరవమందిరి వెంచిచూడఁగన్॥

చ॥ ఘనువడి నేఁడు మీరొక ప్రబంధముఁ గూర్పఁగఁ బూననైయ్యదీ
జనులనుతింపఁ జిన్నపుడె చందను చందము దప్ప నీకనీ
వనుపమలీలఁ జెప్పితివి యానవభాషను గద్యపద్యముల్
ఘనమనఁగూడునే తెనుఁగు కబ్బము నీదు కుశాగ్రబుద్ధికిన్॥

శా॥ కొండారెడ్డి ఘనుండు శౌర్యపటిమం గొట్టైన్ మరాటీలను
ద్దండుండన్న యతండు మాకు సుకవీంద్రశ్రేణిఁ బ్రోచున్ సిరుల్
నిం (డ ?) డెన్ దామెర వేంకటాధిపుఁడు మన్నింపంగఁబాయూరిలో
నుండున్ మిమ్ము బహూకరింపఁగలఁ డీ యుద్యత్కృతి శ్రేష్ఠతన్॥

వ॥ అని సబహుమానంబుగా తాంబూలం బొసంగి మున్ను మజ్జన
కాగ్రజుండునుం గొండారెడ్డికిం జనకుండును నగు నోబళరెడ్డి భూకాంతునకుం దదీ
యాచార్యుండగు సంజీవనాథస్వామి పరాపర విజ్ఞాన మార్గోపదేశ ప్రసంగ వశంబున
నిత్యంబైన సత్యాధ్యయన విధాన ప్రవర్తకుండై కృతార్థుండైన తోభ్యుండను నొక్క
మహాపురుషుని దివ్య చరిత్రంబుగల సర్వేశ్వర మాహాత్మ్యంబు చిత్రంబుగా ముఖవచనం
బులం దేటపఱచి సంక్షేపరూపంబైన వాక్య గ్రంథంబొసంగె. దినిం బరిశీలించి సర్వే
శ్వరున కంకితంబుగాఁ దెనుంగున మృదువచన రచనా గౌరవంబేర్పడఁ బ్రబంధంబుగా
నిర్మింపవలయునని వినయంబు నయంబుఁ బ్రియంబు నుందేటపడ నానతిచ్చిన

క॥ దూరీకృతమకరాంకవి
కారకనస్కునకు నిఖిల కళ్యాణగుణా
ధారునకును దుర్ణయసం
హారక్లేశాపహునకు సర్వేశునకున్॥

వ॥ అంకితంబుగా నాయొనర్పంబూనిన సర్వేశ్వర మాహాత్మ్యంబను మహాప్రబం
ధంబునకుం గథాక్రమం బెట్టిదనిన

శా॥ సారాచారనియుక్త సర్వజనమై సౌవర్ణరత్నాంకితా
గారద్వారక వాట గోపుర పతాక వ్రాత సంకీర్ణమై
శ్రీరంజిల్లఁగ వేడ్క జూదమనఁగాఁ జెన్నొందె జంబూనదీ (?)
తీరక్షోణిఁ దనర్చు నొక్క పురమర్థిన్ ధీజనస్తుత్యమై॥

క॥ ఆ రాజధాని తనకు స
దారిమ్యనివాస మగుచుఁ దనరఁ గవెలయున్

గారుణ్యాంబుధి విలస
ద్భూరియశోనిధి సహోమహావరుc కెలమిన్॥

**End**

తే॥ నూఱురెండేండ్లు ఎలసదనూన వైభ
వోన్నతి సుఖించి తోభ్యుండు నన్నమాంబ
యను బఱంథామమునకేcగి రొగిcవదనూజుc
డవుడు చారల కంత్యేష్టియాచరించి॥

సీ॥ ధైర్యంబు వదలక తండ్రి చెప్పినబుద్ధు
లన్నియుcదనలోన ననువు పఱచి
సత్యమేమరక నిశ్చలభక్తింయుక్తిమై
నాదిమదైవంబు నాశ్రయించి
మరియుcబురోహితామాత్య సుహృద్బంధు
పరివారజనములcబ్రజలనరసి
పాలింపు చుండి తత్పట్టణంబొక కొన్ని
యబ్దంబుల కుఖిలంబగుట దివ్య
దృష్టినెంతయు నూహించి తేజమలర
రాజధాని ప్రవేశమై రాజ్యవైభ
వోన్నతి ననేకవర్షంబులుండి పిదప
హితయుతముగాcగనొందె సర్వేశపదము॥

చం॥ అనిందిత ప్రభావ సద్గుణాఢ్య సేవకావనా
మునీంద్రమానసాంబుజ ప్రమోదమత్త షట్పదా
వినమ్రనిర్జరావతంస విశ్వ దంఘ్రిపంకజా
ఘనాఘనాఘ సంచనంభకారిచండ భాస్కరా॥ ?

**Colophon**

గద్య॥ ఇది శ్రీమద్వటూరి శరభనారాధ్య సద్గురు ప్రసాద లబ్ధానేక విధ కవిత్వ ప్రవీణ వినయధురీణ భారద్వాజ గోత్ర పింగళి నాగయామాత్యపుత్రయ (లా ౽) ల్లనార్య ప్రణీతంబైన సర్వేశ్వర మాహాత్మ్యంబనను మహా ప్రబంధంబునందు అన్నది సర్వంబును జతుర్థాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాcత చక్కనిది తcప్పులున్నవి శైథిల్యము లేదు గ్రంథపాత ములు లేవు

తోభ్య చరిత్రమని నామాంతరముగల యీనాల్గాశ్వాసముల క్రైస్తవ ప్రబంధమున, క్రైస్తవ మత ధర్మములును తోభ్యుcడను నొక మహాపురుషుని చరిత్రమును వర్ణిం

పబడినది దీని కర్త పింగళి ఎల్లనార్యుడు ఇతఁడు భారద్వాజ గోత్రుఁడు నాగయామాత్యుని పుత్త్రుఁడు ఇవటూరి శరభనారాధ్య శిష్యుఁడు ఇతఁడు తాను వసించుచున్నవాడకుఁ ప్రభువగు తుమ్మరాయపరెడ్డి కోరిక ప్రకార మీగ్రంథమును రచించి సర్వేశ్వరున కంకితము చేసెను రాయపరెడ్డి పెదతండ్రి కొడుకగు కొండా రెడ్డి మరాటీలను జయించి దామెర వెంకటాధిపునిచే సన్మానితుఁడై పామూర వసించెను. కొండా రెడ్డి తండ్రియగు నోబళ రెడ్డికి నతని గురుఁడును క్రైస్తవమతబోధకుఁడు నగు సంజీవ నాధస్వామి యిచ్చిన చిన్న పుస్తకములోని విషయమే యీతోభ్య రచనకు మూలము

---

## No 2257 సాంఖ్యవిచారము

## SĀNKHYAVICĀRAMU

**Substance,** paper **Size,** 11⅜ × 7⅞ inches **Pages,** 33 **Lines,** 18 on a page **Character,** Telugu **Condition,** good **Appearance,** old **Mode of writing,** fair but not free from mistakes

Begins on fol The other works herein are —1 *a* Rājaśēkhara-vilāsamu, 65 *b* Vēdāntavārtikasārasangraha Niskarsaphakkikadōsa-Nyāsamu, 103 *a* Nirālambamanjari and 132 *b* Candrahāsavilāsamu

Complete

A work in popular Telugu explaining the principles of Sānkhya system Incidentally it describes also the Vedantic doctrines of the Advaita system The author is Cennabasavayya

**Beginning** .

శ్లో॥ మహాత్మా సర్వభూతాత్మా
మద్గురుశ్చ జగద్గురుః
మన్నాథ శ్శ్రీ జగన్నాథః
తస్మై శ్రీ గురవేనమః

శ్లో॥ విహం గోవాహనం యస్య
త్రికుంచా (?) యస్యభూషణమ్
సాలపా ? వాముభాగశ్చ
సదేవశ్శరణం మమ

ఈ అఖండ సచ్చిదానంద నిత్యపరిపూర్ణ స్వయంప్రకాశులైన సద్గురుదేవగురు పాద పద్మమకరందామృతపానులైనవారు నిశ్చయించదగిన సాంఖ్య విచారం తెలియజెప్పెదరెంతే మొదట అవ్యక్తస్వరూపమయిన పరమాత్మయందు మహాతత్త్వం గలిగెను ఆ మహాతత్త్వంవల్ల అహంకారం గలిగెను అహంకారంవల్ల పంచతన్మాత్రలు గలిగెను. పంచతన్మాత్రలవల్ల పంచభూతాలు గలిగెను. ఆ పంచభూతాలవల్ల పదార్థ భవనాలు అయెను

అవ్యక్తాన్మహత్ - మహతోహంకారః అహంకారాత్ పంచతన్మాత్రాణి పంచ తన్మాత్రేభ్యః పంచభూతాని పంచమహాభూతేభ్యోఖిలం జగత్

**End.**

ఇఁక విదేహముక్తుని లక్షణం - ఈయన్నమయ కోశమైన స్థూలదేహము వృక్షాన నుండి పండువీడి పడ్డట్టు ఆత్మకు దేహానకు సంబంధములేని వాఁడై ఘటాకాశ మహాకాశాలకు భేదంలేనట్టు పూర్ణస్వరూపుఁడై వుండును ఏకమేవాద్వితీయం బ్రహ్మ అన్న అర్థంస్వరూపుండౌను ఇట్లని అఖిల వేదశాస్త్ర శ్రుతి స్మృతీ తిహాసపురాణాలు చెప్పుచున్నవి అని అమృతలింగం కరిస్థానమందు వసియించి సంక్షేపంబుగా పూర్వాచార్య సమ్మతంబుగా చెన్నబసవయ్య చేసిన సాంఖ్యవిచారం సంపూర్ణం

(వి-వి)—

సమగ్రము వ్రాఁతమంచిది తప్పులు చాలఁగలవు శైథిల్యము లేదు గ్రంథ పాతములు లేవు

షడ్దర్శనములలోని సాంఖ్యదర్శనమును ననుసరించి తత్త్వ నిర్ణయమిందుఁదేట వాడుక తెనుఁగున వివరింపఁబడినది ఎడనెడ సాంఖ్య సూత్రములు, తదనుగుణములయిన యితర గ్రంథములలోని శ్లోకములు నిందుదాహరింపఁబడినవి సాంఖ్యదర్శనముపలక్షణముగా నిందు అద్వైత వేదాంతారములును గలవు

ఏతద్గ్రంథకర్త చెన్నబసవయ్య

ఇందలి గ్రంథాంతరములు —1a రాజశేఖర విలాసము, 65b వేదాంతవార్తిక-సారసంగ్రహ నిష్కర్ష ఫక్కికాదోషన్యాసము, 103a నిరాలంబ మంజరి, 132b చంద్రహాస విలాసము

---

## No 2258 సాత్వికబ్రహ్మవిద్యా విలాసము.

## SATHVIKA BRAHMA VIDYĀVILĀSAMU

Substance, paper Size, 12⅛ × 7⅛ inches Pages, 176 Lines, 19 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good but not free from mistakes

Begins on fol 128-*a* The other works herein are —1-*a* Vivēkasindhuvu, 58 *a* Ēgantivārivacanālu, 78-*a* Pidupartivārivacanālu, 83 *a* Cittannagāri vacanamulu, 84 *b* Gēyanlulu 85-*b* Viśvakarmōpanisat, 87-*b* Gēyamulu, 99 *a* Sankaragrathamu, 102 *a* Jivaprabodhamu and 106-*a* Sarvēsvarasatakamu

Incomplete

A philosophical work purporting to establish Vaiṣnavism as against Saivism The name of the author is not known In refutation of this, a work known as Sātavikabrahmavidyāvilāsakhandanamu is writte by the Śaivas

**Beginning .**

శ్లో॥ శ్రీ సాత్త్వికబ్రహ్మ విద్యావిలాసోనామ విశ్రుతః।
వైదికా వైదికానేకమత తత్త్వసు నిర్ణయః
వేదవేదాంత శాస్త్రాణాం తాత్పర్యాదిసు నిర్ణయః
సందేహాంధత మోభానుః జిజ్ఞా సుజనజీవనమ్

వ ఇషనితాత్పర్యం సూచింపబడెను ఇంకాను అవతారిక—శ్రీమద్వేద వేదాంత శాస్త్ర ధర్మ శాస్త్రపురాణాగమసంహితేతిహాసాది ప్రమాణపారంగతుండై శమదమాది గుణగరిష్ఠుండై స్వాచార్య నిష్ఠుండై సాత్త్విక ధర్మోపవిష్టుండైన ఆచార్యుని చిత్తవృత్తులెఱింగి శుశ్రూషచేసి తనయందు కృపపుట్టిన వేళందెలిసి జిజ్ఞాసుండై వీత రాగియై ముముక్షువైన శిష్యుండాచార్యుంజేరి సాష్టాంగ దండప్రణామము చేసి తదనుజ్ఞను చితగతింగూర్చుండి వినయశీలుండై ఆచార్యుని జూచి యేమనుచున్నాడు ఓస్వామీ। సకలప్రమాణములందు విచారించేటప్పుడు మోక్షప్రదులయిన దేవతలు ముకుందారవింద నందన చంద్రశేఖరుల ముగ్గురిన్నీ రూఢిగా ప్రమాణాలచేతం జెప్పుచున్నారు అందు బ్రహ్మదేవుని సంబంధమయిన మతము మంత్రము చిహ్నాలు సమయాచారములు మొద లయిన వేమిన్నీ లేవు గనుక ఇది సామాన్యమై వుండెను

**End**

అందుకు ప్రతిమూర్త్యైక ప్రతి పాదకాలు తామస రాజసాలుగాం దెలిసేది. అందలి విష్ణుప్రతిపాదకాలు తామసరాజసాలుగా దెలిసేది అందలి విష్ణుప్రతిపాదకాలు రాజ ససాత్త్వికాలుగాం దెలిసేది ఇంకను రుద్ర దుర్గాపరాలైన శస్త్రాలు తామసాలని క్రిందటం జెప్పినారమేకదా। అందలి రుద్రదుర్గాది ప్రతిపాదకాలు తామసతామసా ములుగా దెలిసేది అందలి త్రిమూర్త్యైక్యాది ప్రతిపాదకాలు తామసరాజసాలుగా నెఱింగేది అందలి విష్ణు ప్రతిపాదకాలు తామససాత్త్వికాలుగా నెఱింగేది ఈ లాగుననే వేదశాస్త్రాగమ పురాణాగమాదుల అందలి సాత్త్విక సాత్త్విక రాజససాత్త్వి క తామస సాత్త్విక రాజసరాజస —

(వి-వి )—

అసమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులు గలవు శైథిల్యములేదు గ్రంథ పాతములు లేవు

వేదశస్త్ర ప్రమాణ సిద్ధముయిన మతము వైష్ణవమా శైవమాయను విషయము విపులముగా జర్చించుచు వైష్ణవమే సప్రమాణమగు మతమని యీ గ్రంథము సిద్ధాంతీ కరించుచున్నది వైదిక వ్యావహారికాంధ్ర వచనమున నీ గ్రంథ రచనముగలదు గ్రంథకర్త పేరెఱుగరాదు ఇందు వేద శాస్త్రపురాణాదులనుండి ప్రమాణ వచనములనే కము లుదహరింపబడినవి దీనిమీఁదనే సాత్త్వికబ్రహ్మ విద్యావిలాస ఖండనమని శైవ లౌక ఖండనగ్రంథము రచించిరి.

## No 2259 సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము

## SĀTVIKA BRAHMAVIDYĀ VILĀSAMU

Substance, palm leaf Size, $16\frac{5}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 68 Lines, 7 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing fair but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి) —

ఆసమగ్రము వ్రాతమంచిది తప్పులున్నవి శైథిల్యము కలదు గ్రంథపాతములు కలవు

పూర్వమువలె

---

## No 2260 సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము

## SĀTVIKA BRAHMAVIDYĀ VILĀSAMU

Substance, palm leaf Size, $16\frac{3}{8} \times 1\frac{3}{8}$ inches Pages, 134 Lines, 7 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Incomplete

Same work as the above

(వి-వి)—

అసమగ్రము వ్రాతమంచిది తప్పులు కలవు శైథిల్యము కలదు గ్రంథపాతములు కలవు

పూర్వమువలె

---

## No 2261 సాత్త్విక బ్రహ్మవిద్యా విలాసము

## SĀTVIKA BRAHMAVIDYĀ VILĀSAMU

Substance, palm leaf Size, $13\frac{1}{4} \times 1\frac{1}{2}$ inches Pages, 220 Lines, 7 on a page Character, Telugu Condition, injured Appearance, old Mode of writing, fair and free from mistakes

This is the same work as that described under R No 182-*a*

Complete

(వి-వి)—

సమగ్రము వ్రాత చక్కనిది తప్పులులేవు శైథిల్యము కలదు గ్రంథపాతములు కలవు

ఇది ఆర్ నెం 182 (a) న వర్ణితము.

## No 2262 సాత్త్విక బ్రహ్మవిద్యా విలాస నిరసనము

## SĀTTVIKA BRAHMAVIDYĀ VILĀSA NIRASANAMU

Substance, palm leaf Size, 17⅜ × 1¼ inches Pages, 450 Lines 5 and on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing fair but not free from mistakes

Incomplete

This is an adverse criticism on the Vaisnava work Sātvikabrahma vidyāvilasamu which is written in refutation of Śaiva religion The author, Buddharāju Peraya is the son of Ayyanārya of Bhāradvāja gōtra and a disciple of Ivvatūri Virabhadrāradhya He was dandantaha of Kondapalli and has previously written Parāsārapurāna This he says was written on the suggestion of Pinapāli Sarvadēvacārya made at Candavōlu For details see extarcts below

**Beginning**

శా॥ శ్రీ కంఠోగ్రము మానసాలయము త్రినేత్రీస్ఫార మత్యంతశాం
తాకారంబు సమస్తసాక్షి జగదంతర్యామిలింగోద్భవా
ఖ్యాకబ్రహ్మము బ్రహ్మమాధవ పరీక్షాతీత మూర్ధాంఘ్రియు
స్మాకీనోరు మనోరథ ప్రతతి నిచ్చుంగూర్చుఁగా కెప్పుడున్

సీ॥ ధరఁజతుర్వేద తాత్పర్య సంగ్రహ కర్త
హరదత్తనాచార్యవరుఁదలంచి
పరమశివాద్వైతపర నీలకంఠాఖ్య
ఘనభాష్యకారు శ్రీకంఠుఁబొగడి
కాళహస్తి విలాస ఘనతరగ్రంథాఢ్యు
శ్రీకాళహస్తి దీక్షితుని మెచ్చి
శ్రౌతలింగ వివేక రాద్ధాంత గ్రంథాత్త
నాగదేవుని సూక్తి నయము లెంచి
మేదిని శివార్కమణి దీపికాది బహుళ
శైవశాస్త్ర నిర్మాణ కర్త్రావధాన
దక్షుసాక్షాచ్ఛివాష్టమతనువనంగ
వెలయునప్పయ దీక్షిత విభునుతింతు

సీ॥ పరవాది జీమూత పవనోగ్రమూర్తులఁ
బండితారాధ్యులఁ బ్రస్తుతించి
బసవరాజీయాఖ్య భాష్యకారునిఁబాల
కురికిసోమారాధ్య గురునిఁగొలిచి

శైవరత్నాకర శాస్త్రసంయోజన
దక్షు జ్యోతి నాథుఁ దలఁచి మ్రొక్కి
వీరమాహేశ్వరాచార సంగ్రహకర్త
ఘనునీలకంఠ నాగన్నఁ బొగడి
మఱి యు వీరమాహేశ్వర మతసముద్ధ
రణరణాంగణోద గ్రశాత్రవమతోక్తి
ఖండనోదగ్ర యుక్తియుక్తాస్త్రశస్త్ర
శైవవిద్వద్భట శ్రేణిసన్నుతించి

క. పినపాటిలింగ గురునో
పినపాటిను తెంతువిమత భీకరమతినీ
యనపాటి శైవులేరీ
యనబ౯ పాటిత శిష్యదురితుఁడై నమహాత్ముఁ

సీ. బొందితోఁ గైలాసమునకు నేగినయట్టి
పాలంక విశ్వేశవంశజుండు
సకల మహామంత్ర పట్కర్మదక్షుఁడౌ
సోమనాదుని పుత్రసూనుసుతుఁడు
నైమహాగ్ని ష్టోమయాగాది కర్తయౌ
నాగనాథాత్మజు నందనుండు
సాక్షాదఘోరేశ సౌమ్యావతారమౌ
పర్వతారాధ్యుని ప్రథమసుతుఁడు
మరియుఁగాళప్ప నాగన్న మల్లనలకు
భ్రాతశరభాహ్వయాయ్య గుర్వవలజనకుఁ
డక్కమాపతి యుచ్చటూర్యన్వయుండు
గుర్వమాంబాత్మజుఁడు వీరగురువరుండు

శా. లోకారాధ్య నిరూఢనామ బిరుద శ్లోకప్రచారావనా
స్తోకప్రాభ పునివ్వటూరికుల పాథోధి శశభేశు నృపా
నీకప్రాప్త హయేభగో కనక మాణిక్యాగ్రహారాదిర
మ్యైకైశ్వర్యుఁ దలంతు మద్గురుని వీరారాధ్య చూడామణిన్

* * * *

సీ. చంద (?) హాలిపురీ స్వామ్య సంపదాఢ్యు
మాచిరాజాన్వయోద్వహమాచిరాజ

నందనునిఁ బెద్దనామాత్యనాథుఁ గంభ్ర
శాస్త్రదీయరయోగక్షేమునభినుతింతు

* * * *

క. ఇష్టసురనతియునీగతి
శిష్టకవి ప్రార్థనంబు శ్రీగురునుతియున్
దుష్టనిరాకృతియును వి
స్పష్టముగాఁజేసి సత్ప్రబంధచికీర్షన్

సీ. కలహించి బ్రహ్మాచ్యుతులు శంభులింగంబు
రూపంబుగాన వేశేపురమున
సిద్ధశైలరి నిజప్రసిద్ధిగా సనకస
నందన ప్రముఖులే నగరమునను
దపముచే మెప్పించి త్రిపురారిసఖుఁడయ్యె
శ్రీదుఁడు నేపుట భేదనమునఁ
జెలఁగి బౌద్ధుల జయించెను మల్లికార్జున
పండితారాధ్యుఁడే పట్టణమున
నట్టిచందవోలి మహాఖ్యాకనగరి
నెమ్మిఁగరికాళచోడరాణ్ణిర్మితంబు
నైనలింగోద్భవస్వామ్యసూనమాన
భర్మమణిగణ స్థగితోరు భవనమునను.

సీ. ఒకనాఁడు సూర్యోదయోచిత కరణీయ
ములుదీర్చి కతిపయబుధులతోడ
వచ్చి శ్రీలింగోద్భవస్వాములకుఁ బ్రద
క్షిణ నమస్కృతులాస్థఁజేసి యచటఁ
బ్రాసాదముఖమంటపాభ్యంతరస్థలి
సుఖగోష్ఠిమైఁ గూరుచున్న వేళఁ
బాంచరాత్రికులైన పండితమ్మన్యులు
కొందఱు చనుదెంచి సందడిలుచు
నలఁతిసాత్త్విక బ్రహ్మవిద్యావిలాస
మనెడు గ్రంథంబు వచియించ నాలకించి
శైవమత దూషకంబైన శాస్త్రరీతి
కాత్మనోపక మాహేశ్వరాలియపుడు.

ఉ. కొందఱు కోపవహ్నిశిఖకోనఁ గొందఱు హేళనంబొనర్చెదఁ దర్కమున్
కొందఱు పూనికొంచుఁ జనఁగొందఱిలే శివనిందకానుపున్

గొందమనంగనందుమతికొందఱు విస్మైరవోవఁజూచివా
రందఱనూఱడించి వినయంబునయంబును సందడించఁగన్.

తే. రమణఁబెనపాటి లింగనారాధ్యసుతుఁడు
సాంగవేద వేదాంతపారంగతుండు
సర్వదేవాహ్వయాచార్య సార్వభౌముఁ
డీషదంచిత స్మితపూర్వ భాషియగుచు

శా. భారద్వాజస గోత్రుఁగోత్రభృతినాపస్తంబ సూత్రోదితా
చారుంజారుయశస్కు విరగురు శశ్వత్పాద పద్మాశ్రయా
దారస్వాంతుని నయ్యనార్య సచివాత్మ ప్రౌఢభుంబేరయ
ప్రారూఢాఖ్యుని నన్నుతించియను నెల్లాంబాతనూజాగ్రణిన్

సీ. శ్రీ శివ కొండపల్లిపురీ దండనాథస్వామ్య
 సంపత్పరం పరాశాశ్వితుఁడవు ?
బుద్ధిరాజాన్వయ ప్రోద్దామవిభవాంబు
 రాశిరాకా నిశారమణమూర్తి
భాగమనిగమేతిహాసపురాణోప
 నిషదర్థ విజ్ఞాన నిపుణమతివి
వర్ణనపటు తాత్పర్య తత్త్వరహస్య
 రాద్ధాంత శాస్త్రనిపుణుఁడవు
సాంబశివ(పాద) పాథోరుహార్చనాభి
 రతుఁడవుప రాశరాది పురాణకత(థ)న
మంత్రభావుల రచియించినట్టి నీవు
 స్తుత్యుఁడవుకావె పేరయసూరివర్య

* * * *

తే. ధరణిసాత్త్విక బ్రహ్మవిద్యావిలాస
నిరసనంబను నామంబునెమ్మి వెలయ
వెలసిశివ వైభవోత్కర్ష పరముగాఁగ
శాస్త్రమొనరింపు మామ్నాయ సమ్మతముగ.

క. అని తత్కుశాస్త్రనిరసన
మునకై బోధించుటయును మోహకశాస్త్ర
వ్యనువాదముదన్నిరసన
మును జేయుటనైచ్యమనుచు మొగినిట్లంటిన్

* * * *

క. వినను శివదర్శన నిం
దానూనాస్పదమట్టులగుటం దచ్ఛాస్త్రింబున్
మానుగ నిరసించుట స
న్మానముగా వీరశైవ మానము నెమ్మిన్

వ. అని తదనుగుణంబులైన పురాణ వచనంబులు ఎట్టివియని వితర్కించితి

**End**

వ. వ్యాసులు ప్రమాణ స్వరూపముగా శివాలయద్వార దేశమందు భుజము లెత్తి నిబంధింపంచితెనది అబద్ధ ప్రసంగము గనక సహింపక భుజాస్తంభనం ఆయెను రుద్రాదులు వాత్సల్యమునను పేక్షించి ప్రశంశించినారు గనక అక్కడ దోషప్రసక్తిలేదు అలాగే స్మృతిధర్మయుక్త (?) వచనం హీనస్తిన స్త్రీషు రాజన్ నవివాహకాలే, ప్రాణాత్యయే సర్వధనాపహారే పంచానృతాన్యాహురహీనకాని

No devision of prakaranās appears to have been made in the remaining portion of this only Ms copy of the work and it is therefore not known in how many prakaranās the work is complete

స్మృతి — ధర్మయుక్తం [?] వచనం హీనస్తై
నస్త్రీషు రాజన్ న వివాహకాలే
ప్రాణాత్యయే సర్వధనాపహారే
పంచానృతాన్యాహు రపాతకాని

**Colophon**

గద్య. ఇది శ్రీమత్సనాతననాథు చాతన వీరశైవ పాశుపతగణసంస్మరణ సౌరభ సంవాసితచేతస్స్వమాహిత శ్రీమదివటూరి వీరభద్ర గురుభద్ర పాదారవింద వందనానంద మకరంద బిందుకందళిత శ్రీమద్గురులింగోద్భవ భజనధురీణతా పరిణతాప్రతిమ ప్రతిభా వైభవధారి య[?] బుద్ధిరాజయ్యన ప్రధాన తనూభవ పేరయ నామధేయసూరి ప్రణీతంబైన సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస నిరసనసమాఖ్య గ్రంథంబునందు దామసత్వ నిరసనంబను ప్రథమ ప్రకరణము

(ఇది 26 వ ఆకులోగల గద్యము)

(వి-వి)—

అసమగ్రము వ్రాంత చిన్నవిది. తప్పులున్నవి. శైథిల్యము లేదు. గ్రంథసాంకములు లేవు

శైవమత నిరసనాత్మకముగా సాత్త్విక బ్రహ్మవిద్యావిలాస మను పేరంగల వైష్ణవగ్రంథమున కిది యాంధ్రవచనరూపమగు ఖండనగ్రంథము గ్రంథకర్త బుద్ధిరాజు—పేరయ కవి ఈతఁడు భారద్వాజ గోత్రుఁడు ఆపస్తంబ సూత్రుఁడు అయ్యనార్యుని కుమారుఁడు పారంపర్యాగతముగా కొండపల్లీపురపు దండనాథాధికారము గలవాఁడు పరాశర పురాణము తెల్గున రచించినవాఁడు ఇవ్వటూరి వీరారాధ్యుని శిష్యుఁడు చందవోలుపురమున లింగోద్భవస్వామి సన్నిధిని పినపాటి లింగనారాధ్యుని కుమారుఁడయిన సర్వదేవాహ్వయాచార్య సార్వభౌముని యానతిచొప్పున నీకవి యీ గ్రంథమును రచియించినాఁడు గ్రంథావతరణికలో నీక్రింది గ్రంథకర్తలు, గ్రంథములు పేర్కొనఁబడెను చతుర్వేద తాత్పర్య సంగ్రహకర్త—హరదత్తాచార్యుఁడు, నీలకంఠ భాష్యకర్త—శ్రీకంఠుఁడు, కాళహస్తి విలాసకర్త—కాళహస్తి దీక్షితుఁడు శ్రౌత లింగ వివేకరాద్ధాంతకర్త—నాగదేవుఁడు, శివార్కమణిదీపికాదికర్త — అప్పయ దీక్షితుఁడు, బసవరాజీయాఖ్య భాష్యకర్త—పాల్కురికి సోమనారాధ్యుఁడు, శైవ రత్నాకరశాస్త్రికర్త—జ్యోతిర్నాథుఁడు, వీరమాహేశ్వరాచారసంగ్రహకర్త—నీలకంఠ నాగన్న,—

విశేషములకు దాహృత గ్రంథభాగములఁ గాంచునది

---

## No. 2263. సాధన చతుష్టయ సంపత్తి.

### SĀDHANA CATUSTAYA SAMPATTI

Substance, palm leaf Size, 15½ × 1¼ inches Pages, 4 Lines, 6 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

The four essential requisites for a person desirous of studying Vedanta and acquiring the knowledge of Brahman are described in this The name of the author is not known

**Beginning** ·

సాధన చతుష్టయ సంపత్తిదే అధికారి అనగా విది అంటే నిత్యానిత్యవస్తువివేకం ఇహా ముత్రార్థఫలభోగ విరాగం శమాది షట్కసంపత్తి, ముముక్షుత్వం వీటి వివేచన యెటువలెనంటే

**End**

సాధనచతుష్టయ సంపత్తిలేనివానికి ఆత్మానాత్మ విచారమందు అధికారింలేదు అది గనక సాధనచతుష్టయ సంపన్నుడే అధికారి —తుర్యావస్థ సమాధి

సాధనచతుష్టయ సంపత్తి సంపూర్ణం

(వి-వి)—

సమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్యము గ్రంథపాతములు లేవు

వేదాంత జిజ్ఞాసకు ముఖ్యమయిన సాధన చతుష్టయపు సంపత్తినిగూర్చి యిందు వివరణముగలదు కర్త పేరెఱుంగరాదు

---

## No 2264. సారాంశపంచకము.

## SĀRĀMŚAPAÑCAKAMU

Substance, paper Size, 8⅜ × 6⅜ inches Pages, 68 Lines, 20 on a page Character, Telugu Condition slightly injured Appearance, old Mode of writing, fair and almost free from mistakes

Begins on fol 69 *a* The other work herein is —1 *a* Gitārthasāra sangrahamu

Complete

The five means of obtaining the supreme goal are described in this as acceptable to all school of thought The author is Sarvajña Kumāra Yācēndrabhūpati of Vēnkatagiri

**Beginning**

ఇదివరలో నేను చెప్పిన గీతార్థసారసంగ్రహమనే గ్రంధము శ్రుతిస్మృత్యాగి స్వరస సిద్ధములై యుక్తిసహములయిన యంశములచేత నేర్పరచబడినది గావున వేద బాహ్యులు దానిని ఒప్పుకొనరు అందువలన సర్వసమ్మతముగా ఈ సారాంశపంచకమనెడి గ్రంథమును రచింపుచున్నాడను. లోకములో ప్రత్యక్షానుమాన ప్రమాణములే ముఖ్యములుగాని శబ్ద ప్రమాణము ముఖ్యముగాదు అటుల శబ్దము ముఖ్యమయ్యెడి పక్షములో అనేక మతసంబంధములయిన తత్త్వనిర్ణాయక శాస్త్రములలో పరస్పర విరుద్ధములయిన్ని యుక్తిసహములుగాకుండాను ఉండే భాగములన్నియును యథార్థములు గావలసివచ్చును

**End**

కనుక కొన్ని విధములకయినా భగవంతుడున్నాడని నమ్మి వారివారి మతసంకేతము లయిన నామములచేత కారణాభిన్న ధితో ఆయనను సర్వదా స్మరించుచూ, జీవులకు ప్రాణాధారమయిన అన్నాదులను ఈశ్వరప్రీతికొరకు తన శక్త్యనుసారం ఇచ్చుచూ, నుండడము ముఖ్యము, సులభమున్ను, ఇటుల చేయువాడు ఎప్పటికీ సుఖము.

సర్వమతములలోనుండెడి సమస్త సారాంశములూ ఈ అయిదు అంశముల లోనే అంతర్భూతములు గావున సర్వజనులకు ఇవి ఉపాదేయములు గనుక సులభముగా తెలియుటకు సంగ్రహముగా తెలుగుమాటలతో ఈ సారాంశపంచకమనే గ్రంథము రచించడమయినది

గ్రంథాంతమందీ వ్రాతగలదు —

శాలివాహనశకము 1793 ప్రమోదనామ సంవత్సర శ్రావణ బ 8 శుక్ర వారము

ఈ రెండు గ్రంథములవల్ల తెలియవచ్చు రహస్యమేమనగా, ఏది తెలిస్తే యికను తెలియదగినదిలేదో, దేనివల్ల సర్వపాపములకు ప్రాయశ్చిత్తముగలుగునో ఆ యర్థము తన మనసాక్షికి తెలియనగును

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది తప్పులు లేవు శైథిల్యము లేదు గ్రంథపాత ములు లేవు

పరమార్థప్రాప్తికి సాధనములుగా సర్వమతములకు సమ్మతములని అయిదు సారాంశము లిందు నిరూపింపబడినవి గ్రంథకర్త వెంకటగిరి ప్రభువు వెలుగోటి సర్వజ్ఞ కుమార యాచేంద్రభూపతి

ఇందలి గ్రంథాంతరము 1 a గీతార్థసార సంగ్రహము

---

## No 2265. సారాంశపంచకము.

## SĀRĀMŚAPANCAKAMU

Substance, paper Size, 6⅞ × 8⅝ inches Pages, 12 Lines, 17 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 76-*a* The other work herein is —1 *a* Gitārthasāra sangrahamu

Complete

Same work as the above

(వి-వి)—

సమగ్రము వ్రాత మంచిది తప్పులున్నవి శైథిల్య గ్రంథపాతములు లేవు. పూర్వమువలె

ఇందలి గ్రంథాంతరము—1 a గీతార్థసారసంగ్రహము

గ్రంథాంతమున నిట్లు గలదు —

"శాలివాహనశకము—యువనామ సంవత్సర వైశాఖ శు ౧౧ ఆదివారము

## No. 2266 సారార్థ చతుష్టయము

## SĀRĀRTHA CATUSTAYAMU

Substance, palm leaf Size, 8½ × 1⅜ inches Pages, 4 Lines, 10 on a page Character, Telugu Condition, fair Appearance, old Mode of writing, good and not free from mistakes

Begins on fol 46 *a* of the manuscript described under No 2103

Complete

Describes some of the principles of Visistādvaita as explained by Ilayālvar to Nedādhūriyammal

**Beginning**

నైడాధూరి యమ్మాళ్లకు ఇళయాళ్వారానతిచ్చిన సారార్థ చతుష్టయము ఏలిన వారి శ్రీ పాదములు తంజమని ఉండేటి మన ఆచార్యులు తంజముగానున్నా, భోగముగా నున్నా అను సంధించిన్నీ ఉద్దేశించిన్నీ ఉండేటివి నాలుగు రెండర్థములు గలవు

**End**

ఇట్లు సదాచార్య సంప్రదాయ సిద్ధమయిన ఈ యర్థములలో ఆచార్యుడంగీక రించిన ముముక్షువునకు ఆవ్యకున్నా జ్ఞాతవ్యము రామానుజ ప్రపత్తిచేసిన వాని యొక్క ప్రకృతియందు ప్రాకృత నిరూపణమును అంటకుండుట ప్రకృత్యాత్మ వివేకము గలవారు ప్రపన్నుని ప్రభావమును చూడక ప్రకృతిని చూచిరేని తాను తొల్లింటి ప్రాకృతుండై పోవునని నంబిళ్ల వార్త

(వి-వి)—

సమగ్రము వ్రాంత బాగుగానున్నది తప్పులున్నవి. శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

స్వరూపజ్ఞానము, స్వరూప యాథాత్మ్య జ్ఞానము, విరోధిజ్ఞానము, విరోధి యాథాత్మ్యజ్ఞానము, నను నాల్గు సారార్థముల వివరణము నైడాధూరి యమ్మాళ్‌కు ఇళయాళ్వారి యుపదేశ రూపముగా నిందుగలదు ఇది విశిష్టాద్వైత సంప్రదాయ గ్రంథము.

ఇందలి గ్రంథాంతరమునకు నెం 2103 దు జూచునది

---

## No 2267 సిద్ధాంతసారము.

## SIDDHĀNTASĀRAMU

Substance, palm leaf Size, 13¾ × 1⅝ inches Pages, 30 Lines, 5 on a page Character, Telugu Condition, injured. Appearance, old Mode of writing, not bad but full of mistakes

Complete

Describes some of the principles of advaita Vēdānta Written in Colloquial Telugu The name of the author is not known

**Beginning**

నిరంతరాయోస్తు

గురుర్దీప శ్శివశ్చాత్మా నామరూప క్రియాత్మకః

స ప్రకాశో నదృక్ దృశ్యం తస్మై శ్రీగురవే నమః

సమస్తమైన శుద్ధబుద్ధ ముక్తులయిన ప్రతికిన్ని స్వవివర్తమైన దేహేంద్రియాది ప్రపంచంలోను కొంత నేననిన్ని, కొంత నాదనిన్నీ, కొంత అన్యమనిన్ని అకర్త అయినటువంటి తన్ను కర్తననిన్నీ అభోక్తైనటువంటి తన్ను భోక్తననిన్నీ పుణ్యపాప ఫలరహితుండైన తాను పుణ్యపాప ఫలాలను పొందుచున్నాననెడి రూపమయిన అవిద్యచేతను ఆవృతులై అనాది సంసారమందు మగ్నులయిన వారివలెనే ఉండే జీవుల జూచి దయా సముద్రులయిన ఆచార్య స్వాములవారు తమవలెనే సమస్తజీవులూ ఆనందమాత్ర స్వరూపులై వుండురుగాక అని ఆత్మస్వరూపము ఉపదేశింప తలంచి

**End**

కర్మంపోతే దాని కార్యమైన శరీరం రాకపోవును శరీరంపోతేను దానివల్ల వచ్చే దుఃఖంపోవును ఇటువంటి జ్ఞాన ఇటువంటి జ్ఞానం యే జాతి వాడికైనా యే ఆశ్రమము చాతపూజ్యులు వారికి కర్తవ్యమే లేదు వారే పరమాత్మ స్వరూపులు ఇది శ్రు చెప్పఁబడ్డటువంటి సిద్ధాంతసారము

పంచ వింశతి తత్త్వ

జటీ ముండీ శిఖీవాపి ముచ్యతేనాత్ర

(వి-వి)—

సమగ్రము వ్రాఁత చెడ్డదిగాదు తప్పులున్నవి శైథిల్యము చాలఁగలదు గ్రంథపాతములు చాలఁ గలవు

అద్వైత వేదాంత సిద్ధాంతము సారరూపముగానిందుఁ జూపఁబడినది సంస్కృత గ్రంథమునకిది తెలుఁగైయుండును కర్తృ పేరెఱుఁగరాదు ఇది వ్యావహారిక భాషలోనున్నది

---

## No 2268 సిద్ధాంతసారము

## SIDDHĀNTASĀRAMU

Substance, palm-leaf Size, 15¼ × 1¼ inches Pages, 18 Lines, 6 on a page. Character, Telugu Condition, good Appearance, old Mode of writing, good and almost free from mistakes

Complete

A work on advaita Vēdanta, probably a Telugu rendering of the Sanskrit original The name of the author is not known

**Beginning**

శ్రీ గురుస్స్వశివస్స్వాత్మా నామరూప వివర్జితః।
స్వప్రకాశో సదృగ్దృశ్యం తస్మై శ్రీగురవేనమః॥

సమస్తమైన ప్రాణులున్నూ నిత్య శుద్ధబుద్ధ ముక్తులైనవ్వటికిన్ని స్వవివర్తమైన దేహేంద్రియాది ప్రపంచముగాను, కొంత నేననిన్ని కొంతనాదనిన్ని కొంత అన్యమనిన్ని అకర్తఅయినటువంటి తను కర్తననిన్ని అభోక్త అయినటువంటి తన్ను భోక్తఅనిన్ని పుణ్యపాప ఫలరహితుండైన తాను పుణ్యపాపాలను పొందుచున్నా ననేటి భేద దృష్టిరూపయిన అవిద్యచాతను ఆ వృత్తులై అనాది సంసారమందు మగ్నులయిన వారింపలెనె ఉండేటి జీవులంజూచి దయాసముద్రులయిన ఆచార్య స్వాముల వారు తమవలెనే సమస్త జీవులున్నూ ఆనందమాత్ర స్వరూపులై వుండరుగాక, అని ఆత్మ స్వరూపమును ఉపదేశము శాయుదలంచి వాజ్మనసాతీతం గనక అధ్యారోపాప వాద న్యాయముచేతను

**End**

గురు కృపవలనను ఎప్పుడు జ్ఞానం పుట్టినదో వారు బ్రహ్మాదులచేత పూజ్యులు వారికి కర్తవ్యంలేదు వారు పరమాత్మ స్వరూపులు ఇది శ్రుతి స్మృతీతిహాస పురాణ వస్తు వచనాల చెప్పబడ్డ టువంటి సిద్ధాంతసారము పంచవింశతి తత్త్వజ్ఞోయత్ర కుత్రాశ్రమేవసేత్ శ్రీ గురు పరబ్రహ్మార్పణమస్తు

గ్రంథాంతమందీ వ్రాంతగలదు —

"వ్యయనామ సం॥ ఫాల్గున శు ౫ శుక్రవారం వర్కు మాజేటి సర్వేశలింగం గారికి సుత్తురుభగి శ్రీ బూరుగుపల్లి చెన్న మల్లికార్జునింగారి శిష్యులు నూలి వీరేశ అనే వాడు సిద్ధాంతసారం సంపూర్ణంగావ్రాసి ఉమామహేశ్వరార్పణంగా ఇచ్చెను"

(వి-వి)—

సవగ్రము వ్రాంత మంచిది తప్పులు లేవు శైధిల్యము లేదు గ్రంథపాత ములు లేవు

అద్వైత వేదాంత విషయమిందుంగలదు గ్రంథకర్త పేరెఱుంగరాదు. సిద్ధాంత సారమను సంస్కృత గ్రంథమున కిది తెలుంగయియుండును—

---

## No 2269. సీతారామాంజనేయ సంవాదము.

## SĪTĀRĀMĀNJANĒYA SAMVĀDAMU

Substance palm leaf Size, 13 × 1¼ inches Pages, 178 Lines, 6 and 7 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old. Mode of writing, fair, free from mistakes

Complete

A Vēdāntic work based on Rāmahrdaya found in Ādhyātmarāmāyana which is included in Brahmāndapurāna Parasurāmapantula Lingamūrti is the author He has dedicated the work to his teacher Mahādēvaguru

**Beginning**

శా శ్రీమద్దివ్యనిజాంఘ్రి, పద్మములు సంసేవింపుచున్ భక్తిచే
ధీమంతుండగు నాంజనేయునిల సద్దేహేంద్రియాతీతచి
ద్ధామానందుఁడ నీవు నేనని కృపన్ బోధించు శ్రీ జానకీ
రామబ్రహ్మము నంతరంగమున నారాధింతు నశ్రాంతమున్

* * * *

క ఆరయ మద్బాల్యంబున
గారవమునఁ జిత్తశుద్ధికరముగ నాకున్
దారక యోగము దెలిపిన
నారాయణ గురువులను మనంబునఁ గొలుతున్

* * * *

ఉ నన్నయభట్టు నాంధ్రకవినాదులఁ దిక్కన సోమయాజులన్
బన్నగ సోమసత్కవుల భాస్కరబమ్మెర పోతరాజులన్
మున్న ప్రసిద్ధిగాంచు కవిముఖ్యుల నందర నెమ్మనంబులో
నెన్ని నమస్కరించెద నభీష్టఫలాప్తి కలుంగునట్లుగాన్

* * * *

సీ గీ ప్రేమమీఱంగ శ్రీరామ రామరామ
యనుచుఁ దనపేరు నొడువుచు నద్భుతముగ
శ్రీ మహాదేవగురుఁడైన రామవిభుఁడు
కరుణతోడుత నెదుట సాక్షాత్కరించె

వ ఇట్లు శిష్యవాత్సల్యంబున సాక్షాత్కరించి మదీయ దీర్ఘదండ నమస్కారంబులు చతుర్విధ పురుషార్థప్రద చతురక్షరసమన్విత నారాయణస్మరణ పూర్వకంబుగా నంగీకరించి కలకల నవ్వుచు శరీరత్రయ విలక్షణావస్థాత్రయసాక్షి పంచకోశ వ్యతిరిక్త సచ్చిదానంద స్వరూప ప్రత్యగాత్ముండవైన నీవ సత్యజ్ఞానానంద పరమాత్మ స్వరూపుండవైన నేను, సచ్చిదానందరూప ప్రత్యగాత్ముండవైన నీవని సర్వోపనిషత్సారభూతంబైన పరమతత్త్వ రహస్యార్థం బుపదేశించి . . అని యాజ్ఞాపించి యిప్పుడీవు బ్రహ్మాండపురాణంబునం దధ్యాత్మ రామాయణంబు మామహేశ్వర సంవాదరూపంబై యొప్పునందు శ్రీరామ హృదయంబను నితిహాసంబు సీతారామాంజనేయ సంవాదంబునం బ్రవర్తిల్లునది సంక్షేపరూపంబు గావున నయ్యర్థంబు విస్తరించి యొక్క

ప్రబంధంబుగా రచియించి నాపేర నంకితంబు సేయుము సర్వపాపవినిర్ముక్తుండ వయ్యెదవని యానతిచ్చి తిరోహితుండయ్యె నంతట మేల్కాని యానందభరితాంతః కరణుండనై.

* * * *

వ. అని విచారించి సంతోషభరితచిత్తుండనై మదీయాచార్య పరంపరావతారం బభివర్ణించెద

* * * *

క. ఆ దత్తాత్రేయ గురు
శ్రీ దివ్యపదారవింద సేవానిధి శ్రీ
మోదుఁడు ప్రత్యక్ష ప్ర
హ్లాదుఁడు నా శ్రీ జనార్దనాహ్వయుఁ డొప్పెన్

మ. తన వాత్సల్యము శాస్త్రచింతనము నాత్మజ్ఞానముం జూచి హె
చ్చినమూర్తిన్ నిజరూపదివ్యములచే శ్రీ భారతి మోక్షకా
మిన లేతెంచి యహర్నిశంబుఁ దను నెమ్మింగొల్వఁగా శ్రీ జనా
ర్దనయోగీశ్వరుఁ డొప్పె నెల్లెడ నవిద్యాధ్వాంతమార్తాండుఁడై

గీ. ఆ జనార్దనగురున కత్యద్భుతముగ
శ్రీమదేకో గురుస్వామి శిష్యుఁడయ్యె
మును వసిష్ఠ మహామునీంద్రునకు నర్థి
దాశరథి భక్తుఁడైన చందంబు దనర

* * * *

సీ. గీ. స్వకృతగీతాది శాస్త్రభాష్యంబు లెల్ల
వేదతుల్యంబులై ధాత్రి వెలయుచుండ
వామదేవశుకార్జున వ్యాసభీష్మ
సదృశుఁ డేకో జనార్దనస్వామి వెలసె

క. ధరలో నారాయణునకు
నరుగతి నేకో జనార్దనస్వామికి శ్రీ
నరహరి మహేశగురుఁ డ
చ్చెరువుగ సద్భక్తి మెఱయ శిష్యుండయ్యెన్

* * * *

క. ఆ నరహరి సద్గురునకు
శ్రీ నాగో రామగురుఁడు శిష్యుండై వి
జ్ఞానంబునఁ బ్రత్యక్ష
శ్రీ నారాయణుఁ డనఁ బ్రసిద్ధివహించెన్.

* * * *

క. ఆ నాగో రామునకున్
శ్రీ నారాయణున కజుని చెలువున భక్తిం
డై నెగడె నెల్లదిక్కులఁ
గానేరు గురుండు దత్త్వకోవిదుఁ డగుచున్

శా. ఆ కోనేరు గురూత్తముం గొలిచి దివ్యాధ్యాత్మయోగంబునన్
శ్రీ కల్యాణగుణ ప్రసిద్ధుఁడగుచున్ శ్రీమన్మహాదేవ శాం
కైకాచార్యుఁడు వేడ్కతోడుతను సౌఖ్యంబొప్ప సాందీపనిన్
శ్రీ కృష్ణుండు భజించి విద్యలానరం జేకొన్న చందంబునన్

* * * *

గీ. అమ్మహాదేవగురు చరణారవింద
పరశురామాంశ భజనతత్పరుఁడఁ బరశు
రామ శంతులకులహిత రామ మంత్రి
మౌళి తిమ్మాంబికా ప్రియాత్మజుఁడ నేను

* * * *

క. శ్రీ మద్దత్తాత్రేయ మ
హామునివంశ్యునకు శ్రీ మహాదేవగురు
స్వామికిఁ దత సర్వాంత
ర్యామికి విజ్ఞానభూమి కా రామునకున్

**End**

క. శ్రీరామ హృదయమును బ
ల్మాటున్ వీక్షించు బుధసమాజంబునకున్
శ్రీరామతత్త్వ సాక్షా
త్కారంబగుఁ గలుగుఁ బరమ కైవల్యంబున్

క. ఆతతముగ నెఱిఁగించితి
సీతారామాంజనేయ చిత్సంవాదం
బీ తత్త్వామృతమాని ని
రాంతకసుఖాబ్ధి నోలలాడుము గిరిజా!

* * * *

మత్తకోకిల

నీవు నా హృదయాంబుజంబున నిల్చి భానునికైవడిన్
గేవలాత్మవివేకమున్ వెలుఁగింపుచుం బరికింపఁగా
బావనంబగు రాజయోగముఁ బల్కితిం దగ శ్రీ మహా
దేవ సద్గురుమూర్తి గావుము దీని నియ్యెలరంజిలన్

* * * *

మాలిని

ఘనతర సువివేకా కల్పితాశేషలోకా
వినమితబుధలోలా విశ్వవిఖ్యాతలీలా
జననుతగణతంత్రా సర్వతంత్రస్వతంత్రా
మునిసరసిజమిత్రా మోక్షలక్ష్మీకళత్రా

## Colophon

ఇది శ్రీమన్నారాయణ మహాదేవగురు కరుణాకటాక్ష వీక్షణావిమర్శితాఖండ సచ్చిదానందైక రసస్ఫూర్తి షట్చక్ర సీతారామమూర్తి పరశురామ పంతుల లింగమూర్తి ప్రణీతంబైన శ్రీ సీతారామాంజనేయ సంవాదంబను యోగశాస్త్రంబునందు సమనస్కయోగానుభవంబు నన్నది సర్వంబును దృతీయాశ్వాసము

(వి-వి)—

సమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులు లేవు కైదిల్యము లేద

బ్రహ్మాండపురాణాంతర్గతంబైన యధ్యాత్మ రామాయణమునఁగల రామ హృదయమను గ్రంథభాగము ననుసరించి రచితమయిన వేదాంతగ్రంథమిది సాంఖ్య తారకా మనస్కయోగవిషయము లిందు సవిస్తరముగాఁ జెప్పఁబడినవి పరశురామ పంతుల లింగమూర్తి కవి దినికిఁ గర్త అతఁడు తన యాచార్యుఁడగు మహాదేవగురు నకుఁ దీనిఁ గృతిసేసినాఁడు ఆ మహాదేవగురుని యాచార్యపరంపర ఉదాహృత గ్రంథ భాగమునఁ గాననగును దత్తాత్రేయ యోగి యీ పరంపరలోఁ దొల్తటివాఁడు

గ్రంథాంతమందు ద్వ్రాంత గలదు —

సీ. వలనొప్ప శ్రీ ఖర వత్సర ఫాల్గున
శుద్ధత్రయోదశీ సోమతనయ
వారమువఱకుఁ బెంపారంగ శృంగార
కవి వేంకటాఖ్య సచివవరాత్మ
సంజాత వేంకటేశ్వర నామధేయుండు
లలిత సీతారాము లలము కరుణ
దనరఁగాఁ బవన నందనునకు శ్రీమహా
దేవుండు శ్రీ మహాదేవియలర
సరవిఁ జెప్పిన యోగశాస్త్ర ఘనమహిమ
లన్ని యుపదేశమొనరించినట్టి సత్ప్ర
బంధము ముదంబురాశి సంబంధమెలమి
నమర శ్రీరామ చంద్రార్పణముగ వ్రాసె

## No 2270 సీతారామాంజనేయ సంవాదము

## SĪTĀRĀMĀNJANĒYA SAMVĀDAMU

Substance, palm leaf Size, 16⅛ × 1⅝ inches Pages, 8 Lines 6 on a page Character, Telugu Condition good Appearance, old Mode of writing, fair but not free from mistakes

Begins on fol 17 *a* The other works herein are —1 *a* Ātmadarśanamu, 10 *a* Jīvēsvaranirnayamu, 14 *b* and 28 *a* Kirtanalu, 21-*a* Misrārpanamu, 49 *a* Jivēsvarasamvādamu, 55 *a* Śiva Dandakamu, 59 Dvādasamanjarikāstōtramu, 67 *a* Parabrahmasakalavilaksanatvanirnayamu

This is the same work as the above

Incomplete

(వి వి)—

ఆసమగ్రము గ్రంథైకదేశమిందు గలదు వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్య గ్రంథ పాతములు లేవు

పూర్వము నోట

ఇందలి గ్రంథాంతరములు —1a ఆత్మదర్శనము 10a, జీవేశ్వర నిర్ణయము 14b, 28a కీర్తనలు, 21a మిశ్రార్పణము 49a జీవేశ్వర సంవాదము 55a శివ దండకము 59a ద్వాదశమంజరికా స్తోత్రము 67 పరబ్రహ్మ సకలవిలక్షణత్వ నిర్ణయము

---

## No 2271 సీతారామాంజనేయ సంవాదము

## SĪTĀRĀMĀNJANĒYA SAMVĀDAMU

Substance, paper Size, 12⅝ × 7⅝ inches Pages, 108 Lines, 15 to 20 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, good but not free from mistakes

Begins on fol 104 *a* The other works herein are —1 *a* Pānduranga māhātmyamu, 162 *a* Mairāvanacaritra, 208 *a* Rāmastavarājamu, 281-*a* Bhānumadvijayamu, 328 *a* Ātmānandarasamanjari, 364 *a* Vīra cōdavvacaritra, 399-*a* Akkamahādevicaritra, 418 *a* Gurunambicaritra, 435-*a* Venkatēsvaramāhātmyamu and 467 *a* Vēnkatācalamāhātmyamu

Incomplete

Same work as the above

(వి వి)—

అసమగ్రము ద్వితీయాశ్వాసమునుండి కొంత గ్రంథము మాత్రముగలదు కడపటి 20 పుటలు పుటకొక పంక్తి మాత్రమే వ్రాంతగలదు వ్రాంత తిన్ననిది తప్పులున్నవి శైథిల్యముగలదు గ్రంథపాతములు లేవు

పూర్వము వోలె—

ఇందలి గ్రంథాంతరములు—1a పాండురంగ మాహాత్మ్యము, 162a, మైరావణ చరిత్ర, 208a రామస్తవరాజము, 281a భానమద్విజయము, 328a అత్మానంద రసమంజరి, 364a వీరచోడవ్వచరిత్ర, 399a అక్కమహాదేవి చరిత్ర, 418a గురు నంబిచరిత్ర, 435a వేంకటేశ్వర మాహాత్మ్యము, 467a వేంకటాచల మహాత్మ్యము

---

## No 2272 సోమనాథ స్తవము

## SŌMANĀTHASTAVAMU

Substance, palm leaf Size, $10\frac{3}{8} \times 1\frac{1}{8}$ inches Pages, 14 Lines, 5 on a page Character, Telugu Condition, slightly injured Appearance, old Mode of writing, fair but not free from mistakes

Complete

Written in praise of Pālkuriki Sōmēsvara and other teachers of Vīraśaiva system The name of the author is not known

**Beginning**

శ్రీగురులింగ మూర్తిక దయాపాంగ
యోగీంద్ర హృదయేశయరగేంద్రభూష

*    *    *    *

పాయకకిన్నెర బ్రహ్మయ్య పిలువ
నోయని పలికిన యొడయరక్షింపు

*    *    *    *

ఎన్నెన్ని జన్మంబు లెత్తితినిన్నుఁ
గన్నులఁగానక కష్టుండనైతి

*    *    *    *

పుడమిభక్తుల యిండ్లబడి పనుల్సేయు
పడతికడ్పునవైనఁ బ్రభవింపఁజేయు

*    *    *    *

భక్తుల సంగంబు భక్తసద్గోష్ఠి
భక్తుల పదసేవ పదపడి సేయఁ
గరిమర్థినొసఁగ వేక అకంరమూర్తి
గురునాథ శ్రీపాలకుఱికి సోమేశ !

**End**

అనుదినం బీస్తవంబర్థిఁ బఠింపఁ
బనివూని చదివిన భావించివినిన

నరయంగ వ్రాసిన నభవభక్తులకు
దొరకును సద్భక్తిమహిమముల్ దొలఁగు
పటిగంగవట్టిన్నల భావంబుగలుగు
గురుభక్తి చెన్నొందు గోష్ఠ్యమైనట్టి
పరమలింగైక్య సంప్రాప్తి చేకూరు
పరిహృతంబగు జన్మబాధ లన్నియును
వరమహరుండైన పాల్కురికి నిలయా
కరుణతోఁ బ్రోచునుగల కాలమెల్ల

(వి-వి)—

సమగ్రము వ్రాంత తిన్ననిది తప్పులంతగా లేవు శైథిల్యము లేదు గ్రంథపాతములు లేవు

పాల్కురికి సోమేశ్వరస్వామి స్తుతిరూపమయిన యీచిన్న ద్విపదకృతిలో పలువురు వీరశైవాచార్యులు ప్రస్తుతింపబడిరి కర్త పేరెఱుఁగరాదు

---

## No. 2273. హరభక్త విలాసము.

## HARABHAKTAVILĀSAMU

Substance, paper Size 11 × 7¾ inches Pages, 165 Lines, 22 on a page Character Telugu Condition, good Appearance, old Mode of writing, good but almost free from mistakes

Incomplete

This is a Telugu version of the same work in Sanskrit, which is an Upapurāna of Skāndapurāna The name of the author is Pāpaya

**Beginning**

శా॥ శ్రీ రాజీవముఖామరుల్ గొలువఁగా శ్రీభామరీయుక్తుఁడై
శ్రీవర్ధిల్లెడి శ్రీనగాగ్రమున నర్థిన్నిల్చి లోకంబులే
లేవాత్సల్యము మీఱ నేలెడిమహాదేవుండు మల్లేశ్వరుం
డావిర్భూత దయాకటాక్షమున మమ్మత్యంతముం బ్రోవుతన్.

* * * *

సీ॥ తనకు శివునకు భేదమింతయును లేక
వసుధ వర్తిల్లు గురుచక్రవర్తి ననఘ
మూర్తి దిగ్భరితానూన కీర్తిదోడి
కొండ నందీశ్వరుని మదిఁ గోరితలఁతు

సీ॥ శ్రీ పర్వతశ్రేష్ఠ నేవరొనర్పుచుఁ
బార్వతీ దేవిని బ్రస్తుతింతు

బాణక నృపాధీశు సన్నుతిగావింతు
    భృంగీశ్వరునిఁ గడుఁ బ్రీతిఁదలఁతు
చండేశ్వరుని కేలు జాఁగిలి మ్రొక్కుదఁ
    బాణాళి గంగను భక్తిఁగొలుతు
నారామ వీరేశు నభినుతి సేయుదు
    షణ్ముఖ స్వామిని సంస్మరింతు

మరియు నాశైలవరమున మహిమనమరు
సిద్ధముని వన    సరసీతటాక
సానుతటి నీకులాయజ సత్వకుండ
మరములన    సన్మతిభజింతు

*    *    *    *

ఉ  మల్లమకల్లి వంశజుఁడు మావరభక్తి పరుండునాదు పే
నల్లుఁడు సంస్కృతాంధ్ర కవనాఢ్యుఁడు బుచ్చయ సత్కవీంద్రుఁడు
త్వల్లమనీష నీకృతికిఁ బొందుగ సాయమొనర్పఁ జెప్పితిన్
దెల్లమిగాఁగ దిద్ది ధరణిం బ్రబలింపుము దీని సత్కవుల్

*    *    *    *

సీ  భవదగ్ర జన్ముఁడో బసవనామాత్యుండు
    సరస సాహిత్యవిశారదుండు
భరతకళా ధురంధరుఁడు గానామృత
    ప్రీణితారాధ్యుండు కృపయుతుండు
నౌషధ సేవ సేయని సిద్ధపురుషుండు
    శివతత్త్వవేది సుశీలయుతుఁడు
వేయవరోధ మందేనియు దినముశం
    భుని ప్రసాదంబు మానని వ్రతుండు

శివపురాణంబుతానె చూచికొని చదువు
నిత్యనియమ గరిష్ఠుండు సత్యశాలి
శైవపాదపయోరుహచంచరీకుఁ
డతనిఁగొనియాడఁ దరమె వాక్పతికినైన

గీ  ఇట్టి వంశంబునను బుట్టి నట్టి నీకు
శివుఁడు సన్నిధి సేయుట చిత్రమగునె
యమ్మహాదేవుఁ గృతిగఁ గావ్యము ఘటింపు
మతుల సద్గుణసాంద్ర ! పాపయ కవీంద్ర

**Colophon**

ఇది శ్రీ చెన్నమల్లికార్జున కరుణాకటాక్ష లబ్ధకవితా మాధురీధురీణ కౌశికగోత్ర పవిత్ర శ్రీ గిరిరాజపుత్త్రి సుకవిజన విధేయ పాపయ నామధేయ ప్రణీతంబైన స్కాందోప పురాణంబను మహాకావ్యంబునందు ప్రథమాశ్వాసము

**End**

ఉ నాగడుఁ బత్ర్య్రియం బెటిఁగినందనుఁడొక్కరు డైన శోక నే
నీగతినెట్టులుండఁగ సహింతునటం వటుడాన గుంది యి
చ్ఛాగతి వేఁటలాడుటయు సర్వసుఖంబుల మానియున్న నా
ల నుగ్రహించి పొమ్ము చుఁ గులంబునఁగల్గిన పెద్దలయ్యెడన్

ఉ ఆతనిఁ జేర నేఁగి యటులాఁడి నెంజిలి చెంద కాత్మజో
ద్భూతికిఁ గారణంబయిన శ్రోవ యొకండు ఘటింతుమేము ర
మ్మీతరిఁ నంచు వాని వెలయించి రయంబునఁ జక్కఁ గాంతితో
పేతవనస్థలంబునకుఁ బ్రేమ మెయిం గొని పోయియచ్చటన్

ఉ కన్నులు రెండు మూసి వెలిగన్

(వి వి)—

అసమగ్రము ఆదినుండి ద్వితీయాశ్వాసము కొంతదాఁక గలదు ప్రథమాశ్వాసమున 740 పద్యములు గలవు ద్వితీయాశ్వాసమున మున్నూట ముప్పదివ పద్యముదాఁక గలదు వ్రాఁత యొకతీరున నున్నది గాని తప్పులు చాలఁ గలవు

స్కాందోప పురాణమగు హరిభక్తవిలాసమను సంస్కృత గ్రంథమున కిది తెలుఁగు. ఇందు శివభక్తులగు నఱువత్తు మూవుర చరిత్రలు వర్ణితములు గ్రంథకర్త పాపయ కవి విశేషము లెరు కు టాహృత గ్రంథభాగము గాంచునది